శ్రీమాన్ బుక్కపట్టణ రాఘవాచార్య
ప్రణీతము

ప్రకాశకులు

**శ్రీశరణ్మయి**

(సారస్వత విభాగము)

టి ఆర్ టి 141, విద్యానగర్ కాలనీ,

న్యూ నల్లకుంట పోస్టు, హైదరాబాద్ - 500 044

ఫోన్ నెం : 7601212

శ్రీ

# కువలాశ్వ విజయము

## (హూణభాషాంధ్ర దివ్యకథా ప్రబంధము)

గ్రంథకర్త

శ్రీవాధూల మునావహార పవిత్ర శఠమర్షణ గోత్ర
బుక్కపట్టణకుల కలశాంబుధి రాకాసుధాకర
విద్యానగర సంస్థాన సముపార్జితానేకాగ్రహార బిరుదాంచిత
కర్ణాట రాజాచార్య శ్రీవేంకటాచార్య పౌత్ర
శ్రీనివాస తాతాచార్యపుత్ర స్వీయ మేధా వ్యయం సముపార్జిత
రాజకీయ హూణ భాషా పాండితీ మండిత అష్టావధాన
కరణ పణ శిష్టజనహిత వైయాకరణ పండిత

**శ్రీబుక్క పట్టణ రాఘవాచార్యులు**

ప్రకాశకులు

**త్రిశరణ్మయి**

(పాద్యుత విభాగము)
టి.ఆర్.టి. 141, విద్యానగర్ కాలనీ,
న్యూనల్లకుంట పోస్టు, హైదరాబాద్ - 500 044.
ఫోన్ నెం. : 7601212

ప్రథమ ముద్రణ : 1996

కాపీలు : 1000

Composed and Designed by S.S. DATA PRODUCTS, Chikkadpally, Hyderabad Ph 663406

Printed by KARSHAK ART PRINTERS, O.U Road, Vidyanagar, Hyderabad - 44 Ph 7618261

వెల : రూ. 150/-




... తిరుమల తిరుపతి దేవస్థానము
... యముతో ప్రచురణ చేయబడినది.

Professor S.B Raghunathacharya
Vice-Chancellor
Central Sanskrit University
Tirupathi

# ప్రస్తావన

బుక్కపట్నం పేరు వినగానే అనంతపురం జిల్లాలో పుట్టపర్తికి సమీపములో ఉన్న ఒక చిన్న ఊరు జ్ఞాపకం వస్తుంది. ఈ పట్టణం ఇప్పుడు చిన్నదిగా కనబడుతున్నా ఒకప్పుడు బుక్కభూపతి స్మారకంగా కట్టబడిన పట్టణమని తెలుస్తున్నది. బుక్కపట్టణం ఇంటిపేరుగా గల కవిపండితులెందరో సంస్కృతశాస్త్రంలోను తెలుగు సాహిత్యంలోను అద్వితీయమైన తమ ప్రతిభకు నిదర్శనలుగా ఎన్నో గ్రంథాలను రచించారు. వీరందరికీ మూలస్థానం ఈగ్రామమే అయిఉండటానికి అవకాశం కనబడుతున్నది. చారిత్రకాధారాలను పరిశీలిస్తే బుక్కపట్టణం ఇంటిపేరుగాగల వారిలో అనేక గోత్రాలవారున్నట్లు తెలుస్తున్నది. అందులో కౌండిన్యగోత్రులు, శఠమర్షణగోత్రులు సుప్రసిద్ధులు. కాలక్రమంలో బుక్కపట్టణంవారు తమ పాండిత్యప్రతిభలను గుర్తించిన ఆయారాజాస్థానాల్లో పండితులుగ, కవులుగ సన్మానములను గడించినట్లు తెలుస్తున్నది అనంతపురం జిల్లా ఆంధ్ర-కర్ణాటక రాష్ట్రాల సరిహద్దుల్లో ఉండటంచేత కర్ణాటక రాష్ట్రంలోని గుల్బర్గాజిల్లాలో కృష్ణా-భీమనదుల మధ్యలోగల 'సురపురాన్ని 18 వ శతాబ్దంలో పరిపాలించిన శ్రీరాఘవనాము నాయకుని ఆస్థానములో బుక్కపట్టణం వారు పండిత కవులుగ ప్రసిద్ధిని సంపాదించారు.

కౌండిన్యగోత్రులు మహాపండితులైన బుక్కపట్టణం శ్రీనివాస తాతాచార్యులవారికి వేంకటాచార్యులు, అన్నయాచార్యులు, శ్రీనివాసాచార్యులని ముగ్గురు కుమారులు ఆంధ్ర సంస్కృత కన్నడ మహారాష్ట్ర భాషలలో మహావిద్వాంసులుగా ప్రసిద్ధి పొంది సురపురం ఆస్థానములో ఉండటంవల్ల వారికి ' సురపురం సోదరులు ' అనే వ్యవహారం ఉండేది. న్యాయ విశిష్టాద్వైత వేదాంతాలలో వీరి రచనలు సుప్రసిద్ధాలు. వీరిలో అన్నయాచార్యులవారికి

శ్రీనివాసాచార్యులు, వేంకటాచార్యులు, బుచ్చి [illegible]
కొడుకులు. పెద్దవారైన వేంకటాచార్యులుగారికి [illegible]
గారనే ప్రసిద్ధి ఉండేది. విశిష్టాద్వైత సిద్ధాంతం లో [illegible]
జయించి కిరీటాన్ని ధరించడం చేత వీరిః అ[illegible]
'అచలాత్మజా పరిణయ' మనే తెలుగు ప్రబంధాన్ని రచించినట్లు తెలుస్తున్న[illegible]
' వేదాన్తకారికావళి ' అనే సుప్రసిద్ధమైన విశిష్టాద్వైత ప్రకరణ గ్రంథాన్నిరచించిన వారు బుచ్చివేంకటాచార్యులవారు. ఇప్పటికీ మదపురం పట్టణం శివార్లలోని 'సిద్ధన అగసె' అనే చోట వీరి సమాధులున్నట్లు చెబుతున్నారు.

ఇక బుక్కపట్టణంవారిలో శఠమర్షణగోత్రానికి సంబంధించిన ఒక కుటుంబం మాజీవీడు సంస్థానములో సారస్వత సేవ చేసినట్లు తెలుస్తున్నది. శ్రీమాన్ బుక్కపట్టణం రాఘవాచార్యులవారు ఈకుటుంబంలో మూల పురుషులు వీరు వేదవేదాంగాలలో గొప్ప పండితులు. వీరికి అనంతాచార్యులు, చిన్నయాచార్యులని ఇద్దరు కుమారులు. పెద్దవారైన అనంతాచార్యులకు వరదాచార్యులు, వీరరాఘవాచార్యులని ఇద్దరు కుమారులు వరదాచార్యులకు వేంకటాచార్యులు, అనంతాచార్యులు, రామానుజాచార్యులు, రంగాచార్యులు అని నలుగురు కొడుకులు పెద్దవారైన వేంకటాచార్యులవారికి ఎనిమిది మంది కొడుకులు. వారిలో ఆఖరివారు శ్రీనివాస తాతాచార్యులుగారు. వీరు తెలుగు సంస్కృత భాషలలో మహా పండితులు. వీరి ధర్మపత్ని సింగమాంబ వీరికి అనంతాచార్యులు, రాఘవాచార్యులు, వేంకటాచార్యులని ముగ్గురు సంతానము రెండవవారైన శ్రీమాన్ రాఘవాచార్యులవారు సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో అష్టావధానాలు చేసి పండితులను మెప్పించినారు. వీరి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మినరసమ్మగారు. ఆచార్యులవారు అవధాన విద్యలో ఎంత ప్రసిద్ధులో మహాకవులుగా కూడా అంతపేరు కలవారు. శ్రీకువలాశ్వ విజయమనే ఈ ప్రబంధాన్ని ఆంధ్రదేశానికి అందించిన మహనీయులు వీరే. ఈ ప్రబంధానికి సంబంధించిన ఆశ్వాసాంత గద్యాలలోను, గ్రంథారంభ ములోను పై అంశాలు పొందుపరచబడ్డాయి.

*1. ఇది శ్రీనాథ (ముని) యమునావహార పవిత్ర శఠమర్షణ గోత్ర పవిత్ర ఆపస్తంబ సూత్ర బుక్కపట్టణ కుల కలశాంబుధి రాకాసుధాకర*

విజయనగర సంస్థాన సముపార్జిత దేవాగ్రహార బిరుదాంచిత కర్ణాటరాజాచార్య శ్రీ వేంకటాచార్య పౌత్ర శ్రీనివాస తాతాచార్యపుత్ర శిష్టజన హితాష్టావధాన కరణచణ కవిత్వ ప్రతిభా సముపార్జిత రాజకీయ హూణభాషా ప్రాభవ ప్రభావధుర్య వైయాకరణ పండిత రామాచార్య ప్రణీతంబైన కువలాశ్వ విజయంబున ప్రథమాశ్వాసము సంపూర్ణము.

ఈ ప్రబంధేతివృత్తం భాగవత మార్కండేయపురాణాలనుంచి తీసుకోబడింది ఆచార్యులవారు ప్రబంధ కవుల మార్గములో రచన సాగించి ఈ కువలాశ్వ ప్రబంధాన్ని సర్వాంగసుందరంగా తీర్చిదిద్దారు. ఈ కవిపైన కవిత్రయంవారి ప్రభావం, ప్రబంధకవుల ముద్ర ఎక్కువ ఉన్నదనడంలో సందేహములేదు. ప్రతి పద్యములోను మహాకవిత్వలక్షణం మనకు స్పష్టముగా గోచరిస్తుంది. స్వారస్యమైన కల్పనలు ఈ ప్రబంధములో కుప్పలు తెప్పలుగా కనబడుతున్నాయి. ఉదాహరణకు ఈక్రింది పద్యాలను గమనించండి:-

భావంబందున్ వివిధగతులన్నాగుగా జూచి చేయున్
రావే బాముల్ జనులకెపుడున్యప్రకారానబోవన్
'కేనామ్యః పరిభవపదం నిష్ఫలారంభయత్నాః
నానాకార్యార్థం బగునె వృథ భిన్నంబు సిద్ధంబు గాదే

సంస్కృతసాహిత్యానికి సుపరిచితమైన మందాక్రాంతవృత్తంలో కాళిదాస శ్లోకపాదాన్ని పేర్కొంటూ చేసిన కల్పన చమత్కారంగాను, ఆహ్లాదకరంగాను ఉన్నది.

సంధ్యాకాలం చీకట్లు అలుముకుంటున్నాయి. ఆకాశంలో నక్షత్రాలు విరిసాయి. ఈ భావాన్ని క్రింది పద్యాలలో కవి పేర్కొన్న పద్ధతి అనల్పకల్పనాధురీణతను తెలియజేస్తున్నది.

రమణుడు రాకమున్న చికురంబులు దువ్వియలంకరింపగాఁ
దమిఁదమి కాంతఁ పెన్నెఱులు తద్దయు విప్పి విదిర్చివోయినన్
దుమములు వర్వె రోదసిని దచ్చికురాంతరుదంచిత ప్రసూ
నములట లేచి పైకెగసె నా వినువీధిని దోచె తారకల్

''బిగిఁదమి రేమయూఖముల పెండిలిచేయఁగ రాజహోమమున్
బగులగ సాంధ్యరాగ శిఖిపై నిదిరో యని మంగళంబునన్
దగదగ కాలయాజ్ఞికుడు ధాన్యము వేయఁగఁ జిల్లపెల్లనై
కొగసెడు లాజలో యనఁగ నెల్లెడలవ్వెలసిల్లెఁదారకల్.''

ప్రభాతసమయాన్ని క్రింది పద్యంలో వర్ణించిన తీరు ఎంతో హృద్యంగా ఉంది.

''ఉరవడి సూరు తేరువ కుమారుడు గుఱ్ఱము బూని దానికిన్
వెరవగు దారి సూప నిమపీధికి వెళ్ళను వేగుఁజుక్కయి
వ్యరుసను నిద్రలేపఁగ్రుకవాకులు కొక్కొరొకోయటంచు ని
ద్దుర విడుమంచుఁ బద్మినిని దొందర సేసెను దేంట్లు ఝుంకృతిన్.''

తృతీయాశ్వాసంలో శ్రీసీతారాముల గొప్పదనాన్ని చెప్పిన పద్ధతి అద్వితీయంగా ఉన్నది. చూడండి

''సోముని వంటి శీతలుడు సూర్యునివంటి ప్రతాపశాలియున్
సామజవైరి వంటి బలశాలియుఁగాలుని బోలు ధర్ముఁడున్
గాముని వంటి సుందరుడు గల్గిన నిమ్మహిఁగల్గఁగాక శ్రీ
రాముని వంటి ధీరుడు ధరాసుతఁబోలిన సాధ్విగల్గునే.''

సంస్కృతాంధ్రభాషలకు సంబంధించిన ఎన్నో వృత్తాలను ప్రయోగించడం ఈకవికి ఆభాషలపైన ఛందస్సుపైనగల అధికారాన్ని తెలియజేస్తున్నది. తెలుగు జాతీయాలు, సామెతలు, పలుకుబళ్లు ఈయన కవిత్వంలో కోకొల్లలుగా కనిపిస్తున్నాయి. ఈ మహాకవి మునిమనుమలైన శ్రీమాన్ బుక్కపట్టణం తిరుమల ఆనందరామాచార్యులు గారు 1920లో వ్రాయబడిన ఈప్రబంధాన్ని 75సం. తరువాత వెలుగులోని తీసుకు రావడానికి చేసిన ప్రయత్నం అనన్యసాధారణం. ఆంధ్రదేశం సమహారా వీరిని అభినందిస్తుందని భావిస్తున్నాను.

తిరుపతి

18 డిసెంబర్ 95 ఎస్. బి. రఘునాథాచార్య

శ్రీమతే రామానుజాయనమః
శ్రీమతే వేదాంతగురవేనమః

శ్రీలక్ష్మీనృసింహ గురవే మరియు

# నమస్సుమాంజలి

శ్రీమాన్ బుక్కపట్టణము రాఘవాచార్యులు గారు (1848 - 1908 AD) నాకు మాతామహులు. వీరు శఠమర్షణ గోత్రోద్భవులు. శ్రీమాన్ శ్రీనివాస తాతాచార్యులుగారు వీరిజనకులు, తల్లి సింగమాంబ. ఈ పుణ్యదంపతులకు అనంత చార్యుడు, రాఘవాచార్యులు, వెంకటా చార్యులు అనుమూవురు పుత్రులు. వీరిలో రెండవ వారగు శ్రీమాన్ బుక్కపట్టణము రాఘవాచార్యులు శ్రీకువలయాశ్వ విజయము అను ప్రబంధ గ్రంధకర్త. వీరు తన పదునారవ యేట నుండియు సంస్కృతాంధ్ర భాషలను అష్టావధానమొనర్చిన సభలో మెప్పు కొనెడివారట. వీరు విశిష్టాద్వైత మతమునకు తగినటుల శ్రీలక్ష్మీనారాయణ ప్రార్థనతో తమ గ్రంధ రచనను ఆరంభించిరి. యీప్రబంధ మున భాగవత కథను, రామాయణ కథను, భారత కథను, శ్రీకృష్ణుని లీలలను సంగ్రహముగా చోటుచేసుకొనినవి. యిందు ఉపయోగించిన తెలుగు సామెత లు, లోకోక్తులు పెక్కు కలవు.

వీరు తమ యిష్ట దైవమగు శ్రీకృష్ణునకే తమ గ్రంథము అంకితమిచ్చిన ధన్య జీవి. వీరి ఏకైకపుత్రుండగు గోపయాచార్యులు భాగవతాగ్రేసరులు. వీరు గుంటూరు జిల్లా నరసరావుపేటలో పాత ఊరునందు తమ జీవితకాలము ఆదర్శ ప్రాయముగా గడపిరి. వీరికి ఏకైక పుత్రులు వీర రాఘవా చార్యులు సంతానము బడయక మునుపే పరమపదించిరి.

వీరి చతుర్థపుత్రిక మాడభూషి అమ్మాళమ్మ తండ్రిగారి వద్ద విద్యనభ్యసించిరి. సమాశ్రయణమును పొందిరి. వీరికి తండ్రిగారు రచించిన ప్రబంధము కంఠస్థమై, ఆశ్వకథను శైలి మనోహరముగ గానము చేసి వినిపించెడివారు. ఈమె కనిష్ఠ కుమారుడు శ్రీనివాసాచార్యులు అగునేను నా అష్టవర్షప్రాయమున విను భాగ్యము కలిగెను. దరిమిలా నేనడుగగా తమ తండ్రిగారు కష్టపడి వ్రాసిన గ్రంథము ఎవరితావున చేరినది తెలియలేదని వాపోయిరి.

నా 59వ యేట అనగా 1983సం.లో నా ఉద్యోగ విరమణానంతరము మా అమ్మగారు ఈ ప్రబంధ విషయమై నా చిన్నతనమున పలికిన విషయములు గుర్తు చేసుకొని, దీని ప్రాప్తికై ప్రస్తావన పలువుర ప్రశ్నించితిని. ఈ ప్రబంధ వ్రాత ప్రతి మదరాసు యూనివర్సిటీ లైబ్రరీలో R No 610 18-10-1920 న యుండినదని తెలియ వచ్చెను. అందుండి దాయవిభాగము శ్రీవేంకటేశ్వర యూనివర్సిటీ రిసెర్చి ఇన్స్టిట్యూట్, తిరుపతికి తరలినదని తెలిసెను వెంటనే తిరుపతి అడ్రసుకు జాబువ్రాయగా అచటి డైరెక్టరు Prof Dr S Venkatanarayanan గారు Ref OR1/38/MSS/84 తేది 10-2-84 సదరు ప్రబంధము కాపీవ్రాసి కొనుటకు నాకు అనుమతి నిచ్చిరి. యీ పురాతన గ్రంథ మెవ్వరియొ ద్దనున్నది తెలుసుకొనలేక గొట్టుమిట్టాడు నాకు ఈ ఉత్తరము కల్గించిన సంతోషమింతని చెప్పలేను దీనిని శ్రీవేంకటేశ్వరుని లీలగా భావించితిని సంతోషము పట్టలేక కంటనీరు కారనారంభించెను. వృద్ధుడను. చక్కెర వ్యాధితో బాధపడుచుంటిని శ్రియః పతిపై భారముంచి, తిరుపతి లైబ్రరీ సమీపముననే నివసించుచూ వ్రాతను పూర్తి చేయ సంకల్పించితిని. కాని తిరుపతిలో ఊరుబయట రెండుమైళ్ళదూరములో యున్న లైబ్రరీకి ప్రతిదినము వెళ్లుచూ 481 పేజీలు వ్రాయుట ఈ వయసులో సుమారు మూడువారములపై

చిలుకు అవట యుండనాకు సాధ్యమాయను చింతకలిగెను. యింతలో దైవము పంపినట్లు, నామేనకోడలు చిరంజీవి కుమారి గోమఠం విజయలక్ష్మి తిరుపతి S V యూనివర్సిటీలో RESEARCH చేయుచూ సెమ్నారు మాయింటికి వచ్చినది. తాను పనిపై Tirupathi లో అచటికి ప్రతిరోజు వెళ్ళుచుండుదునని, కాలీ సమయమందు లైబ్రరీలో ఆగ్రంథమును కాపీచేయుట తనకు సులువైనదని యనియు, వృద్ధాప్యములో నన్ను కష్టపడ వద్దని కోరి, నానుండి Authorisation Letter యొకటి తీసుకువెళ్లి, వారి అనుమతితో నాకు బదులుగా వ్రాతను పూర్తి చేసి తనమాట నెగ్గించుకొనిన సౌజన్యశీలి. ఈ ఉపకారము చేసిన చిరంజీవి జి. విజయలక్ష్మికి కృతజ్ఞత తెలుపుచున్నాను. ఈమెకు ఆయురారోగ్యములు శ్రీప్రదమే కల్యాణ సౌభాగ్యములు శ్రీవేంకటేశ్వర స్వామి సమకూర్చుగాక

నేను చిరంజీవి విజయలక్ష్మి వ్రాసిన ప్రతిని పరిశీలించి దానికి శుద్ధప్రతిని వ్రాసితిని. నామేనల్లుడు చిరంజీవి B T ఆనందరామాచార్యులు నేవ్రాసిన శుద్ధ ప్రతికి జిరాక్స్ కాపీలు సేకరించి పెట్టిరి. వీటిని సీతానగరంలో శ్రీ శ్రీ శ్రీ చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్‌స్వామి వారికి జూప దీనిని రెండు వాల్యూములుగా విభజించిన T T D వారి ద్రవ్య సహాయముతో అచ్చువేయించ నగునని వారు దివ్యమంగళా శాసనమొనరించిరి.

నామేనల్లుడగు చిరంజీవి B T A రామాచార్యులు T T D ద్వారా కొన్ని గ్రంథములు అచ్చువేయించిన అనుభవము కలదని విని, తాతాగారు వ్రాసిన శ్రీకువలాశ్వ విజయము T T D ద్వారా అచ్చు వేయించ సంకల్పించి అతనితో యీ విషయము హెచ్చరించితిని. గ్రంథకర్త తనకును మాతా ప్రమాతామహుడును, సగోత్రీకుడగుట వలన నాకు తనపూర్తి సహాయసహకారములుండునని, తప్పక T T D ద్వారా అచ్చు వేయించ హామీగా తెలిపి, వారి సన్నిహితులును, సాహిత్య విద్యా ప్రవీణ, భాషాప్రవీణ వేదశాస్త్ర పండితులగు శ్రీ తెలికిచెర్ల రాజేశ్వరశర్మ గారికి ఈ గ్రంథమును పరిశీలన నిమిత్తము పంపిరి. వారీ గ్రంథమును పూర్తిగా పరిశీలన గావించి 102 వ పద్యము అల్లసాని సీసపద్య రచనను బోలినదని,

మరియు శ్రీవారి పద్య రచనా ప్రౌఢిమ గ్రంథకర్త దండకరచనలో గలదని, ప్రబంధ రచనా విశిష్టతను మాకు తేటతెల్లముగ తెలియ చాలునంతో చూపడితిమి.

నాప్రమాతామహులగు శ్రీమాన్ బుక్కపట్టణము రాఘవాచార్యులుగారు సుమారు నూరు వత్సరములక్రింది రచించిన శ్రీకువలాశ్వ విజయము ప్రబంధమును నేను కనుగొనుటలో సహాయపడిన వారికి, ప్రత్యేకముగ దానిని ప్రతిని లైబ్రరీలో శ్రమించి కాపీవ్రాసిన కుమారి గోమతం విజయ లక్ష్మికి, గ్రంధ పరిశీలన వాత్సల్యముతో పూర్తిగావించిన శ్రీ నెలికిజెర్ల రాజేశ్వర శర్మ గారికి నేను వృద్ధుడను గావున నా తరువాత శ్రద్ధతీసుకొని TTD ఆర్థిక సహాయముతో అచ్చువేయించు టకు ముందుకు వచ్చిన నామేనల్లుడగు BT ఆనంద రామాచార్యులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

గ్రందకర్త చతుర్థ కుమార్తె శ్రీమతి మాడభూషి అమ్మాళమ్మ గారు మా అమ్మగారు. ఆమె 1934లో నా అష్టవర్షప్రాయమున తెలిపిన విషయము 1984లో స్ఫురణ చేకూర్చి పలువుర సహాయసంపత్తులతో యీ గ్రంధము సూర్యావలోకనము, ప్రాప్తి కలుగ జేయుచున్న తిరుమల శ్రీవేంకటేశ్వర స్వామివారికి వారి దివ్యమహిషి అఖిల జగన్మాతయగు శ్రీమతి అలమేలు మంగ దివ్యపాదారవిందములకీ ప్రపన్నుడు తలమోడ్చి చేయు నమస్సు.


యిట్లు

**మాడభూషి శ్రీనివాసదాసుడు**

**యెమ్. శ్రీనివాసాచార్యులు**

రిటైర్డు కోపరేటివ్ డిప్యూటి రిజిస్ట్రార్

1-4-35, భావనగర్ కాలనీ,

పొన్నూరు - 522 124

గుంటూరు జిల్లా (ఆం.ప్ర)



శ్రీమేధా దక్షిణామూర్తయే నమః
శ్రీగాయత్రీ మంత్రే నమః

## అభిప్రాయనివేదనము

# శ్రీ కువలయాశ్వ ప్రబంధ పరిశీలనము

శ్రీ కువలయాశ్వవిజయము ఆంధ్రప్రబంధము. దీనిని రచించిన కవివరేణ్యులు శ్రీఋక్ష్మిపట్టణ రాఘవాచార్యులుగారు. శఠమర్షణగోత్రోద్భవులు. ఈప్రబంధమున కృతికర్తలు 12వ పద్యము మొదలు 24వ పద్యము పూర్తియగు వరకును వ్రాసిన వంశాభివర్ణనము పరిశీలించి వీరి వంశచరిత్రను యథాశక్తి వ్రాయుచున్నాను గమనింపుడు. ఈకవిశేఖరుడును వీరి పూర్వ్యులును నూజివీడురాజాగారి సంస్థానమున ఆస్థాన కవిపండితులుగారాజాగారిచే సుప్రతిష్ఠింపబడిరి. వీరి వంశమున గల ప్రథమ రాఘవాచార్యులుగారు వేదశాస్త్ర నిపుణులు. వాది సింహమని ప్రఖ్యాతి పొందినవారు. అందుచే రాజాగారు వీరిని మహాకవి పండితులుగా నిల్పి సంభావించిరి. వీరికి అనంతుడు, చిన్నయ అని ఇరువురు పుత్రులు గల్గిరి. వీరిలో అనన్తాచార్యులుగారు ఉరుటూరు మున్నగు అగ్రహారములను గడించిరి. వీరుసత్కవులు మెచ్చుకొనునట్లు కృతులు వ్రాసిరి వీరికి వరదాచార్యులుగారు, వీరరాఘవాచార్యులుగారు అని ఇరువురు పుత్రులు పుద్భవించిరి వీరరాఘవాచార్యులు గారు చక్కని కవీశ్వరులు. వరదాచార్యులుగారికి వేంకటాచార్యుడు, అనంతాచార్యుడు, రామానుజాచార్యుడు, రంగయాచార్యుడు అని నల్వురు పుత్రులు గల్గిరి.. వేంకటాచార్యులుగారికి అష్టపుత్ర బహుధనమస్తు అనునట్లు ఎనమండుగురు పుత్రులు గల్గిరి. వారిలో కనిష్ఠులు శ్రీనివాస తాతాచార్యులుగారు. ఆంధ్రగీర్వాణ పండితులలో అసమానులు. అతని సతీమణి సింగమాంబ. ఆ పుణ్యదంపతులకు అనన్తవర్యుడు, రాఘవార్యుడు, వేంకటార్యుడు అని మువ్వురు పుత్రులు గల్గిరి. వీరిలో రెండవ వారైన రాఘవాచార్యులుగారే ప్రకృత కువలయాశ్వప్రబంధ కర్తలు. వీరు తమ పదునారవ యేటనుండియు సంస్కృతాంధ్రాంగ్లభాషలు మూడింటను పదుగురు బాగున్నదని మెచ్చుకొనునట్లు అష్టావధానము నొనర్చెడివారట. వీరిలో 3వ వారగు

వేంకటాచార్యులు వారు శ్రీలత్తిమా పుటకు శిష్యులుకాని విద్వత్కవి (కవిత సింహము) ఈయన ఈ రాఘవాచార్యులుగారిని సంభావించెడివారట. ఈయన అష్టావధానమును పలుగురు సెభాష్ అని మెచ్చుకొనెడివారట. వీరి తండ్రిగారు వేంకటాచార్యులు. కవియైన రాఘవాచార్యులుగారి సతీమణి పేరు లక్ష్మనరసాంబ. ఈయన కుమారుడు వేంకటగోపాలాచార్యుడు. ఈ కవీశ్వరుడు నానావిధ దేశ్యపదని బిడముగు ఆంధ్రప్రబంధమును అతి సుందరంబుగా రచియించెను అదియే ఈ కువలయాశ్వవిజయ ప్రబంధము. దీనిని యదుదైవంబగు శ్రీకృష్ణునకు కృతిగా సమర్పించెను

"శ్రీరామానుజ సమారంభాం నాదయాముని మధ్యమాం, అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరాం" అను సూక్తిలో చెప్పినట్లు గురుపరంపరాభి వందన మాచరించి ప్రబంధరచనకు పదును బిగించిరి ఈయన అలంకార శాస్త్రమున చెప్పిన ప్రబంధ లక్షణములను పూర్ణముగా పాటించిరి "ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశోవా" అను నియమమును ననుసరించి హరి సద్భాగ్యంబు మాకీవుతన్, ఇందిర ప్రోవునందలన్ మొదటిరెండు పద్యములందును తమ భాగ్యములను రక్షింపవలసినదిగా ప్రార్థించుచు ఇందిరాహరులకు నమస్కారములను సమర్పించెను. మంగలాదీని మంగళమధ్యాని మంగళాన్తాని శాస్త్రాణి ప్రథన్తే అను నియమమునకు అనుకూలముగా మంగళాదిగా శ్రీకారముతో పద్యమును వ్రాసిరి. ఇందలికథ, భాగవతమార్కండేయ పురాణములందు ప్రసిద్ధిగన్నది. కాన, ఇందలి ఇతివృత్తము ప్రఖ్యాతమని తెలియుచున్నది ప్రబంధము గద్యపద్యాత్మక చంపూకావ్యమైన కథ తక్కువగానుండి అష్టాదశవర్ణనలతో, అలంకార చమత్కృతితో నిండి శృంగార వీరరసములలో నొకటి చక్కగా పోషింప బడవలెను ఇట్టికావ్యలక్షణమునకు అనుకూలముగా ఇందు ఆస్తుని వర్ణన మాదిరిగా ఎన్నియో వర్ణనలుగావింప బడెను కువలాశ్వమహారాజకృత దుంధు భాసుర వధ ఇందు నిరూపింపబడెను కావున ఈ ప్రబంధము వీరరస ప్రధానమని తెలియుచున్నది కవివరులు విశిష్టాద్వైత మతస్థులు కాన లక్ష్మీనారాయణ ప్రార్థనతో గ్రంథర చనమారంభించిరి అనంతుడును, వైనతేయుడును 3,4, పద్యములందు అతి సుందరముగా వర్ణింపబడిరి గురు భక్తి ప్రపత్తులు 5,6,7,8 పద్యములందు ప్రస్ఫుటించు చున్నవి. వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, దండి, బాణుడు మున్నగు సుప్రసిద్ధ

కృతిని మఱియు నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ అను ప్రసిద్ధ కవిత్రయమును 9,10 పద్యములందు సంస్మరింపబడిరి. కృతికర్త వంశావళి వర్ణనము 12 వ పద్యము మొదలు 24వ పద్యము పూర్తియగు వరకును ప్రస్ఫుటముగా కలదు. 25,26,27 పద్యములందు షష్ఠ్యంతములు కవితా సంప్రదాయానుకూలములై యున్నవి.

28వ పద్యమునుండి చక్కగా కథా ప్రారంభము కలదు జనమేజయ మహారాజు కోరికపైన వైశంపాయనుడు చెప్పినట్లు కవివరేణ్యులు ఈ కువలాశ్వచరిత్రమును నవ్యకథను మధుమాధురీధురిణ్ వ్రాసెదనని ప్రతిజ్ఞ చేసినాడు అట్లే వ్రాసినారు. ఈయన కవితలో నగుమచ్చతెనుగు పదములును నగము సంస్కృత సమాన పదములును గలవు 61వ వచనమున బాల్యశిక్షలు అచ్చతెనుగు పదములలో నిరూపింపబడెను 62,63,64 పద్యములలో కవి తమ కాలపు ఆటలను అచ్చతెనుగు మాటలలో నిరూపించినారు గ్రంథము మొత్తము పైని ఈతని వచన రచనలు పెక్కుభంగుల గావింపబడి అహంకార పూర్ణ పండితుల గర్వ భంగకరములుగా కలవు అచ్చతెనుగు కవితవల్లుటలో కూచిమంచి తిమ్మకవి వీరికి గురువుగానున్నట్లు తోచుచున్నది. ఊఱకరారు మహాత్ములు అనునట్టి లోకోక్తులు వీరి కవితలో కోకొల్లలుగలవు. 102వ పద్యము అల్లసాని పెద్దన్న గారి సీస పద్యము బోలియున్నది. 114వ పద్యమున కవిగారి ఆత్మీయత అతి సుందరముగా గోచరించును. ఎవ్వతెయీయాపె భీతహరిణేక్షణ అనెడి పెద్దనామాత్యుని పద్యమును బోలినది ఎవ్వడవీవు అనెడి 134వ పద్యము శ్రీనాథుని పద్యరచనా ప్రౌఢిమ ఈయని దండక రచనలో గలదు. కందము, తేటగీతి, సీసము, తరువోజ మున్నగు అచ్చతెనుగు పద్యరచనలో వీరి దందె వేసిన చేయి ప్రథమాశ్వాసాంతపద్య రచనచే రాఘవాచార్యులుగారి పాండిత్య ప్రతిభలు సువ్యక్తముగా గోచరించును.

ద్వితీయాశ్వాసమున కథాగ్రంథము ఆకాశతారలనంటినది ఈయన కవితలో మల్లెవట్టినచేమ, పులికడుపునంజనించినయు, గ్రుడ్డియెద్దు చేనబడ్డట్లుగా, మున్నగుజాతీయ పదముల గూర్పులు ముచ్చట గొల్పును. తృతీయాశ్వాసమున రామాయణ కథా సంగ్రహము అద్వితీయము. మత్తకోకిల, సుగంధివృత్తము మున్నగు వృత్తపద్యరచన సందర్భాను కూలముగా గలదు. వీరు సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలకు చెందిన ఛందస్సులననుసరించి రచించిన వృత్తరచనలు

అపురూపములు. సామాన్యముగా పండితులకు అందుబాటులో లేని వృత్తములను పండితుల పరీక్షకా! అన్నట్లు 1.)కరంబ్యావాత వృత్తము 2.)తన్వివృత్తము 3.)పద్మనాభవృత్తము మున్నగు నామములతో ఎన్నింటినో వ్రాసిరి. అత్యాధునికమైన సామెతలను శిష్టవ్యావహారిక భాషలో అనుసంధించిరి. అన్యదేశ్యములనెన్నింటినో గ్రంధించిరి. 192వ పేజీ లోని లయగ్రాహి పద్యము లయగ్రాహిగానున్నది. ఈయన దండక రచనలోను, వచన రచనలోను అందెవేసిన చేయి. శబ్దాలంకార ప్రయోగవైచిత్రి, పోతన్నగారి రచనను మరిపించుననుటలో అతిశయోక్తిలేదు

చతుర్థాశ్వాశమున భాగవతకథను అతి సుందరముగా గ్రథించిరి. ఇంతకుమున్ను సందర్భోచితముగా శ్రీరామాయణ కథను సంగ్రహముగా విన్నవించి, ఇపుడు జనమేజయ ప్రభువునకు భాగవత కథను కర్ణసుందరముగా వినిపించు సందర్భమున కవివరేణ్యులు ఉపయోగించిన అచ్చతెనుగు సామెతలను లోకోక్తులును తామర తంపరగా గలవు. 'ఆడినది ఆట' 'పాడినది పాట', 'కాటికి బోయినను కర్మగతి తప్పునకో' అనువట్టివి అసంఖ్యాకములు. భారతకథను కూడ ముచ్చటగా ప్రభువునకు వినిపించిరి.

పంచమాశ్వాసము శ్రీకృష్ణలీలలను, సుభద్రావర్ణనమును, ఋతు వర్ణనలను పాఠకులకు తెల్పుటలో ఈమహాకవి చూపిన వింతలు లెక్కకు మిక్కుటములు. ఉపమాకాళి దాసస్య భారవేరర్థ గౌరవం దండినఃపదలాలిత్యం, మేఘసంతిత్రయో గుణాః అన్నట్లు యీకవిశేఖరుడు రెండవకవిగా చెప్పవచ్చును. గ్రంధమును చదివితెలుసుకొనుట మంచిది నేవ్రాసితేవేని 10పేజీలకు మించి వ్రాయగలను చదువరులునన్ను మెచ్చుకొనుటకు మారుగా, ఇంత అతిగా వ్రాయరాదందురేమో అని ిభయము, పాండురంగసుకవి పదగుఫణము అన్నట్లు ఈకవీశ్వరుని పదగుం ము నిరుపమానమని తలచెదరు తప్పదు 72 సం. వయస్సు వాడనుగాన శరీర బలము తగ్గుటచే వ్రాయుటలేదు. కాని వ్రాసినచో అదియొక్క చిన్న పొత్తము అగును. చదువరులను విసిగింప రాదు. సంస్కృతాంధ్రభంధో వ్యాకరణాలంకార శాస్త్రములో తెలియని వారు సరిదిద్దలేరనుట అతిశయోక్తి. శ్రీకువలాశ్వవిజయాఖ్యమును అద్వితీయకవితా సుగంధ సంపూర్ణమగు ఈమహా ప్రబంధమును ఆంధ్రభాషాయోషకు అమూల్యా భరణముగా రచియించి యిచ్చిన మహాకవిశేఖరులు శ్రీబుక్కపట్టణాన్వయ

సుధాంబుధి చంద్రులు శ్రీరాఘవాచార్యులుగారికి చంద్రునకు నూలుపోగుగా అభిప్రాయమును వ్రాసియిచ్చినవాడు వేదశాస్త్ర పండితుడు, విశ్రాంత ప్రధానాంధ్రోపాధ్యాయుడు, సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ,

తెలికిచెర్ల రాజేశ్వర శర్మ ఆంధ్రకవి పండితులకు నమస్సుమాంజలులను సమర్పించుచు చేయుచున్నాను.

అయ్యలారా!

నాకు పుత్రప్రాయులు చిరంజీవులు బి. టి. ఆనంద రామాచార్యులుగారు, పరిశీలించుమని యొసంగిన ఈమహాప్రబంధమును యథాశక్తి పరిశీలించితిని ప్రమాదో ధీమతామపి అని పెద్దలు చెప్పిన మడి నిత్యసత్యము. తప్పులున్నచో విద్వాంసులైన పాఠకులు మన్నింతురుగాక తప్పులని తోచినవానిని సవరించి ఆస్తికులును పితృభక్తిసంపన్నులును అగు మా బి టి ఆనందరామాచార్యులుగారికి పంపగోరిక. వారి ముత్తాతగారు వ్రాసినదే ఈమహాప్రబంధము. వారు నేనొసంగిన సవరణలతో జోడించి దీనిని అచ్చొత్తించగలరు. అన్యథాభావింపకుడు నాపూర్వజన్మ పుణ్యఫలముగా దీనిని పరిశీలించు భాగ్యము నాకు కలిగినది నాకు వేదవిద్యావంశపుత్రులు ఆస్తికులు, ఆప్తులును నాగ్రంథముల ముద్రణ ద్వారా నాకు యెంతయో తోడ్పడిన వారునగు చిరంజీవి బుక్కపట్నం తిరుమల ఆనంద రామాచార్యులుగారి మూలమున నాకు ఈగ్రంథ పరిశీలన భాగ్యము కలిగినది. వారికుటుంబ సభ్యులకు శ్రీవాసుదేవుడు సవిత ఆయురారోగ్యైశ్వర్య విద్యాద్యభివృద్ధులను చేకూర్చుగావుతన్

ఇట్లు
కౌండిన్య సగోత్రోద్భవుడు
వేదశాస్త్ర పండితుడు
విశ్రాంతప్రధానాంధ్రోపాధ్యాయుడు
శ్రీసమమ జాతీయ, శ్రీరుద్రాభిషేక మహాత్మ్య
ఆంధ్రవిరాట పర్వ, సౌరమంత్ర రహస్యగ్రంథకర్త
తేది:23-7-93

**తెలికిచేర్ల రాజేశ్వర శర్మ**

# త్రికరణ్మయి మృదుపలుకు

## భక్తి నివేదనము



రామానుజ దయాపాత్రం జ్ఞాన వైరాగ్యభూషణం
శ్రీమత్ వేంకటనాధార్యం వందే వేదాంత దేశికం

శ్రీమాన్ వేఙ్కటనాధార్యః కవితార్కికకేసరీ
వేదాంతాచార్య వర్యోమేసన్నిధత్తాంసదాహృది

శ్లో॥ శ్రీమచ్ఛోభిత నాభిపద్మజ సురజ్యేష్ఠుండు నల్మోములన్
హేమాత్మ్యము లావఁబోయి శిశులా హీనాత్మ నేర్పేదవి
స్సేమ ప్రేమము నాల్గుచేతులిడి తత్క్షీరంబు లానించి యా
భామారత్నముల న్నగించు హరి సద్భాగ్యంబు మాకీవుతన్

త్రికరణ్మయి సారస్వత సంస్థ చరిత్రలో శ్రీమాన్ బుక్కపట్టణ రాఘవాచార్యులు గారిచే విరచితమైన శ్రీకువలయాశ్వ విజయము అను ఆంధ్ర ప్రబంధమును ముద్రించి ప్రచురించటము ఒక ప్రత్యేక స్థానమును సంతరించుకొన్నది. లోగడ యీ సంస్థ, సారస్వత విభాగము వేదశాస్త్ర పండితులు, సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ (విశ్రాన్త ప్రధానాంధ్రోపాధ్యాయులు) శ్రీరా[illegible] శాస్త్ర్యులు రచించిన

1 శ్రీరుద్రాభిషేక మహాత్మ్యము
2. విరాట పర్వము (వ్యవహారికాంధ్ర భాషావచనము)
3 సూర్య నమస్కార ప్రభావము (మహాసౌరమంత్రములకు ఆంధ్ర భాష్యము)

మరియు

సంగీత విద్వాంసులు, సంగీత విశారద శ్రీమతి మహాభాష్యం పెరిందేవి గారిచే స్వరకల్పనచేయబడిన

4. శ్రీతాళ్ళపాక అన్నమాచార్య కీర్తనలు
5. స్వరకల్ప స్తోత్రరత్నావళి
6. స్వరకల్ప సంక్షేపరామాయణము

మున్నగు వేద, పురాణ, సంగీత గ్రంథములను ప్రచురించుట జరిగినది.

కానీ ప్రస్తుత కువలయాశ్వ విజయ గ్రంథకర్తలు నాకు మాతా పితా మహులేకాక, మా బుక్క పట్నం తిరుమల శతమర్షణ గోత్రీకులు. మునిమనవడి నైన నాకేగాక త్రికరణ్మయి సంస్థ ఆరంభకులమైన మాఅన్నదమ్ములు, చెల్లెండ్రు వారికి ముని మనుమలమే. మామాతా మహులలో చివరివారు, మూడవవారైన శ్రీమాన్ మాడ భూషి శ్రీని వాసా చార్యులు గారు అత్యంత ధన్య జీవులు. కాకున్న సుమారు 100 సంవత్సరముల క్రితం వ్రాసి ఈ ప్రబంధ వ్రాతప్రతి 4, తరములుగడను చున్ననూ దాని ఆచూకి ఎవరికీ పట్టకున్ననూ వారి తల్లిగారు (మాఅమ్మమ్మ గారు) వారి చిన్న ప్రాయమునయీ గ్రంథ విషయము ప్రస్తావించిన విషయమును 50 సంవత్సరాల తరువాత (వారి రిటైర్మెంట్) జ్ఞాపకము పెట్టుకొని పలువురు మా బంధువర్గముతో ప్రస్తావించి తెలుసుకొని, ముందు మదరాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు వ్రాసి, వారు తెలుపగా తదుపరి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ అనుసంధాన సంస్థకు వ్రాసి, పట్టువదినట్టుగా యీ ప్రబంధ ఆచూకిని తెలుసుకొని వెలువలికి తీసికొని వచ్చిరి. భగీరదుని వలె. దృఢ సంకల్పముతో ప్రబంధ వ్రాతప్రతి ఆచూకి తెలుసుకొనుట యేగాక, యింటా బైటా ఎవరు వినుకున్నా పట్టించుకోక వారి మేనకోడలు చిరంజీవి సౌభాగ్యవతి గోమతం విజయలక్ష్మి గారిచేత ఆప్రతిని కాపీ చేయించుటయేగాక, దానికి తిరిగి ఆయన శుద్ధప్రతిని వ్రాసి మిగిలిన కార్యభారము మేనల్లుడనైన నాపై యుంచి నాకు, మాత్రికరణ్మయి సాహిత్య సమితికి ఎంతయో మేలు చేసిరి. కాకున్న మాకీఅదృష్టము లభించెడిది కాదు. కావుననే 'కులమునందు నొకడు గుణవంతుడుండెనా కులము వెలయువాని గుణముచేత' అనునానుడు అక్షరాల నిజము. వారు యీవిషయమును పట్టించుకొనని యెడల యీగ్రంథముకాల గర్భములో కలిసిపోయెడిది. కావుననే వారు ధన్యజీవులు.

నారాయణుడు, పరమపురుషుడు, పురుషోత్తముడు, పరంధాముడు ఇట్టివన్నియు ఆభగవంతునికి పర్యాయపదములు. సకలకళ్యాణగుణసంపన్నుడైన భగవంతుని సంకల్పముతోనే సర్వమునూ జరుగుచున్నది. కావున శ్రద్ధా భక్తులతో ప్రయత్నించువాడు తప్పక కృతకృత్యుడగును. మా అందరి సంకల్పము శ్రద్ధా భక్తులతో జరిగినది కావున యీ గ్రంథము అనుకున్న రీతిలో వెలువడినది. ఇక మా ముత్తాతగారి గ్రంథ రచన గురించి మునిమనవడిగా నేను అభిప్రాయము తెలిపిన హాస్యాస్పదమని పించును. అయినను త్రికరణ్మయి సారస్వత సంస్థ తరుపున రెండు మాటలు వ్రాయసాహసించెదను భగవానుని దశావతారములు పురాణేతిహాసములలో పేర్కొనబడినవి. నాలుగు వేదముల సంకలనము ఉపనిషత్తులను గ్రంథీకరించిన తరువాత కూడా తృప్తి చెందని వ్యాసభగవానుడు నారదముని ప్రేరణమున యితిహాసములను కూడా గ్రంథ రచన చేసి లోకమునకు మహోన్నతి చేకూర్చి పెట్టినాడు. శబ్దప్రదానములైనవి వేదములు కానీ పురాణములు అట్లుగాక మిత్రునివలె కథలద్వారా మనకు భగవద్భక్తి ప్రసాదించును కనుక హిందూసాహిత్యమున పురాణములు అతిప్రధానములైనవి భాగవతము పురాణములలో మిక్కిలి శ్రేష్ఠము ఎందుకనగా భాగవత రచన తరువాతనే వ్యాసమహర్షికి మనశ్శాంతి కలిగినది శుకుడు పరీక్షిత్తునకు జెప్పిన భగవత్తత్వమే భాగవతము. ఇందుభవంతుని గుణములు, కర్మములు, నామములు అనేక కథల ద్వారా కీర్తింపబడినవి. భగవత్ప్రాప్తికి భక్తియే ముఖ్యోపాయమని భాగవతము చెప్పుచున్నది. శ్రీకువలయాశ్వవిజయంబను సత్ప్రబంధమున వైశంపాయన ముని యుపదేశింపగా జనమేజయ మహారాజు శక్తులతో వినిన వృత్తాంతము

ఇందులో దుందుభాసుర వధ శ్రీకువలయాశ్వమహారాజుచేగావించుట, మరియు మధుకైటభాసురుల వృత్తాంతము ప్రధాన విషయములు. కానీ తృతీయాశ్వాసమున రామాయణ కథ, సుందరాకాండ అత్యంత మనోహరముగా, అతితేలికగా అర్థము చేసుకొనుటకు అనువైన శైలిలో వ్రాసిరి. సీతాన్వేషణ హనుమంతుడు ఎటుల జరిపెనో ఈక్రింది పద్యమున చిన్నతెనుగు పదంబుల చూడుడు.

సీ.మేడల నెక్కియు గోడల నెక్కియు

మడువుల్ద్రాక్షియు మచ్చులెక్కి
మాటిమ్మాటికిఁ జాటు మాటుచోటుల శేగి
బోటులగని నిద్రపాటు మీద
రంగస్థలంబులు రవ్వ పట్టులు మెట్టి
శృంగాటకమ్ములు తొంగిమాచి
బందులుండెడి చోట్లు పందలుండెడి చోట్లు
పెందలకడ సందుగొందులరసి
మూలముట్టుగఁ గనియొనాఁ పోలతండు
నిదియది యటుంచుచూగి వచియింపనేల
బట్టియనుమఁడు మెట్టని యట్టినేల
లెక్కకును బొత్తెఁడైనను లేదు నమ్మి

గీ. వెతికి వెతికి యతడు వేసారి వేసారి
అరిగినట్టి చోటికరిగి యరిగి
బలముగాఁగగాళ్ళు బలముల్లట్టగా
రాముపత్ని కానరామిఁగదలి

నాల్గవ ఆశ్వాసమున భాగవతకథలో శ్రీకృష్ణదేవుని కథ క్లుప్తముగా, భారతకథ అరణ్యపర్వ విరాటపర్వ కథ, భగవద్గీతవిషయముల సంగ్రహముగా మనసునకు హత్తుకొనువిధమున కలదు

5వ ఆశ్వాసము. కువలాశ్వుండు విజయదుందుభిమ్రోగించి కడకు కేశవ వరప్రసాదియైశౌరి చక్రముహిమచే దుందుని హతమార్చుట చక్కగా విశదీకరించిరి

పై భాగవములన్నియు ఆశుకవితాధారగద్య, పద్యంబులతో అనేక చమత్కృతాలంకార శృంగార వీరరసా స్వాదన వర్ణనలతో అనేక అద్భుతమగు నుడికార పదజాలములతో వారు సంకల్పించిన విధముచే యీ నవ్యకథను మధు మాధురీధురిన్ వ్రాసి అబ్బా! మాబుక్కపట్టణ పూర్వ వంశీయులలో యింతటిగొప్ప కవులుండుట వలన కోటికన్యప్రదాతలనగ శ్రీవైష్ణవమున పీఠాధిపతులుగ నుండిరి అని తెలియు చున్నది. ఈ మాబుక్కపట్నం తిరుమల వారి వంశాభివర్ణన చదివి తేనే గ్రంథము ఎట్లుండునో తెలియనగును.

సీ. ఏవంశమందున నావిర్భవించిరి
శ్రీనాథయామున శ్రేష్ఠమునుల
ఏవంశమున భక్త శ్రీవెంకటేశుండు
తాతగారని పిల్చిదాహమడిగె
నే వంశమున వారు ధీనిధి ప్రాయులు
నరవర సతులకాచార్యులైరి
ఏ వంశజార్యులు నింపుసింహాసనస్థ
నాచార్యులైరి కాంచ్యాది విభుల
వార్యులే వంశమున సదాచార్యపురుషు
లైనసింతుగ॰ కోటి ఖ్యా ప్రదాత
లనగ శ్రీవైష్ణవమునఁ బీఠాధిపతులు
నట్టి శఠమర్షణాన్వయం బలరుమహిని

ఈగ్రంథ ముద్రణజరుగుచున్నకాలమున జరిగిన ముఖ్య సంఘటనలు

1. త్రికరణ్మయి సారస్వత అధ్యక్షులు శ్రీబుక్కపట్నం తిరుమల మోహన రాఘవాచార్యులు గ్రంథమున చాలాభాగము ముఖ్యముగా సుందరాకాండ ప్రూఫ్ కరెక్ట్ చేసినారు. వారు అప్పటికే హృద్రోగముతో అస్వస్థులుగా నుండిరి. 8,10 నెలలక్రితం గుండె ఆపరేషన్ చేయించుకొనిరి. ఎటువంటి యిబ్బంది లేకుండా శ్రియఃపతి దయ వల్ల క్షేమముగా నుండిరి.

2. మా రెండవ అన్నగారు శ్రీమాన్ బుక్కపట్నం తిరుమల రాధా కృష్ణమాచార్యులుగారు క్రిందటి అక్టోబర్ 94లో అస్వస్థులై కాన్సర్‌తో బధపడుచుండిరి. వారు యింతటి తీవ్ర బాధనను భవించుచూ కూడా ముత్తాతగారి గ్రందమున ముఖ్యముగా సుందరాకాండము చదివిరి మిగిలినకొన్ని భాగములు ప్రూఫ్‌దిద్దిరి. వారు అంతటి బాధను భవించుచూ కూడా తనకిక ఆయుర్దాయము లేదని తెలిసి ముత్తాతగారి శైలిలో వ్రాసిన అయిదు పద్యములను క్రింద పొందుపరచు చున్నాము.

ఉ. ఎంతని సంతసొందినను చేరదుదైన కృపారసంబునన్
చెంతకుమాడలేకను అభాగ్యుని సెన్నిధి చేయిజారరా

పొంతన లేని యోచనం పోయెడికాలము ఆగదేరికిన్
సంతసమొందకన్ సతము నేడును రామునిది వ్యాపారముల్

ఉ. అంజని సూనుడాకపి వరుధ్యుడు దీనుల రోగగ్రస్తులన్
అంజలి మోడ్చినంతటను సంతసమున్ మరివారి పీడకున్
రంజనగోడుటన్ సదయ రాముని యందు ననంతలంబు భ
క్తింజనమన్యముల్ కలుగ కామున శ్రోమద యాంతరంగుడై

ఉ. అన్నిట తల్లిపోలికల నావని యందరు మెచ్చుకోలుగా
మిన్నటగాన రీయలను మానస విద్యయు సాహిత్యంబునన్
ఎన్నిట యేమియుండినను యేవిధియాగతి నాకుకల్గినో
వన్నిది యేశరణ్యము అనంతంభక్తిలో వేంకటేశ్వరా

ఉ. నారమేమియున్నది నాకుమగాగ యపూర్వరత్నముల్
వేదన కొచ్చి బోయునది యేమి నెరుంగని వాడు సీతయున్
వేదన గాకనాకటను వేగిన గుండియ తోడు పీడనన్
కాదనలేను నేను మిము కాగల కార్యము కాకపోవునే

మ. జననంబొందితి పుణ్యదంపతుల రాజ్యలక్ష్మి నృసింహాహ
ర్యునికిం ఈశ్వర నామ మార్గశిర రాకాపూర్ణిమ రాశిలో
తనియుంగా మరివారిసేవలను తత్విస్త్రీరగా చేర్యం
దన మామాత పితార్యకుంమిగిలె దేవాసేకేయా జీవితం

3. మూడవ విషయం ఈగ్రంథమును ముందు లెటర్ ప్రింటింగ్ కు యిద్దామనుకొని గూడా తెలుగులిపిలో డి.టి.పి. మీద కంప్యూటరైజ్ చేద్దామని S.S.డేటా ప్రొడక్ట్సు వారికి నమూనాగా కొంచెం పనియివ్వగా వారు రెండు వారాలలో ఒక అశ్వాసం పూర్తిచేసి యీ D.T.P కంప్యూటరైజేషన్ పని వారికే పూర్తిగా యిమ్మని వారే అంతావని ఉచితముగా చేసియిస్తామని వేడిరి. కారణము యీకువలాశ్వవిజయము ప్రారంభించిన నాటి నుండి అంతకుముందు పని దొరుకక బాధపడుచున్న వాళ్ళకు చేతినిండా ఎడతెరపు లేకుండా పనియిస్తున్నా[illegible] ఈ విధమైన సంఘటనలు తెలిపి తెలియనివి కోకొల్లలుగా నుండునవియే

చేసుకొందును.

గ్రంథప్రతులు విక్రయించిన ధనముతో మా యీ త్రికరణ్మయి పార్వ్వత సంస్థకు యిన్ని నాళ్ళు ఆర్థికముగా వెనుకబడినదానికి తగు విధి ఏర్పాటు చేయింకను అనేక ధార్మిక, అధ్యాత్మిక కార్యక్రములలో వినియోగించుట కొరకు గూడా 100సంవత్సరముల క్రితం జన్మించిన మా ముత్తాతగారి గ్రంథము పనికొచ్చునున్నదని వినమ్రతతో తెలియచేయుచున్నాను.

మరియూ సాక్షాత్ శ్రీకృష్ణభగవానునకే యాశ్రితిని అంకితము చేసుకొనిన మాతాత గారే కాకుండా ఆయన వారసుల మైన మేమందరమే కాక యీగ్రంథముద్రణ విషయమై సహాయపడిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి, తనరీసర్చి పనితోపాటు వ్రాతపనిలోనున్నయీగ్రంథమును శ్రీవేంకటేశ్వర యూనివర్సిటీ రిసెర్చి ఇన్స్టిట్యూట్ తిరుపతి మంచి శ్రమకోర్చి కాపీ చేసిన చిరంజీవి సౌభాగ్యవతి విజయలక్ష్మికి, గ్రంథమును పునఃపరిశీలించి అభిప్రాయములిచ్చిన శ్రీతెలికిచేర్ల రాజేశ్వరశర్మ గారికి, ప్రొ. శ్రీమాన్ S B రఘునాధాచార్యులుగారికి ఈ గ్రంథ ముద్రణ విషయమై అతి శ్రద్ధవహించి అచ్చు వేసిన కర్షక్ ఆర్ట్సు ప్రింటర్సు, న్యూనల్లకుంట, హైదరాబాదు వారికి త్రికరణ్మయి తరుపున నాకృతజ్ఞతలు తెలుపుచున్నాను ఇంతకూ చెప్పవచ్చేది ఏమంటే 100 సంవత్సరముల క్రితం జన్మించిన మా యీ ముత్తాతగారి గ్రంథరాజము వెలువడి గ్రంథ ప్రతులు విక్రయించిన ధనముతో మా త్రికరణ్మయి పార్వ్వత సంస్థకు యిన్ని నాళ్ళుగా వున్న ఆర్థిక యిబ్బంది తొలగి తగు విధి ఏర్పడి యింకనూ అనేక ధార్మిక ఆధ్యాత్మిక, పారప్పతిక కార్యక్రమములలో వినియోగపడబోవుచు న్నదని వినమ్రతతో తెలియచేయు చున్నాను.

ఇట్లు

**జి.టి. ఆనంద రామానుజాచార్యులు**

కార్యదర్శి 11.3.96

త్రికరణ్మయి, టి ఆర్.టి 141,

విద్యానగర్ కాలనీ, న్యూనల్లకుంట పోస్టు

హైదరాబాద్ - 500 044.

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము



## పంచమాశ్వాసము

# శ్రీ

# కువలాశ్వ విజయము

## శ్రీ బుక్క పట్టణ రాఘవాచార్య ప్రణీతము

### ప్రథమాశ్వాసము

శా. శ్రీమచ్ఛోభిత నాభిపద్మజ సురజ్యేష్ఠుండు సర్గోమములన్
హేమాస్త్రవ్యము లానఁబోయి శిశుతా హీనాత్మ నేర్పెదని
ప్రేమ స్తేమము నాల్గుచేతులిడి తత్క్షీరంబు లానించి యా
భామారత్నముల న్నగించు హరి సద్భాగ్యంబు మాకీవుతన్ 1

ఉ ప్రాకట రూపు కన్నులకుఁబండువు తల్లియు రత్నగర్భ ర
త్నాకరుఁడయ్యెరాజా తనయున్న సుధాంశుడు దానుతెన్నఁడా
శ్రీకడు బుట్టుభోగియని చేయునెడంబడి రాణి వానముం
జేకొని నాఁగశారిహృది చెందిన యిందిర ప్రోవువందఱన్ 2

ఉ. మెప్పుగ గొప్పమొప్పు తన మేను ప్రసూనపు పూలపాన్పుగాఁ
ద్రిప్పణా మణుల్పుణులు దీపములట్టులు మేలి కట్లుగాఁ
జొప్పడఁ గుక్షిలోకములు జోఁకకు దూఁకు వటంపు జాగరం
బొప్పెడి నాది దంపతుల బ్రోచు ననంతుని నెంతు నెంతయున్ 3

సీ. పక్షివిశేషణోర్ధ్వ వండపవనంబు
    తోయధి స్పర్శని తోడఁ గూర్ప
బదున్ని క్షత్రసంభ్రమదవే కావోక
    హాములు బంధువి మాధ్వి నముగమించ
వల్లి వింగికి లేవ వతల వానులు శేషు
    నవికిక బ్రహ్మాణ్యమమంజీర

దిర్ధిర దిరుగుము దివికిలేచిన యుద్రు
లాటాడు గోలి గుండ్లమకరింపఁ
భీయునడి నీట ముక్కిరి బిక్కిలై యయి
పైకి విశ్రాంతి [illegible]
నమృత హరణార్థమై దివికరుగునట్టి
నైన శేషుని కొనరింతు వందనములు

సీ. శ్రీ హయగ్రీవుండు వెలిగి కాపురముండె
నే ధ్యజహ్యాస్త్ర [illegible]
యిరువది యేండ్లకే యేధన్య నరియించె
వెళ్ళికొళ్ళలుగాఁగ విద్యలెల్ల
వేదాంత దేశిక బిరుదే ఘనున కిచ్చె
గండపెండేరమ్ము కరణి శౌరి
శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత హరివంద
మునకే ఘనుఁడు నందున మమ్ము
సర్వతంత్ర స్వతంత్ర తటుగా నరసు
హ ప్రకృతి కర్త విఘ్నఘంటావతారు
శ్రీమ్మ నాకవితార్కిక సింహ వేంక
టార్య దేశిక వర్య సేవధి నుతింతు 5

ఉ. మేలగు విష్ణుపాన్పగుట మేలము లాడ పణీశుఁడుండమున్
దాలిమి దూలి యాగరుడు దవ్వులఁజూచినవో నదల్పఁగా
పిలగు నంచు నెంచు గతిభేత్రము పూనెడు సైన్యనాథునిన్
జాలగ మేలు లిమ్మనుచు జాఁగిలి కేలు మొగిడ్చిమ్రొక్కెదన్ 6

క. విస్తుల విపులామృత వ
క్షస్థల లక్ష్మినివాస సౌధాగ్రమునన్
న్యస్తం నదువ్యదీపము
కౌస్తుభమును శస్త్రదమును గణుతింతుమదిన్ 7

యక్ష్యాల లక్ష్యాల లచరించుఁ గమరించు
    సర్వసురీకంఠ సూత్రములను
యద్రావ సుద్రావ మదరించు నడఁగించు
    నసురుల యమజులకు సురులకు సు
యత్పాతముత్పాత మడగించుఁదొడఁగించు
    సాధువులకును న సాధువులకు
యద్ధార యుద్ధారమై యార్చుఁ దీర్చును
    గని యసురీ సురీ కష్టలముల
యద్గుణమ్ముపణమ్ము జన్యములందు
దినుచ కసురులయసురులఁ గొసరి కొసగఁ
దత్సుదర్శన శంఖ గదా కృపాణ
శార్ఙ్గములు సత్త్వహరణములే సంస్మరింతు 8

కవిత భూమికి దిగు కాలానఁ గాలన
    వేద్యుసెవ్వఁడు తొలి విడిది యయ్యెఁ
బ్రేమబారగ నట్టి నామలూరుజాఁ గొల్చి
    సకల పురాణాలి జన్మభూమి
తొలుసల్కుతల వికృతొలఁగించు దువ్వనఁ
    బంచము శ్రుతి కర్తఁ బ్రస్తుతించి
గణనీయమతి యైన వణిన నూనుఁదలంచి
    యంజలి జేసి పతంజలికిని
దనకు భవభూతికిని గవిత్వమునఁ దగవు
పొనఁగ నెవ్వాని దానినిఁ బొగడ వాణి
యట్టి కవి కాళిదాసుని దొట్టి తలతు
దండికవి బాణముఖులను దండికవుల 9

తెనుగునకు నాదికవి నరుఁ
డని మున్నఁగొన్న మన్నపార్యుఁగవిబ్ర

హ్మాను దిక్కుయజ్వ నెళ్లనఁ
బనివడి దలచెదఁ బ్రబంధ పరమేశ్వరునిన్ 10

క. ప్రకట పర పూర్వకవులను
సకల పరాధునిక భావి సకల సుకవులన్
సుకృతుల మన్నన సేయుదు
కొలువున బాస విడుమంచుఁ సుకవుల నంచున్ 11

కృతి కర్తృ వంశాభి వర్ణన

సీ. ఏ వంశమందున నావిర్భవించిరి
శ్రీనాథ యామున శ్రేష్ఠమునులు
ఏవంశమున భక్త శ్రీవేంకటేశుండు
తాతగారని పిల్చి దాహమడిగె
నే వంశమున వారు ధీవిధిప్రాయులు
సలనరపతుల కాచార్యులైరి
ఏ వంశజార్యులు పింపుపొంపార స్థ
నాచార్యులైరి కాంచ్యాది విధుల
నార్యులేవంశమున సదాచార్యపురుషు
లై వసింతురు కోటి కన్యాప్రదాత
లనగ శ్రీవైష్ణవమునఁ బీఠాధిపతులు
నట్టి శఠమర్షణాన్వయం బలరు మహిని 12

శా. ఆ వంశమ్మున బుట్టిరార్యులు మహా హవ్యప్రవక్తల్ సుధీ
దివ్యాఖ్యుల్ సదా దాక్షిణాత్యులు మహా విఖ్యాత శాస్త్రజ్ఞులున్
ధీవిఖ్యాతుని రాజునార్య శుభబుద్ధిన్మాణి వీరాజ
భావింపించి వసింపజేసెఁ దనన ఖ్యాతంబునన్ మారిగాన్ 13

ఉ. ఆయన కీర్తిరాత్మజు లనంత సుధీమణి చిన్నయాఖ్యుడున్
ధీయుతులందుఁ జిన్నయకు ధీరుట గల్గిరి పుత్రులిర్వురం

దాయత కీర్తి శాస్త్రములయందును వేదములందు నవ్విధి
ప్రాయుడు రాఘవార్యుఁడని రార్యుడు పాండితి వాది సింహమై 14

అవల ననంత వర్యుఁడుగ తాళ్వారుటూరు ముఖాగ్రహారముల్
ఘనిని గడించె నాయనకుఁ బుత్రకులా ఎంతార్య సింహా
ఘన నముఖిఖ్యు లిర్వు రఘుస్థితి రెండవ పుత్రుడెంతయున్
జెవులకు విందుగాఁ గృతుల జెప్పెను సత్కవులెల్ల రౌనవన్ 15

పరమవర్యుండు గనియెను వరసుతుల
విపుల పాండిత్య శోభితు వేంకటార్యు
వల యనంతార్య రామానుజార్య రంగ
యార్యనైయాయి కాళ్యగ్రయాయి హాయి 16

శిష్టులగు వేంకటాచార్యులన్న పుత్ర
ఫలము గని శతవర్షము ల్పొంగి మనియె
హాయిలుగని యన్నపుత్ర బహుధనమ్ము
ఒని శతం జీవ యను నుడుల్సార్థకముగ 17

బాగు మీఱంగ వారలలోఁ గనిష్ఠ
సోదరుడు తేజరిల్లెను నాదుజనకుఁ
డార్యుడా శ్రీనివాస తాతార్య వర్యుఁ
డాంధ్ర గీర్వాణ పాండితిప సుముడగుచు 18

తనర శ్రీనివాస తాతవర్యుఁడు సింగ
మాంబయందునువ్వు రాత్మజులను
గని ననంతవర్యుఘను నమ్మరాఘవా
చార్య వేంకటార్య నార్యహితుల 19

పదుగురు తగునని మెచ్చగఁ
బరియాఱవ యేఁట నీర భాషేంద్రములన్
విదితముగా నింగ్లీషున
నొదవఁగ నష్టావధాన మొనరిచి నాఁడున్ 20

శా. విద్వాన్ వేంకటార్యుఁ బాండితిని నే బ్రేమింప శిష్యుంజేయ
విద్వత్కీ సరసైన సన్నుతుఁడు భావింపంగ మాక్ష్యేటిలో
సద్వైత ప్రతిభన్నరేశు సభయందష్టావధానంబు నే
సద్వాచాలతఁ జేసి యాతఁడును మెచ్చంగా క్షమాషోడశిన్
మృద్వీక స్థితిన నట్టివా విపులతిన్ మేమ్మేలు వర్ణింపగన్ 2

క. శ్రీమద్వర మర్షణగో
త్రామల శశివేంకటాహ్వయార్యతనూజాన్
మామ కజనకు భజింతుఁబ్ర
ధామహితున్ శ్రీనివాస తాతార్యగురున్ 2

గీ. లక్ష్మిభక్త మదర్థాంగ లక్ష్మి సరస
కొమరుఁగనియును వేంకట గోపయాఖ్య
సతఁడు దీర్ఘాయురారోగ్య సుత సుపౌత్ర
సత్పరంపర వెగడు నాచంద్ర రవిగ 2

వ. ఇట్లు నిజనామపారాయణ జనావన పరాయణుండగు శ్రీమన్నారాయణునకు
సురి వారంబుగా స్వాచార్య ప్రాచార్య పూర్వాచార్య భి వాదన పూర్వకంబుగా
బహుపారంబు కైవారంబు సేసి సూరి నాథునాతన భావికాలిక సకల సుకవుల
నికల భావంబున సంభావించి నానావిధ దేశ్యపద నీరంధ్రంబగు నాంధ్రంబున
దివ్యకథా భవ్యం బుగా నొకనవ్యకావ్యంబు సరసజన రుచికరంబుగా
రచియింపంబూని కృతిని మానవుల కొసంగుట నిహీనంబనియు నట్టి
యుభయలోక భయావకా నర్థపాదకంబగు వ్యర్థకార్యంబు కంటె సకల
కలుషదురామయ నిరామయాప నిరాకరిష్ణుఁడగు శ్రీవిష్ణునకు దాస
పోషకుఁడగు వాసుదేవునకు సర్వాభీష్ట ఫలప్రదాయకుఁడును శరణ
శరణ్యుఁడును శరణాగతి విద్యాతత గీతా శాస్త్రాభిధాయకునకు వృష్ణికుల
వర్ధిష్ణునకు శ్రీకృష్ణునకే కృతి సమర్పించి నిష్ఫలంబగు నాజన్మము సఫలంబు
సేయందలంచి

షష్ఠ్యంతములు

క. మధుమధుర సుగుణ గణునకు
మధుమథనునకు సుభద్రాకుమారునాకి
మధువునకు మాధవునకును
మధురాపుర నందగోప మాణవకునకున్ 25

క. దన దునకు కుచేలునకును
జనపాలునకున్ యశో విశాలు నకులనవ్
ఘనకనక చేలునకునవి
యామునకు సుశీలునకును యదు బాలునకున్ 26

క విష్ణునకును బరిపాలిత
జిష్ణునకును గోవ్రావిశిష్ట దధి పయో
ముష్ణునకును శుభసంప
ద్ధిష్ణునకు సహిష్ణునకును శ్రీకృష్ణునకున్ 27

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనిన కువల యాశ్వ విజయంబను
సత్ప్రబంధమునకుఁ గథా ప్రారంభం బెట్టిదన
28

## కువలయాశ్వ విజయ కథా ప్రారంభము

క వైశంపాయన ముని యువ
దేశింపఁగ వివిధకథలు ధీవిధివిదే
వేశాభుఁడు జనమే జయుఁ
డాశం గువలాశ్వుఁ గూర్చి యాకర్ణింపన్ 29

వ సవినయంబుగా మునికిట్లనియె 30

ఉ. మౌనివరా!పురాణము మాదిరి మాధురి సిమ్మ్రదూక్తి మెం
తేనియఁదేనియున్నగుచు తెంపు జనింపఁగ జేయుగానవే

సీమల నానియాని యుఱసీమము తృప్తివిగానఁ గాన్కగా
వానతి వానతిమ్ముగొని నవ్యకథన్ మధుమాధురీధురిన్ 31

క. కువాలాత్వుఁడౌడు భూపతి
కువలయము న ధుంధు మారకుండెటు లయ్యెన్
చెవులార వినఁదలంచెదఁ
జవులూరఁగ నుడువుమనిన సంయమి పలికెన్ ' 32

మ. వరరత్నాంచిత భర్మ హర్మ్య శిఖర వ్యాసక్త తారాళి భా
సుర మాంగళ్యన వృష్ణ తోరణ గరిన్ శోభిల్లఁగా ధాత్రిశ్రీ
హరి ముందించు దయించు పంచఁ బురి సర్వాతీతఁగాఁ జేసె నా
సరయూ తీరము నందయోధ్య వెలయు స్సర్వామరా రాధ్యమై 33

ఉ. కాపురముండు లక్ష్మి కలకాలము గాలము వైరి గుండెకున్
గాపురమాధివారుఁడట గణ్యమగణ్య మహర్షి శంబులన్
కాపురమై సమస్త భువికా పురమెప్పుడు నొప్పులొల్కుచున్
గాపుర మంచు నవ్వు నలకాపురి గోపురి సన్నగేభ్యుడున్ 34

సీ. మహిని లింపులు నిక్కముముగఁ జతుః పంచ
షట్సహస్రాన్యల సఱకు గొనరు
**దామత్రయముతంటె భహా వర్షముల కంటె**
శూరతప్పు లెమ్ము మాపు వాసి
ది ణ్యాత్రనిధి యందు ధిక్కరింత్రు కుబేరు
బేరులు సంపద బేరువాడి
తెగఁబండి యెఱఁగు ముద్దిరుము ముక్కలులుగా
నన్యముల్నా లవజాతి కోడు
నవ్వరల మచ్చరించుచు వి _ విడి
మచ్చికను బచ్చవిల్తుని మరులుగొల్ప
నలఁతులలఁతులఁ గనరెంత వానినైన
వెలదియింతులు వెలయింతు రమఁగు కాంద్ర 35

ఉ. అందలి ఖేయ పాలములు పందముగా నొకఁడొంటి తోడుతన్
బందముగట్టి పన్నగ మమర్త్యుల లోకములంట వెంటనే
ముందుదిఁగమ్య భూమికివి బోయెను వెన్కటిదంటె జక్కలన్
మంద మటంచు దానినిట మాటికి ఫేన మిషంబునన్నగున్ 36

ఉ ఆనగరీతురంగముల వాడుట గెల్వఁ గురంగ వాయువుల్
పూని జయింపలేక తుదిఁ బొచ్చెము నంది యొకింతయేణముల్
కానల దూఱి గడ్డిమ గాడుపు మూల నణంగె కంటవే
కానఁగ రాకపోయె నటుగాదె మహాత్ముల కోటు గల్గినన్ 37

గురు కుంభము లురు శృంగము
లరయఁగ మదివారి ఖురము లమితోత్సేధం
బొరయుచు నుప్పర మప్పురి
కరులా ఘీంకృతుల గిరులఁగలకల నవ్వున్ 38

ఆపురిసాల రీతి యభియాతివి భీతి నొసంగి రాలవే
యాపుర శాలి సత్పరిఖయల్ల రసాతల సీమనంటుఁదా
దాపురపాల పాలములు దార సుధారసభారవాహులై
త్రాపురపాల వాలఫలతందు రసంబులఁ గోరు వారికిన్ 39

పల్లవిత ఫలిత పుష్పిత
సల్లలిత ద్రుమలతాది సకలర్తుకమై
యుల్లసిలి చైత్ర రధమును
నుల్లసముల వాడు నవటి యుద్యానములున్ 40

ఉ అక్కడి సౌధరాజినయి హత్తిన శాలల సాలి లోపలన్
జక్కగ నిచ్చలేగుటను జంద్రుఁడు వానికిఁ జంద్ర శాలలం
చొక్కట నామమేర్పడియె నొప్పదటన్న శిరోగ్రహమ్ములన్
నెక్కనఁ జంద్రశాలలవి నేఁటికి నేటికిఁబిల్తురీ భువిన్ 41

తలకొని పున్నవంతులకు దారికి వద్దము లౌట రాకపో
కలగదు పంకటంబిడు నగారము లంచును వారి కీరు పి

ధుల నమకట్టి కట్టిరి ప్రతోళులనందున నట్టియే జనుల్
మలువగు సూర్యవీథియని సోముని వీథియటంద్రు నేటికిన్

ఉ. మించెడి సౌధకుడ్యముల మీఁద నలంకరణార్థ మింపుగా
నుంచిన కెంపు కుంపటుల నొప్పుగ బెంచిన పూల చెట్టులన్
దెంచును జంద్రుఁడేఁడి యని దృష్టికి నెత్తిరి గోపురాలపై
గాంచన పంచవక్త్రములఁగాపునకై బెదురుంచి రోయనన్

చ. మరకత రత్నజాల పరిమండిత తత్పుర బాహ్యసీమలన్
మరచిర శాద్వలంబులని చూఱఁగ మేయఁగ బోయి లేళ్ళుగో
పురతవనీయ సింహముఖముల్ గని భీతిలి చౌకళించుటన్
ద్వరగతి దృష్టికాతురత వానికి నేర్పరౌవాటఁ బట్టియున్

సీ. సకలాగమమ్ముల సకలాగముములట్ల
సుమనః ప్రకాండ సంశోభితములు
సుమనః ప్రకాండంబు సుమనః ప్రకాండము
ల్లలి సమనామోద మావహిల్లుఁ
గాండప్రహారంబు కాండప్రహారము
ల్లహిత సరామితా సహారముగును
సహిభయంబడఁగి సల్లహి భయంబడగెను
జక్రి మంత్రదరోచ్చాట నమున
గోపురము రీతి విల్లసిల్లు గోపురంబు
సుచ్ఛ్య సంస్థిత కోటి వియచ్చురముగ
ధనము విలసిల్లు యుద్ధ సాధనము వోలె
నఖిల వరదాన యోగ్యమై యఖిల పదవి

క. ఆపురము తరణి వంశజ
భూపతులకు సతత ఘతుల భోగాస్పదమై
కాపురపు రాజధానిగ
దీపించును గోపలమున దివిజాలు మెచ్చన్

ఉ. మేలుగనేలు నావురము మేలు భళి నరపాలమాత్రుఁడే
కాలుఁడ్రితండు వైరులకుఁగంతుడు కాంతలకంము నెల్లరున్
లీల నుతింపఁదన్ను నవలీల జయించి సమస్త దేశముల్
హాయిగనింద్రుబోలె బృహదశ్వ నరేంద్రుడు కీర్తిసాంద్రుఁడై 47

సీ. తన భుజాదండంబు ధారుణీదేవికిఁ
ప్రియమైన సుస్థిర పీఠి గాఁగఁ
దనదు పాణి కృపాణి తనర సువర్ణి సీ
మంతినీ కజ్జల మనన యింపఁ
దనశాసనము సర్వధాత్రీపతులకు నౌ
దలను ధరించు పూదండ గాఁగఁ
తన కీర్తి నర్తకి తవరారు దేవతా
నగరాల నిత్యంబు నాట్యమాడ
తన పరాక్రమ సంపద తనరుచుండ
అఖిలదీవుల వనయంబు నానవాలు
తనదు తేజంబు దినమణి భాతివెలుగ
భూమి పాలించె బృహదశ్వభూమి జాని 48

ఉ ఆయన సోయగంబు సుజనాదరణంబు రణంబు నేరుపుల్
పాయని కాయశుద్ధియు నుపాయ మపాయలేని మంత్రముఁన్
దీయని న్యాయవృత్తి మెసుదీయని బీరము నెంచిచూడగా
నాయననెన్న నాయన యొయో నెనగా రెవరేయుగంబునన్ 49

క. ఆయన ధర బాలించెను
నాయన పలేఁబ్రజలంజాచిన యున యుగమునన్
నాయతముగ ఘన సౌఖ్యో
పాత్యముగని సుగతి జగతి నరులుమతింపన్ 50

వ. అతనికి గర్గి నందనుడనంతుడు తానలి రాజవర్తనుం
డతను కలాధురంధరుడపోయనమాన సమాన ధైర్యుడై

అతనుడు పద్మనాభునకు నట్లు జయంతుడు జంభభేదికిన్
అతులిత కీర్తిశాలి కువలాశ్వమహీపతి పుణ్యమూర్తియై॥ 51

వ. అట్లుదయించినయతండు 52

సీ. భూమీశుఁడౌట నాభూమీశులకు సాటి
యౌనటంచన్న నేమంత వింత
నరదేవపతిగాన నరదేవ పతులతో
నౌను దీటన్న నేమద్భుతమ్ము
రాజసింహముగాన రాజసింహములతోఁ
బురుఁడన్న నేమి యబ్బురపు మాట
సమవర్తి శుచిగాన సమవర్తిశుచులకు
సదృశుడౌననఁనేమి సందియంబు
పర విశ్రాంతి విభూతి నమిత భోగముకాంతి
విక్రమ క్రమలోన్న వృత్తి నవగ
కువలయంబున జొడఁగువలాశ్వుఁడభి లారి
భంజకుండును లోక రంజకుండు 53

గీ. సర్వ సర్వంసహాచక్ర సర్వ భార
వహన సహనారి గహన సందహన దహనుఁ
డసమ సమరామ రాద్రామ హార సమాన
భీముఁడన దగుఁగువలాశ్వ భూమిజాని 54

సీ. శృంగార యోవినాఁ జెప్పంటొక్కటెగాని
కంతుడనంగుండు కాఁడెచూడ
మహిసుధాంసుడనిన మాట మాత్రమె గాని
యిందుగళంకి గా నెఱుగ రొక్కొ
సురభియామని యటంచును జెప్పుటేకాని
జాతిహీనుండు వసంతుఁడరయఁ
గను శుభాంగా కలంక సుజాతి మహితుండు
నైనట్టి యీకువలాశ్వుతోడు

గీ॥ శివియుగా కంతుడుం గింతుఁడును మధాముఁ
డును గిధాంశుడును వసంతుడును గినంతుఁ
డిమ్మెయివి హస్తిమశకాంతరమ్ము సుమ్ము
తరముతెన్నఁగ నెవ్వారి తరము లన్న 55

గీ. దాబుగా తండ్రికంటె నేడాకు లెమ్ము
చదివెనిలనేడు సకలశాస్త్రంబు జాడ
ద్రొగ్గి యుతఁడె ఘనుడంచు ముల్లుమాపు
తులను బెట్టంగ జగముల తూచగలమె 56

వ. అతనికి నేకవింశతి సహస్ర కుమారులు మారు మీఱు వా
రతను తనూవిలాసముల సర్వమునంతువు లెల్ల నేకవిం
శతి శతలంబులొక్కొకటి చక్కఁగ ముక్కలు సేసి యాత్మ సం
తతి నుపయింపఁజేసెనొ యనన్ జనియించిరి మంచి నిముమున్ 57

సీ వేడుక మడిదున్ని వెదపెట్టఁ గువ్వ తె
వ్వలుగాఁగ మొలచిన పైరవంగఁ
గొమ్మ కొమ్మకు వేలకొలఁది గుజడ్నోసి
ఫలియించు సహకార ఫలము లనఁగ
జందాంశుకరవిక స్వరములైనరముల
విందఁ బూచిన పద్మషండ మనఁగ
బగలు దీఱఁగడంగి మొగులు జాఱఁగ వింగి
వొక్కటఁ బొడమిన [illegible]క్కిలనఁగ
గీ. శరధి తరళెడు తరఁగలఁ దెరలఁ దులి
వెలిశెఁ బలువడి వెలువడి తళుకు చిలుకు
కులుకు లొలికెడు రతనంపు మొలకలనఁగఁ
గొమరు మిగిలిరి కువలాశ్వకొమరులలరి 58

వ. హరి విభవావతారములు వారయుగా బదిగానఁ దామనఁ
బరముస వల్లకాదలచి బ్రహ్మయు నంతకుమున్న నాక్రొతుల్

దొరయుటఁ బూర్తి మఱొక మూర్తిగ నీకువలాశ్వు డయ్యెఁగా
కరయుఁగ నొక్క పూరుషున కందఱు పుత్రులనొంద శక్యమే 59

ఉ. వారక తారకలక మువ్వు వాలుక లెంచిన నెంచవచ్చుఁగా
కారయ వారితేజి కువలాశ్వతనూజులఁ బెంచు దాదులన్
వారల మున్ను వెఞ్జలమ వరాలమంజదివిందు నొక్కలన్
వారి విహారయాన పరివారము లెంచ దరంబె యేరికిన్ 60

వ ఆజనపతి తనయులు వినయ సంపన్నులై పన్నుఁగా దమ్ము దమంగొను జనమునకుఁ గనుల పండు వొనరించుచు ననుదినము ననువుగ విందు జనించ దినదిన ప్రవర్ధమానులై సమృద్ధిన మమానులై బాల్యకౌమార వయస్సుల సమాన వయఃప్రమాణకులగు వయస్య మాణవకులం గలసిమెలసి బుద్ధితెలిసిన కొలది నక్షరాభ్యాసంబయ్యుఁదద్వ్యాసంగంబు నందాసక్తి గదురమి మనోమ పారంబుగా వలసిన వినోదంబు లందాదరంబు ముదిరి నానాఁటికి నాటల యందు దవిలి పైఁగా బడియందు నయ్యావారుగా వించు గుంజిళ్ళు, గుంజనకాలు, ముంజేతి మురువులు, వంగుడులు, గోడసోటులు, కోదండము, దండ పట్టీలు, చెవుల పట్టీలు, బుగ్గబూరెలు, వెన్నుగారెలు, తొడపాసము, వుంతపాగలు, బొండవెయ్య, బండవోత, పెడకాలు, పెడకీలు, మొట్టికాయలు, లెంపకాయలు, సంకెలలు, విలువు కొలువు తోనగు మేనివెతలకు బెదిరి యాటవిడువు నాళు తెప్పుడెప్పుడని యెదురు సూచు చయ్యవి తటస్థపడిన బడివాకిలి గడపఁ ద్రొక్కి, నక్కి అతేదని చయ్యనఁ దొలినాఁట వింటగోజాడి తెచ్చిన యాటవిడువు డబ్బులు మునిమాపు దీపంజ్యోతి చెప్పి సిరి మక్కి దెబ్బలందుకొను పేళ నయ్యవారి కప్పనము నప్పన సేసి కప్పము సెల్లుడి బడిపెద్దకుఁబుప్పు బెల్లములకుఁ గొండొక ముట్టఁజెప్పి పోయి మఱల బడినాఁటి దమక మఱలఁబడి రాచి పాఠము లాటల నందడిని గట్టుపఱచుకొనఁ దలపెట్టక కట్టిన పొత్తములు కట్టినయట్లె పెట్టిన చోటనె పెట్టియుంచి విప్పుటయాళోలి కట్టిపెట్టి వచ్చి యున్న పాటంబులను మొదటి పాటంబు పోదుమి మొదలంట మఱచి యయ్యవారికే యొప్పగించి యాయన యేది చూత మొప్పఁజెప్పు మనిన నప్పటికెద్దిరయో నొకతప్పు చెత్తు వన్ని తప్పించు కొనవచ్చునని తోడి బాలురతో ముద్దులకుద్దులై

ముద్దుగ నాడిన యాటలెల్లవిన

61

బండియుఁ జెడుగుడు వప్పీను పులి జాదు
    మచ్చన గాయలు నమ్మనములు
నువ్వనబల్లేలునువ్వుట్లు పీగాట
    చీకటి మోదులు చిమ్ము బిళ్ళ
బొట్టనగోలిలు నెట్టుడు కాయలు
    వొగడాలు పాలియుఁ బగడసాల
గుడుగుడుగు చాలు గుండేటి దాఁటాలు
    దాఁగుడు మూఁతలు దండపట్లు
కోతికొమ్మచ్చి దొంగాట కుందికుట్లు
మేకలాటయు బులియాట రాకురాకు
బండి చదరంగము పతంగి పావురాల
యాటయు దశావతారియు నవల మఱియు 62

అలంకయాలంక కోలాటములు మఱి
    గుల్లవుఁ బందెము ల్కోడి పందె
ములు గవ్వకాయలు మొగిలి పటంబులు
    గాలి పటంబుల గవ్వలాట
నాల్గుకంబాలాట నక్కాట కొక్కాట
    వామన గుంటలు పత్తులాట
చిట్టిపొట్టకాయ చిత్తర బిళ్ళయు
    గుజ్జపెక్కిళ్ళును గోలి గుండ్లు
గంగిరెద్దాట మఱియు సింగన్న దాట్లు
గోట దొర్లుడుకాయ చెండాటవాకి
మూటపరి బేములును దోయిలాటముచ్చు
లాటకుప్పిలు జల్లీల యాటలనఁగ 63

సీ. బొంగరంబుల యాట పొదుగుచ్చు వెతుకుచ్చు
నుర తిప్పర తాండ యుప్ప చెమ్మ
నామల్లప్పలు గోనెకప్పుచ్చుము
చిమ్మన గ్రోవులు బొమ్మరాలు
తూరవడుక్కాలు దోబూచికమ్ములు
గుజగుజరేకులు కొంగులాట
గుబ్బుళ్ల గురిగింజ కుమ్మర పొరెలు
పిల్ల మెతొంబులు పిల్లిగూటు
పిసిగాజాలు గుజ్జాలు వెతకులాట
మచ్చు విద్దెలు నెఱవిద్దె మట్టిగూళ్ళు
విట్టి బాలురయాట లెన్నేనిగలవు
వాని నన్నింటి నాడిరి వరుసబెట్టి 64

వ. నాటికాలమున నాప్పపాలు బాలురు పాఠశాలకుం జదువఁ బోవు తెఱంగెట్లనిన
65

క. పలకలు వదరలు గంట
మ్ములు కవిలెలు తాటియాకు పొత్తములునున్
బలములుఁ జాఱుకత్తులు
బలు విడిగొంపోదురెలమి బాలురు బడికిన్ 66

క. ప్రకటము లిరువది యొక్కము
లకరన్నకీరీలు నెఱమలట రాశికములే
నికరముగ నన్నియొద్దులు
సకలములగు గణితవిధులు చదివిరి వారల్ 67

సీ. మునుమున్న యోనమాలను గుంటలన్ దిద్ది
యంత బల్పైదు గుణింత మెఱిఁగి
వడిగఁ బేరులు వేర్చి విడివేల యంటిట్లు
వరగఁ బుస్తకముమ బట్టి యమర

కాండత్రయమ్మును గంతపాఠము సేసి
    యటఁ బరశ్లోకావ్యయంబు సేయ
ప్రకట కావ్యమ్ములు పఠియించి నాటకా
    లంకారములను విశ్శంకముగను
జదివి యష్టాదశ పురాణ సర్వశాస్త్ర
వేదములు నేర్చి యాయుర్వేదములను
నిట్టె చూచిన వారల నట్టె చూడ
నింత నెంతటి బుధులనిపించి కొనిరి 68

ఇట్లు సిరిసంతతులు రెండు నెచ్చి నడుమఁ
బ్రజల కెల్లను గన్నుల పండువగుచు
నున్న సామ్రాజ్య మహిమ సముచ్ఛ్రయమున
నుండె బృహదశ్వ మార్తాండుఁడపుడు చూడ 69

హరితోడ వివదించి సిరియందు వచ్చెఁగా
    కున్న యీ విభవ మెట్లుండ గలదు
శర్వుతోఁ గలహించి సతి యిందు నుండెఁగా
    కీ సర్వ మాంగళ్య మెటులభించు
బ్రహ్మను విరసించి భారతి చేరెఁగా
    కున్న యీవిద్య లెట్లుండఁబోలు
నల త్రిమూర్తులు నాంద్రక్రై యావహిల్లిరి
    కాకున్న మహిమ యేకరణిఁ గల్గు
ననుచుఁ దమఁగని మనుజులు దనుజరిపులు
మనువు ననువునఁ బ్రజలను మనుచు ననుచు
వినుతి యొనరింపఁగునలాశ్వ విభుఁడు శుభుడు
జనకు ననుమతి యౌవరాజ్యంబు బూనె 70

అంత నొక్కనాడు బృహదశ్వ మహీకాంతుండు తన యనంతరంబున నిరంత రంబు నిరంతరాయంబుగ నిజ తనయుండు రాజ్యపరిపాలన సేయనేర్పరచి తద్వృత్తాంతం బంతయు రాష్ట్రజముల కెల్లఁ బేరోలగంబున వెల్లడిసేయ

నుద్దేశించి యెంతయు వింతగ వింతంతవరావి సంతసంబునఁజెంతను సంతసంబునకు నావంతయేని కొఱంత లేక శుభస్యాంతులుగ సంతసపడు నంతురులును, వారికన్న మిన్నలవిసిరము కొన్న, కన్నామలుతరంతికప్రాంత వర్తులగు సామంతులును, దండ రెండవ ధండధ రులం బోలె నఖండ భండనోద్దండ కోదండ చండ పాండి తీమండవారాలి హారిణ మండలీవి ఖండన పుండరీకాయ మానప్రచండ శూరశుండాలంబులును, దండోప తండంబుగ దండడి సందడించు దండనాయక ప్రకాండంబులును, ప్రధాన రాజ్య భార నిర్వహణ ధూర్వహోతి విశదమతి విజిత శతధృతి శతక్రతు గురుగుణ గణ నిధాన విదాన మహో యోధాను యోధులును, జిరంతన కాలప్రభృతి కులక్రమాగతా తీతా నాగతాది నానా విధ వృత్తాంత బోధనా సాధనా సాధారణ ధోరణీ విధానులగు ముఖ్య ప్రధానులును, ననవరత శుభరతా ప్రవిహిత సుకృతి నిరతమతి విహితులగు పురోహితులును, వివిధ సత్కథా సుధారస సంతత సంతర్పిత శ్రోతృ పావనావనోదన దురీణకులగు పౌరాణి కులును, సకల శాస్త్రీయ సందేహ సందోహ నిరాయాస నిరాకరణ చరణ పటు తర భారతీ పద కటకఝుళంఝుళాయమాన వాగ్గరీ సాహిత్యులగు నాటకాలంకార సాహిత్య సహితులును, వింత నిరవద్య విద్యానవద్య వాణీగణనీయ పాణినీయ, నిశ్శేష శేముషీ శేష కర్క్యశతర్క, కాణాద్యంజన కాణాద, కర్మబ్రహ్మ ప్రశంసాస్పద మీమాంసాది షడ్దర్శన విమర్శనా జ్ఞానాంధంతమః కర్మన సుదర్శనులగు దీర్ఘ దర్శులును సుశబ్దాపశబ్ద వివికిత్సాకరణ శరణులగు వైయాకరణులును, దుర్వాద దూరీకరణప్రవార దూర యాయికగులగు వైయాయికులును, ఇట్టి వివిధ విద్యా మండితులగు నఖిల పండి తులను

అనన్య సామాన్య విధి వధూ ...న్యమాన్య సుధా మధుమధుర సరస సంగీత భంగీ సంపూర్ణాకర్షణ మాత్రాతిమాత్ర విస్మృత సమస్తేతర వ్యాపార సభాస్తార విస్తార సంపాదిత శిరః కంపన పూర్వక సంస్తూయమాన శిశు పశు ఫణి ముఖి విఖిల చేత వానందనంధాయకులగు గాయకులును, భూయోభూయ శ్రేయో విధాన విదావాభయ ప్రదాన వరణ శరణప్రవణ నిటలతట ఘటితాంజలి పుట ముహుర్ముహుర్ద్వార విహారక ప్రతీహార సందర్శితసముచి వీక్షణ కర్మితులై

ప్రహిత సంతాపులై యరిగాపులై హోరాహోరి జోహారు లిడుచుఁదోర
హత్తులుగ హత్తులు లోన గుములు పొలరి యప్పనమ్ములుగఁగొని వచ్చి
బరువడిఁ బ్రఘాణ ప్రాంతముల హత్తుకొనియున్న సరస్సహ లురుము,
స్వకృత్యనిత్య భృత్యాయితా మర్త్యహారిణేక్షణాక్షణ ప్రేక్షణీయ నిజస్పత్రావ
లోకన మాత్ర సంపుల్ల లోచనాసేచనక భాజన సభాజన సభాజనా పార
పరిణత వారవనితా జనతా మంజు మంజీరకల శింజిత సంజాత
మహోల్లాసప్రతి వర్తన తత్పరమధురాలాప కలాప ధురంధర సంజరాంత
స్సంభ్రమభ్రమ త్కారశా రికావారంబును, విజస్సన విజయపర పరాజయ
సాంయుగేన శస్త్ర విద్యాదూర యాయికసాంపరాయిక విషయ వివిధ విచిత్ర
కథాను సంధాన సంకలిత లలిత చరిత భరితావికల సకల స్తుతి పారపా
రాయణ పరాయణు లగు వందారు వందిమాగధ బృందంబును. వలసిన
పనులకుఁ గలసి మెలసి కనుసన్నలమెలంగి తొలంగక యేమముందేమ
ముందమను పహమహమికఁ జుట్టుకొని చుట్టలవలె విధేయతా జ్ఞాపనా
ర్థముగ వక్త్రన్యస్తహస్తులై బుద్ధి బుద్ధియనుచు శిరః కంపన పూర్వకంబు
గాఁదర్దయు వొద్దిక సుద్దుల వొప్పుకొనుచు నెల్లపుడు నృపున కభిముఖులుగాక
యించుక యెడ గలుగ సమ్ముఖమ్మునకుఁదొలంగి యోరసిలి నిలిచి
ప్రద్వీభూతోర్ధ్వకాయులై భావుక స్వభావకులగు సేవకులును శ్లాఘనీయులగు
బ్రహ్మ క్షత్రియవిట్ఛూద్ర ప్రబర్హులును, దక్కుంగల రాజకార్యార్థ సమాగత
వాహాను గోచర ధీ చాతురీ పంచజన ప్రపంచంబును బరివేష్టింప నమరావతి
యుంబోలె విభుదేంద్ర మహావిభూష గురుముఖాధిష్ఠితంబై యలకాపురంబు
రీతి నగణ్య పుణ్యజన సన్నిధాన విరాజమాన రాజ రాజాశ్రితంబై ననేవధీడితంబై
కైలాసంబుకైవడి సతత సన్నిహిత రాజశేఖరాభంగుర సర్వమంగళావాప్తి
శృంగారవాసంబై భైరవగణాధిప శిఖివాహన వ్యాసంబై సత్యలోకంబుగతి
నప్రతిహత శ్రుతి వితతి విశ్రుతవు వార చతురాస్య యమాధిష్ఠిత భారతీసనా
దంబై, సముద్రముకరణి ననంత ముక్తామణి విద్రుమ రత్నప్రత్నంబై,
వారణాసిమాడ్కి ననేక ఘట్ట మహావిహార ప్రచారంబై కాసారంబు సేరువ
సరసకుముదపుష్కరాభిరామంబై, యారామంబు తీరున వివిధ సుమన
స్సంవాహితంబై, కిరీటంబుంబోలె నమూల్య సన్మణి స్థగిత మూర్ధాభి షిక్త
విరాజితంబై, రజితంబు వలె స్వచ్ఛంబై, మహోరజతంబు గతిందనమహాకుల

దనర దశరథుని పెదతనయుఁ డరిసిడి శరము
నవచరుని యురము గుఱిగని సరిగ విడవగను
జని శరము సురపరుని తనయు నిలఁబడ వడినిఁ
దునిమి యట మఱలి తనదొనకమరి వడిగవన 142

క అట్టులు దమ్ముం జాటుగఁ
గొట్టిన శ్రీరాము వాలిక్రూరోక్తులతోఁ
బొట్టు పొరలగుచు దూరినఁ
బట్టఁగనతఁడిచ్చె నిట్లు ప్రత్యుత్తరమున్ 143

శా జీరీ కాఱులు మానురా ప్లవగ నీయుగ్రాఘ వృత్తింగనన్
నేరంబంచును వేఱు చెప్పవలెనా నీతమ్మునాలింగనన్
జేరందీసి రమించె దీవతని గాసిం బాఱఁగా ద్రోలితే
దూరంబారసి నీకు బ్రాచితముగా ద్రోహినిమంద్రుంచితిన్
మారాజ్యంబున నిట్టి పాపిని మనంగా మానురా దుర్మతీ 144

ఉ ఇట్టని వాని తమ్మునకు నిచ్చి కపీశ్వర రాజ్య మంగదున్
రట్టున వాలికోర్కె యువరాజ్యము నందిడి యేగి రాఘవుల్
గట్టుపయిన్వసించి పదిలంబుగఁ గానద వానకాలమున్
గట్టడి సీతను న్వెదకు కార్యము జోలిఁగపీంద్రుఁడూనమిన్ 145

క. రాముఁడలిగి సుగ్రీవుం
డేమాయెనొ సీతవెతకు టేమాయె నాకో
సౌమిత్రి మిత్రు గనిరా
కామాంధత విడఁగఁ దగిన కాటుక యిడుమా 146

వ. అనుటయు 147

చ. అతఁడతి వేగమేగి ప్లవగాధిపుఁగాంచి యిదేమి భానుజా
మతిసెడి నీవు మైమఱచి మాలిమి మానని జోలిమాలి నీ
సతుల రతిన్మతిన్మఱగి స్వామినిఁగన్నులఁగావ వైతి దు
ర్మతి వతివాలిఁజంపిన శరంబొక ప్రక్కనెఱింగి యుండుమీ 148

క వినుమీ సంతత గమనా
దనాదరో భవతి యను మహాజన వాక్యం
బు నిజంబుగాఁగఁదలఱుగ
ననుఁగని వినుఁగవఁగఁ జేసి నాతలవమ్మున్ 149

ఉ కామినిఁగోలుపోయి గతిఁగానక చింతిలఁజేకు నీకు శ్రీ
రాముడు కొండయంత రిపురాలిచి రాజ్యము గట్టపెట్టి తా
వేమఱు నన్వటిం గిరిని పీట సుఖమ్ముల విఱ్ఱవీఁగి నీ
వేమరు టొప్పునే మముల నేమిగ నెంచితా రాము నీ మదిన్ 150

చ అతఁడిటులన్న సన్నగ చరాధిపుఁడిట్లను నన్నరాఘవున్
మతి మఱవంగ నౌనె యతి మానుష మాతని శక్తిగానమే
యితఁడొక యించుకంత కనులెఱ్ఱన జేసిన యంతమాత్రనే
గతిచెడి కూలదే జగము గావున నాయెడలే వెఱుంగనే 151

ఉ ధీ రహితుండ వానరుఁడ దీనుఁడ హీనుఁడ నన్ క్షమింపుఁడీ
ధీరహితుండ వానరతి తేరుగడైనఁ బరాకు జెంది తెం
తే రహితుండ కుంకుడురఁ దీయునటుల్ కపికోటి నంపి ముం
ధీ రహితున్నబంధు నని ఁదీయుడు నేగమె సీత జాడలన్ 152

ఉ సీతను దెచ్చి రాఘవుని చెంతను డించెదు నంతదాక నే
నాతుని మెక్కగూర్చి ధరనాత్రజ నట్టికృతఘ్నుడంచ నన్
ఖ్యాఁతిగ నాకు రాజ్యమిడి కాంతను గూర్చిన స్వామి రాముకై
నాతలనైన నీనె తరుణంబున నట్టి పనుల్తుటించివన్ 153

క మీకీ బ్రత్యుత్తరముల
సాకల్యముగాఁగఁజెప్పఁ జాలను దండ్రీ
వాకొన నేటికి నేను క్రి
యా కేవలముత్త రమ్మటంచు నెఱుఁగవే 154

అవియిట్లు సుగ్రీవుండు సౌమిత్రికిఁ గోపోప శమనంబు గాఁబలికి తన మంత్రి

ముఖ్యుండగు హనుమంతుఁ బిలిచి దాశరథి మ్రోల నిల్లనియె 155

చ మనదగు రాజ్యమందుగల మర్కట భల్లుక కోట్ల నెల్ల రం
డన దగు దూతలంబిలిచి యందర బిల్వఁగ నంపుమిందులన్
మనఁదగు వాఁడు రాక యిఁకమూనఁడికం ఎది నాళ్లలోననే
మనరగు నాక్షిపాణి నదురంటఁగఁ ద్రుంతు మదాజ్ఞ మీరినన్ 156

శా వ్యగ్రో దగ్రత వానరాధిపుఁ డిటుల్పల్కన్ సమూమంతుఁడ
త్యుగ్ర ప్రాగ్ర హరుండు చారుల నహో యుకంఋగాఁబంపినన్
జాగ్రత్త్రాగ్రియు లేగి వేగరులు నాజ్ఞన్నైక కీశాలికిన్
సుగ్రీవాజ్ఞ యటంచుఁదెల్పి, పరమౌత్సుక్యంబునన్ రమ్మనన్ 157

చ. పిలిచెను భానుజుండని చెవింబడినంతనె కీశరాశి రం
పిలి చెలరేగి యేగెను గపి ప్రభువీటికి నూర్లువేలు ల
క్షలు నట కోటు లర్బుదము ఖర్వము శంఖముభూరి సంఖ్యలన్
గిలకిలలాడికొంచుఁ దమకేకలు నాకమునుం బగుల్పఁగాన్ 158

వ. ఇట్లు ప్లవగములగములు గచ్చువిచ్చుగ పెచ్చుపెరిగి విచ్చలవిడి విడివడి వడిఁదీరుగుచుఁ జొచ్చెరఁ జొచ్చి పొచ్చెము లేని మచ్చి కల హెచ్చి యుచ్చకములకై యొండొరుల గిచ్చికొని తచ్చవ లాడికొనుచు బిఱానఱాలు పెగలించి యెగఱువ్వి యువ్వలనొవ్వ నవ్వి పగలఁబండి పండ్లిగిలించుచు గోరమేను బిరబిర గీరి పేను నేరి నోర నిడికొనుచుఁ గొటారు కొమ్మలకుఁ దటాలున నెగిరి గిరిచరియలకు బడుచుమికి నెమకి యట నెద్దియేని చోద్యంబగు ఖాద్యంబును దొరకించికొని క్రించు తనమున నింముక పెఱకుపే కెఱుక పఱచి కకాపికపఱచి యది వచ్చి తను నెబ్బుకొని యొడిసి కొవిపోవ జడియకయు జడిసినట్లెడసి తానుఱికి దానికి దొరకనీక తోక మడించికొని పడుచుఁ గఱచి పట్టిన ఖాద్యమును విడక నెఱచినట్లు వెడవెడ నడల నొండెడలకుఁ బాఱి గుట్టుకున్న మ్రింగి నింగి నంగులిచేఁజూపి యుడికించుచు ప్రేలు వాలు గొమ్మల బట్టి చాలఁగ నుయ్యల లూఁగుచు వాలు గొమ్మలతో నయ్యాట లాడుచుఁగూడుచు పీడుచుఁ బాడుచు నాటకురవ్మని వేడుచుఁ

గనుబొమ్మలెత్తి కన్నులల్లార్చి మొగమెంగయించి విట్లించుచుఁ గికురించి
వెక్కిరించుచు నొక్కరొక్కరిని ధిక్కరించుచు నిమేషమాత్రము సేకరించుచు
కేకరించుచు మోకరించి నడువఁగడువు బెట్టి కొంత తడవు హెచ్చునడచి
వచ్చువడిన దాని నడచుచుఁ బొడుచుచుఁ దమకంబునఁ దమకంబువు
దొరకక దగ చేదిగ జేరులు పడిపడి యలకై గడియగడియకు గబ్బులు వెబ్బులు
మిట్టలు విట్టలు పుట్టలు గుట్టలు నెక్కి నిక్కినిక్కి జూచుచు బారులు తీరి
హోరాహోరిం బోరుచుఁ బాఱుచుఁ దాఱుచు నీరాకరంబెదరు నూచెదునని
యొక్కరొక్కరి తోపని నీరాకరమునకుఁజేరి ప్రథశ్రమము దీర నీరమాని
విశ్రమించి మించి యశ్రమమున నాశ్రమ తరులెక్కి వానితేనె తెరలంబట్టి
తుట్టె తెరలంగొట్టి మూలముట్టుగ మధువంతయుఁద్రావుచు సీక్షకముల
సత్తుగ బావుచు ఫలరసంబుల గ్రోలుచు వలయుఁ గ్రేలుచు మధ్య పానంబున
దూలుచు సోలుచు నేలకు వ్రాలుచుఁ దోక లెత్తి కొని కేకలిడుచు మూకలుగట్టి
మాకుల కెగఁబ్రాకి యాకనక యలమనక ఫలమనక దలమనక కాయయనక
పిందెయనక కంటఁబడిన దాని నెల్ల నంటఁబెఱికి యుఱక మంటఁ గలువుచుఁ
వెంటఁ బఱచి యొండొరుల గఱచి కొనుచుఁ దఱచు తరుశాఖల విఱుచుచు
గాఁపరులను దాఁపునకు రానీక శిలల నూఁకి వారు తమను మొత్తలగు దంటు
లెత్త నత్తఱిఁ దత్తర పాటున దాఁటిప్రేటు దప్పించి కొని వెక్కిరించి వేఱు
దారింబట్టి పోయి వారలేమఱిన మఱల చేరఁబాఱి తాఱి తాఱి పొడసూపి
తలసూప రాకుండ గుండురాలతో బడమొత్తియు మెత్తనై వెఱచినవారి
నోరు తెఱచి పండ్లఁ జూపి వెఱపించుచు విట్లనేక విధ స్వాభావిక పరిహాసైక
చపల చేష్టలుఁగాఁ పరులకు ఁజూపరులకుఁగరము వినోదకరముగా నెక్కడ
జూచిన లెక్కకెక్కువగఁ బ్లవగములగములు తండోప తండములుగఁ గిష్కింధా
పుర పరిసరము దఱివి యుష్ట్రగతిఁ గపి ప్రబర్హు దర్శించి కపి గోలాంగూలాచ్ఛ
భల్లవల్ల భుకెల్లరులము వచ్చితిమని తమివిఁదమరాక నెఱింగించిన సుగ్రీవుండు
హనుమ దంగదులతోఁ దోన కపి బలంబులు కూడిరా లక్ష్మణ సహితుండై
వానర సహస్రో హ్యమానమగు చతురంత యాన మారోహించి మాల్యవద్గిరి
గుహా ద్వారంబున కనతిదూరంబున శిబికావరోహణంబు గావించి రాము
సేవించి దాశరథి కాశదీరఁ జేరువ జుట్టుము ట్టుకొని యున్న యున్నగవర
బలంబు గానుపించి దగు కామక లొప్పించిన రాముడతని గారాముప సౌమిత్రి

నిర్విశేషంబుగ గాఢాలింగనంబు సేసి యాసీనుంగావించి సేవ చేతి కచ్చిన
యంతగా సంతరంగంబున నుబ్బి యామె జాడ జూడదగు ప్రయత్నంబు
గావింపుమని సెలవిడుటయు సుగ్రీవుండు వల్లెయని వానరాచ్ఛభల్ల వల్లభులలో
వెలుకులవంటి గఅకరి శూరులనేరి వారితోన మీరలింతట వేవేగనేగి
నాయాదేశమున నాయాదేశములంతట నన్వేషించి మనద్వేషియగు దోషాచరేశు
వాసంబు యోషిద్రత్నంబున్న తావునున్నత మతి వరసి యెందెందుఁదిరిగియుఁ
దిరిగి యిందున్నట్టు వీర లిటకు నెలమించఁగను నెలమించకయు రావలయునని
నలు దిక్కులకయ్యె వారల నయ్యె దిక్కున కేర్పఱచి తదనంతరంబు

159

జనకజను వెదక మీకున్
జనని యుఁకం దప్పదనుచు శతవలిని సుషే
ణుని నుత్తర పశ్చిమముల
కును వినతుని దూరుపు దిశకును బంపి యటన్ 160

ఉన్నకుమారునందగు మహారజతాంగద ముఖ్యభూషుడౌ
నన్న కుమారు నంగదు మహాబలశాలి హనూమదాది ధీ
మన్నగ వారి యూథపుల మంతిరి తారును దార బుద్ధి స
మ్పన్నగజారి యోధపులఁ బంపెను దక్షుల దక్షిణాశకున్ 161

ఇట్లానర్పి యాదిశలకుఁ గుశలులైన కేశయోధనాథులనేర్పఱిచి నేర్పరసిధరులగు
వారలకు గారియము బోధింప దరుచర వీరులారాయని సంబోధించి యా
నేర్పరి చిరపరిచయమున నయమును జెందు తత్తద్దేశస్థ నదీనదము నదీనదములై
కని మహాగహనగుహా మహీధ్రములగీనుంగెనుమవి సవిస్తరముగాఁ బ్రస్తావశం
భ్యశంబుగా బ్రస్తావించి వారంబ్రస్తావించిన నప్పుడు దాశరథి యుప్పొంగి
నలుదెసలకుఁ బఱఁ జూచిన కీశరాశిని ముందుగఁదా దారఁ జూచి తక్కిన
ముఖ్యడలు ముఖ్యడులుగ నెంచి వారిని విడి దక్షిణపు దిక్కునకు బయలు
వెడలిన యందఱిలోఁ బవననందనుఁ దన ముందఱికిఁ బిలిచి సాదరవాక్యంబుల
ఆదరించి బోధించి

162

అప్పావనమతి రాఘవుఁ
డప్పావని చేతికిచ్చె నడియాలంబో
యప్పా వనరుగ నాసతి
యప్పావని కిడుమటంచు నంగుళి ముద్రన్ 163

ఆగతి రాముముద్రికను హస్తముచేఁగొని వాయునందనుం
డాగతుడైన నంగదుఁడు నాతని దక్షిణవారి గూడి యం
దాగక యేగి కాననము లద్రులు నేలలు సూచి సీతకై
యాగతమేమి చిక్కక యహార్యము వింధ్యము చేరి యుండలన్ 164

విసుపకింపు సందు వెదకి వేసరియును
ఋక్షబిలము నాస వృక్షగుహను
దారిసొచ్చి యందు దారి తెన్నెఱుఁగలే
కదలి వెడలలేక ఎడలి యుండ 165

హనుమంతుఁడు తారాంగదు
లను మంతురులును గుఁమిగొని యట సరసి తటం
బున మంతనమునను దపం
బొనరించు స్వయంప్రభాఖ్య నొక శ్రమణిఁగనెన్ 166

కని యతండతి వినీత వేష భాషల నామెకడకరిగి తత్పదంబుల కెఱఁగి
167

అకుటిలుఁడామెతో ననియె నమ్మ నృపాజ్ఞను మేము రాముదే
వికినయి వచ్చివచ్చి యిట వింధ్య గుహంబడి తేరుఁడెన్నుగా
నక వినుఁగంటి మీ వెలిఁగివందెరువొక్కటి చూపు మన్నఁగం
దక సతి కండ్లుమూయగవి దాఁటిరి దాఁగుడు మూతగాఁగపుల్ 168

ఇట్లు బహుతిమిర సంవృత గుహాంతరాళంబు నుండి నిమేష మాత్రంబు
వెడలి స్వయంప్రభ యొంటి ప్రభకు నామె తపోమహిమకు మిగుల నచ్చెరు
వందుచు నంగదా[illegible]గములు చెలంగి యచ్చట నుండి కొండొక
దూరమారసి యెచ్చటను జానకింగానక ఋక్షబిలంబునన తమకు గడువు

నెలగడచి చనుటకును వనచరపతి సుగ్రీవుని దగ్గరదండనకు వెఱచి యువరాజగు నంగదుండం గదగొని ప్రాయో పవేశంబు నందభి నివేశముగా వింప దారుండుదారుండు గానఁదారేయు తోడి పాటు వాడై యాపనికేయాపని కేమని సమ్మతించుటయు

169

ఉ పావని రోసి మాస మెడఁబాసియు నీసరికెందుఁగాన మ
ప్పావని సీతఁగాననిక బ్రాయమె శ్రేయమటంచటు ల్లలం
పావని నిశ్చయింపఁ గపులందరు నొప్పి ముమూర్షనుంట త
ప్పావని తార్క్ష మాజిని దశాస్యుని చేత జటాయు వుండునాన్ 170

వ భాను భానుదగ్ధ పక్షుండై పక్షీంద్రాగ్రజాగ్రతనూజ సుపార్శ్వన్ సంపాదిత మితాహారంబు దేహధారకంబుగాఁ గుక్షి భరింపుచు బక్షీంద్రాగ్రతనూజుండగు సంపాతి పక్షసంపాత వంధ్యశక్తుండై వింధ్య గుహనుండి చిరకాలమునుండి పడియున్న జటాయువగ్రజుండు నయ్యెండఁదలచు గొలగొల లాడుచున్న గోలాంగూల తరుచరవరుల గని యొక్కనినైన విడువక యొక్కొక్కనిదిని దినము దన కడుపు చిచ్చు చల్లార్చెదనని వారి కడకు నొయ్యనొయ్యన వచ్చుచుఁ దన తమ్ముని పేరు వారు పేరుకొనుట యు ఁగనికరమొదవి విపక్షపక్ష బుద్ధి మాని యా విపక్ష పక్షిపతి యప్పుడు

171

ఉ. పాతిత నర్మశర్ముఁడయి భ్రాతృవధన్విని యార్తిఁగూరి సం
పాతి తనంత తానటకువచ్చి జటాయువు వున్నవేమఁదా
పాతి తమున్ను దీవెనని యాత్మకథ వ్వినిపించ యంతతోఁ
బాతిత పక్షము ల్మొలువ వారికిఁజెప్పెను సీత జాడలన్ 172

చ. అవనిజ రావణాసురుని యాలయమందున మున్నయట్లుగాఁ
బవనజుఁడంగదాదులును బక్షిపువెల్ల నెఱింగి సంద్రమున్
బవన జవంబు తోనెవర వారము చేరదరన్న బుద్ధి గొ
వ్వనజగర్భు సూతి మున పావని కన్నను మిన్నలేదనెన్ 173

కవిరాజ విరాజిత వృత్తము

అదరక నేఁ బదియామడ దూఁకెద
నంచు గజుండు గవాక్షుఁడు వి
ర్వది గవయుండని వాలుగ ముప్పది
దాశరభుండని తారక న
ల్వది పదిహెచ్చని బంటొకఁడర్వది
వాకొనె మైందుడు బలే ద్వి విదుం
డిడె హెచ్చని నెంచె సుషేణుఁడు
నెన్పది తొంబది ఋక్షపుఁడున్ 174

కవిరాజ విరాజిత వృత్తము

అదివివి యంతయు నంగదుఁడిట్లనె
హోలిగ వాలికి వాత్మజుడన్
బదిబదులామడ వారిది నాకొక
భారమె పో మఱి వచ్చుటకున్
జదురుమగా వన జాంబవదాఖ్యుఁడు
వాలుదు వెంతకు స్వర్గమునన్
బదిలిడు మైనము భార్యగ రాజును
బొఁజా గనందగుఁ బాల్యుఁడు గాన్ 175

గీ కావఁబవిగొను యువరాజుగాను బనుల
కిందఱును భృత్యులుండ నీకిందముగఁ
జనుని తెద్దుండఁ జెయిఁగాల్చి కొనఁగ నేల
లంక కిపుడంపుమొక యకలంక బలుని 176

క అవవివి యంగదుఁడంగద
మన వినయముతోడ నెవ్వఁడానతికిం జా
లిన వాఁడున వెలుగుల ఁజే
డని మనవివి వినుమటంచు నాతని తోడన్ 177

గీ. కొండ తలక్రింద విడికొని గుండు ఱాల
కొఱకు వెదుకంగ నేల నీ కొఱకు రంటఁ
దవిలి యుండఁగ మదిఁజింత దవులనేల
మంతునకు నెక్కు ఘను హనుమంతు ననుపు 178

వ అతఁడిట్లనుటయు నీనీకార్యంబు సక్కపఱచి కాపాడుమని యమమని
నుఱిమఱి గొనియాడి యనుమతి పఱిచిన నీయంత వాఁడు లేఁడని
నేఁడుటయును

179

ఉ. అందఱు నాంజనేయుఁగొని యాడఁగ వేఁడగ నాతఁడొప్పి మీ
రిందఱు వంది చూడను దధీంద్రుని దాఁటెద గొప్పదంబుగాఁ
గందఱుమైన నాబలిమిఁగన్గొనుఁడంచును దూఁకె వింగి కే
గం దరువాణ మందముచుఁగాళులు సేతులు యేఁగు దించుమన్ 180

# సుందర కాండము

సీ. అప్పుడాతఁడు పైకిఁగుప్పించి యెగసి
యువ్వు సంద్రము మీఁదమునుఱుకు తఱివి
నాక మానన్న నుగుటనక్కనకకూట
మైనాకముంగని మానముంది
మరసమర్పిత భార సురసదర్పిత ఘోర
విరస వక్త్రము సొచ్చి వెడలి వచ్చి
సింహకోటి కరాళ జిహ్వా కామగ్రాహి
సింహిక ప్రేవులు చీల్చి కూల్చి
సకల వికలావదల విట్లు వరవి ఁ గడవి
కడలి శతయోజనము విఱుకయ్యకరణి
దాఁటి యలవోకగా వద్రి కూట మవలి
నేలపై రామబాణమ్ము పోలె వ్రాలె. 181

వ. ఇట్లు వాయుసూనుండు వాయువేగంబునఁద్రికూటాచలంబున డిగి పగలు

లంకలోనికిఁజనిన రజనీచరులు పగఁగొని తమ్ము దలపడిన నింతిని వేవకుటకు నంతరాయము వాటిల్లు నని సూర్యాస్తమయము వేచి లంకదేవతపాలఁజూచి యద్దాని కోటలు తోటలు పేఁటలు బాటలు మేడలు వాడలు కూడలి రచ్చలు బచ్చులు మచ్చులు ఫౌజులౌజులు తురంగమాది చతురంగబలములు లోనగువాని రీవిఁగన్నులారఁగని లోనగుచు నౌర దీనిసోరు దీనికిగాక మఱియేవ్వటికైనఁగలదే ఇవ్వటికివ్వననిధి దాఁటిరా నెవ్వనికి వశమగు? నగుఁదాక కట్టఁడి తనమున నా బోఁటి వాఁడొకానొకండు వచ్చినను నగుబాటగుఁగాక తగువాట నబోటియగు జానకి యగబాటెట్లు వాటిల్లు సీటుగ నిల్చి యనర్గళ దుర్గమ పురవరంబుఁజొఅ నెవరి తరంబగుఁబగఁగొన్న యీ యసుర నెదిరింపఁగరంబు దుర్భరము గాక యీనిబ్బరపు బూటకముల మాట వాఁడేయని లంక హెచ్చుగని మెచ్చుకొనుమనచ్చేరుప నచ్చెరువువడుమ సీతనొనఁగూర్తునని రఘువరునకు బొమ్మఁజెఅచి వన్నిదము నఅచి బరుపడి బరవనపిడి నయిన తనయు కేటిమాట తక్కునని యెంతయుఁజింతించి హనుమంతుండు మఱియు 183

క. దాశరధి శరధి, శరరధిఁ
ధాశరధి శరధి మహోగ్రతఁదలమొలచి పె
ద్దా శరధినీశ కుముం
దా శరధుర్యుండడంగు నీని మదినలరెన్ 184

క. సంజమ బురిఁగవఁదలఁచి వె
సంజనశందాఁగి చాఁటునఁగొని యీ
సంజనిడియొడమయడుమ ర
సంజనఁగాఁదొడఁగె బఁలుషం బిల్లి వలెన్ 185

క. అవికల వ్రవతి పతిఁగవ
నవికలమతి సమతనయుఁడరుగుటకు విశన్
రవి కల్పింపఁగ నస్తము
న వికటకము మఱుఁగునకు రయంబున నేగెన్ 186

వ అంతఁధరణియస్త ధరణీధరావతరణంబు సేసిన యనంతరంబ హను
మంతుండు

187

క. మును మాపగుటయు వెల్వడి
మును మాపనిఁజూతు నన్నుమొఱకు లెదిరినన్
మును మాపవె రాకాసుల
మును మాపగ తీరసాలములఁగ్రోతులిటుల్ 188

వ. ఇట్లుంచు యేగుదించి వనచరవల్ల భుండు నల్ల నల్లనంబిల్లివలె నడుగు లిడుచు

189

మత్తకోకిల .

లంక యుత్తర గోపురంబును లంఘనమ్మునరించుచో
లంక యత్తఱి నాత్మరూపము లావు చేకొని యార్చి ని
శ్శంక వానరయేల వచ్చితి చంపుదున్నిను నిల్వునాన్
వంక పెట్టుచు పీఁడు సూడఁగ వచ్చితిని యనె నాతఁడున్ 190

వ అనుటయు లంకాశక్తి కాలనియుక్తమై కాలాగ్ని రౌద్రాకారంబున నిల్చిన
మీరజాతో నిట్లనియె

191

ఉ ఆఁడది యంచు జూడకుమనా ధృతి నన్ను జయించి కాని యీ
పీడుసారంగ నీకగునె వీరిడి యంచును జేతనాతనిన్
గాఁడగ నాయమేయఁగపి కామినియంచును జంపలేక ము
న్నాడిగ వామముష్టి వదనంబున మొత్తెను రక్తముర్లఁగన్ 192

ఉత్సాహము

దెబ్బఁదినియుళంకు లంక తిమురడంగ నాకిఁకన్
జబ్బుకాల మచ్చె బ్రహ్మ శాపదగ్ధ మీపురిన్
నిబ్బరముగఁజొచ్చి పేయు సీమనుల్పమస్తమా
యబ్బ సీత చేత దైత్యుఁగారు డారుమూడుగాన్ 193

గవము

ఇటులనఁగపివతి హేలగ లంక జ
యించి చివాలున నెగిరి యొగిన్
జిటికెన గోటను జెండువ వెంబడఁ
జెచ్చెర దుమికి నిశింగనియెన్
రటనము సేయక రాజ గృహమ్ములు
రాణువు లొక్కెడ రావణునిన్
దటుకున మండోదరిఁగని సీతఁగ
దగఁగొని కాంతని తలఁగియటన్. 194

మేడల నెక్కియు గోడల నక్కియు
మడువుల్ద్రొక్కియు మచ్చులెక్కి
మాటిమాటికిఁజాటుమాటు చోటులకేగి
బోటులగని నిద్రపాటు మీఁద
రంగస్థలంబులు రచ్చ పట్టులు మెట్టి
శృంగాట కమ్ములు తొంగి చూచి
బందు లుండెడి చోట్లు పందలుండెడి చోట్లు
పెందలకడ సందుగొందులరసి
మూలముట్టుగఁగనియె నాఁప్రోలతండు
విదియది యటంచునొగి వచియింపనేల
బట్టి యనుమఁడు మెట్టని యట్టినేల
లేక్కకును బెత్తెఁడైనను లేదు నమ్ము 195

వెతకి వెతకి యతడు వేసారి వేసారు
అరిగి పట్టి చోటి కరిగి యరిగి
బలముగాఁగ గాడ్పు బలపముల్గట్టగా
రామువల్లి కానరామిఁగదలి 196

హనుమంతుడు తనమనంబున నిట్లని చింతించె నెట్లనిన
197

క ఆలించి గృధ్రవాక్కుల
నాలించి హితాళి శరధి లంఘించి పురిన్
దూలించి గ్రామదేవత
గాలించితిలంక దేవి కన్పడదెందున్ 198

ఉ ఏకడగండ్ల వడ్డ సతియించిన యెచ్చెదరేని నేనయిల్
వాకొని పెట్టిపుట్టని యభాగ్యుఁడ నాకెటుమాట దక్కనే
నే కరణిన్ గమింతును గపీశుని పాలికి సీత సేమమున్
శోకము దీర రాజడుగు పోరెటులాడును నాకు, నేమనన్ 199

ఉ. నేనొక పోటు బంటునని నిండు దయన్నను నంతమందిలో
బూనికఁబిల్చి రాముఁడిడి పుణ్యపు ముద్రిక నానవాలుగా
మానిని కిమ్ము నమ్ము సతిమాఱు వచింపను నోటినిండ నీ
తో నన నానలేక తగుదున్మతి తెమ్మనుకొంటినాదుచేన్. 200

ఉ. జానకి జాడ భాగ్యమెటజాలియు జాలని కోతి నేనటన్
దీనమ్మగమ్ము నక్కయెట దేవతలోకమెటన్నయట్లుగా
నానఁగబూనఁగర్తలగు నంగద ముఖ్యులు నందఱుండగన్
నే సహమస్మియంటి నడి నెత్తికి నెత్తికొనంగ నెట్లనై 201

వ. జానకి జాడగాన కిటపాగి వేగిరము వానరేంద్ర నరేంద్రుల పాలకేగ, నోయీ
వాయుపుత్ర సీతంగంటివే యని వారలు నన్నడిగిన నందున కేమందు
202

చ. అగుపడలేదు సీతయన నంతటి తోడనె రామలక్ష్మణుల్
వగను ముగింపుకొంద్రు కపివర్యుడడంగును వారితోడి పా
టగుదురు వాలిజుండు కపులందఱుచావటకు నేను నమ్ము వె
మ్మగఁజిరజీవిఁజేసె విధి జూడక సాధక బాధకంబులన్ 203

క. ఏమని కొని చని తెల్పుదు
రామునకీయప్రియము చిరంజీవి వలెన్

నేమని చిరజీవిగఁగొలు
గాములఁగన నేల మూలఘాతని గాఁగన్ 204

గీ ఓపనిఁక నాకు జానకిఁజూపకున్న
పీకఁబెకలించికొని నాడుతోకఁజుట్టి
యొక్కవంక నమరపురి నొక్కవంక
రక్కసుల లంకఁగొంపోదు రాముకడకు 205

క అని పగచి నగ వరేశుడు
కనరున నందునకఁదానుగానని సుమనో
వనమునకువాదిగొని భూ
తనయను నట గాంతు నన్నధైర్యంబొదవన్ 206

ఉ రాముని లక్ష్మణుందలచి రాముని దేవి భజించి సీతఁబే
రామనిగాముద్విజరి హరాజుల నింద్రుని జంద్రు సూర్యుఁగా
రాముని మారుతాగ్నులకు రాణవెఅంగుమ సిద్ధినిచ్చి యా
రామమునందు వీరు రఘురాముని భామను నాకుఁజూపుతన్ 207

వ అని యిట్లు హనుమంతుండత్యంత భక్తియుక్తుండై తన యిష్టదేవతను
తలచి మ్రొక్కి రావణుని విష్కుటపుష్టారావనా వరణ వరణంబువను
దటాలునఁగుప్పించి యెగసి యావట తోట గోడపైవ్రాలి
208

ఉ. తటుకున దూకి గోడను శతప్రాదవోలె వమీరసూతి య
చ్చట నొక శింశుపాతరువు శాఖపయి న్వెసనెక్కి దానిక్రిం
దటఁగవె రామరామాయని యార్తిని గూరి యహర్నిశంబును
ధృటగతి భర్తఁగూరిచి తపంబొనరించెడు నొక్కయంగనన్ 209

మ. కని తాపిన్న సమస్త లక్షణము లక్కాంతాలలామంబునం
దుమ దార్కాణగఁగ వృదందొలగె వాదుష్కర్మములోడు తో
డవ వాక్యము తెల్లఁదీరే దుదముట్టవ్ సీతవామాత నున్
గనుఁగొన్నాఁడను నాదుభాగ్యమునఁబాగా నేసలింగోటలొ 210

క. అని యానతి సీతయ కా
విను హనుమటు శత, సహస్ర, విధములను సప
త్రింగనియు నిశ్చయించుచు
ననువుగ నెటుపలకరింతువని యెంచు తటిన్ 211

ఉ. వేకువజాము రావణుఁడు వేగమె నిద్దురలేచి మన్మథో
ద్రేకము పట్టజాలక మదించి సురాసుర భోగ కామినుల్
చేకొనికాలదీవియలు లీలఁగ లోలత వెంటనంటి రాఁ
వేకువ లేచి వేగ యరుదెంచెను జానకియున్న చోటికిన్ 212

ఉ. వచ్చి యితా పతివ్రతను వాకొనరాని కఠోర వాక్యలన్
హెచ్చి సురారి సీతనతి హేయముగాఁదనుగూడు మంచనం
బొచ్చెము సేసి సీతయొక పాఁదము జేకొని దానిఁజూచి యో
కుచ్చితుఁడైనదానవుఁడ కూడదురాయిటులాడఁదల్లితోన్ 213

చ వినుమిటు కండకావరపు వెళ్ళిని నోటికి వచ్చినట్లు గూ
సిన నిహముంబరమ్ముఁజెడు సీయసరే పరదార గామినిన్
ఘనతరపాపకాల ఫణికంఠమునంటెన మేసి చుట్టు కొం
చును రెగఁగ్రోలి సీయసులు చూఱఁగ నాయువు శ్రీ గ్ర సించురా 214

ఉ. దీకొనలేక రాముఁబతిదేవత నన్నిట దొంగిలించితే
సీకెటు లొప్పెరా మనసు నిన్నని నందుము మండె యన్నలో
కైకవిభుండు నారుపతి నేరిగజూచి తొమ్మన్నఁజూచి నన్
జేకొని నారు బుద్ధి నను శీఘ్రము రాముని కిచ్చి పుచ్చు మీ 215

చ. అటులొనరింపవేని విను మాజిని నోజన పుత్రపౌత్రకున్
దటుకున విన్నుగూల్చి రఘునాథుడు నారగ భాగధేయము
క్కట నను జెందు నెందెవరి కాచుల సైబడి కావుమన్న నే
మిటునయిన న్నినుందవిలి మ్రింగు గుటుక్కున రామబాణముల్ 216

చ. అదియటులుండనిమ్ము దుమజాధమ యేటికి నంతరాంత వి
న్నదర శపించి యుమ్మితరియారేదు లోపం బూది సేయునే

మదిఁబతి యాజ్ఞ లేదనుచు, మానితి, నారఘువీరు, చేతఁగొ
న్నిదినములందుఁద్రుంగు నినునేఁడునుమంజెయిసేసి కొందునే 217

ఉ ఇంతకు మున్నతివ్రతలు నెందరొ నిన్ను శపించి పీడి రా
చింతల జేఁకు నీకకట జీవితకాలము హ్రాస్వమయ్యెగా
వింతగ జావు దెబ్బఁదిని నేకొన యూపిరితోఁగ్రుశింపు ము
ద్దంతువుఁబాము గబ్బఁగొని చంపఁగనేలని నిన్ను వీడితిన్ 218

మ అవి తన్నామె తృణీకరించి తలవాయన్రోతలంబెట్టఁజ
చ్చిన బొమ్మై యమరారి కాతఁడలుకం జేబూని ఖడ్గంబు నా
మెను ద్రుంపంజన భార్య యడ్డపడి కామింపంగ మేమున్న బో
మను జాబ్జాక్షిని బ్రాణనాయకయ కామంగోర నీకేటికిన్ 219

గీ అలియన్న మాటలాలించి లాలించి
వాలుఁబూని నట్టి కేలు వ్రాల్చి
పొంగు కోపమెల్ల మ్రింగికొంచెద లోన
లెస్స నాతఁడనియె నున్నురుము 220

శా పోనీ పాపము మర్త్యకాంత కెటులబ్బు న్దైత్యలోకేశులో
నానా భోగములంచు సీతకదియందంజేయ నేఁబూన న
ట్లౌనా కుక్కకు నేయి యిందువె యవశ్యం దీని హింసించి
దానావ్యాళులు తిండి రెండు నెలలన్నా నొప్పకున్నన్ననున్ 221

క ఇటులని యనురవరుండం
తట నంతిపురమ్మునకుఁజనన్ జానకి క
న్పటి రాకాసులు నుడివిరి
కిటికిడి కటువులను నోటికివి వచ్చినటుల్ 222

## పంచచామరము

కరమ్ము దుష్కరమ్ము పంక్తి కంఠు చేయిపట్ట
శిరము మొమ్ము వ్రాయ మీవు సేరు రావణున్ శిరున్

దొరం దొరంగు రాము మర్త్య తోడ గార్య మేమిఁకన్
దిరమ్ము నందరాని పండు నీదు చేతి కబ్బుటన్ 223

ఉ. లలనరో! హస్తలబ్ధమగు లప్పనుమీ యసురేంద్రుఁడేసిఁగా
దలఁచితి వాని నీకతఁడు దక్కిన జన్మము ధన్యమౌను నీ
కిలపడఁడట్టి వాఁడిఁకను నట్టులు రావణుఁగూడవేని పెం
దలకడ నిను జంపి తొల్తంగబలింతుము చల్లికి కూడుకాగనన్ 224

ఉ. రక్కసులిట్లు జానకిని గ్రందుగ గ్రక్షకరోరవాక్కులన్
వెక్కులు నొక్కి చెప్ప మది భీతిల కిట్లనె సీత వారితో
నెక్కువ తక్కువల్పలుక నేటికి లోఁబడ నిట్టి కూఁటికిన్
గక్కుఱుతుల్విడుండెడమకాలను గూడ స్పృశింప రావణున్ 225

ఉత్సాహ
ఏల కంఠశోష మీకు హ్యాగ్రతంబు దెల్పెదన్
బాలలార వినుడు నాతపః ఫలమ్మ నుమ్మ నా
పాలి దైవమమ్మ నాకు బతియు గతియు రాముఁడే
కాల మతని దక్క నన్యుఁగంట జూడ నేర్వనిన్ 226

క. అని యిటు జనకజ నిక్కము
తన హృదయగతమ్ము ఖండితముగాఁదెలుపన్
దనుజసతు లామెకడకున్
జని వెనుకటి చదువె మఱలఁజదివిరి పెలుచన్ 227

క. అటరక్కసులన్ త్రిజటయు
పటువాణియు వృద్ధలేచి పక్కనుకలలో
పటుమతి రాముని విజయము
నట రావణునవజయమ్ము కంటిని వినుడీ 228

చ. అనవిని రక్కసుల్ త్రిజట యాకల యెట్టిదొ విప్పి చెప్పవే
యన నది చెప్పె రావణుఁడు సోమజ మంత్రి తమూజ హైన్యుడై

మడిసెను రాము చేత నని తూద్చెను లంకను రామదూత మ
న్నన బ్రతికగూడె సీత స్వజనంబు విభీషణుఁడేలె లంకనున్ 229

ఇట్లు కలగంటినని కావరులగు రక్కసులకుఁ జెప్పి జానకి నూరార్చి త్రిజట మఱియు నిట్లనియె

230

: ఇక్కల నిక్కల మయ్యెడు
మ్రొక్కుడు మన సీతపాదముల కింతట మీ
రెక్కువ తక్కువ లాడినఁ
రక్కఁగు రాఘవుడు గావఁరాఁడిక మిమ్మున్ 231

: అపుడారక్కసులుంజడి
చప్పుడుగాకుండ మ్రొక్కి జానకితో మా
తప్పులనెన్నకు చెప్పకు
మక్కామాబావరాగ మాటలు మాపెన్ 232

: కని యిటురాకాసులు వా
కొని యెవ్వరిదారి వారు గుజగుజ పడుమున్
జని వేకువతఱి గావునఁ
గొని జానకి మల్లెఁజాల్లు కొని కూర్చుటయున్ 233

: దానవ వరు దుర్భాషలు
దానవ వనిత లమపల్కు దారుణవాక్కుల్
వీనులకు సూదివట్లులు
గా నమువులు వీడ సీతగమకించి మదిన్ 234

: తన జటమ జెట్టుకొమ్మకు
నొవరంగా చేసి మెడకు మరిపెట్టుకొనన్
జనకజ వయినించెడు తఱి
వనవర పుంగవుఁడు మర్త్య వాక్యంబనియెన్ 235

సీ. మహితుండు సురసత్త్ర మాప్తుండు దశరథ
మహిపుఁడ యోధ్య తామహిమ నేలు
నతనికి నల్వు రున్నత భుజాల్పుత్త్రు లందుఁ
బ్రథముండు రాముండు ప్రథనఘనుఁడు
జనకు నానతి నేగవనికి వాలగు సీత
యనుజుండు సౌమిత్రి యనుగమింపఁ
బతి దేవతను సీత దితిజేశుఁడు హరింపఁ
బతియుదేవరు డామె, వెదకి కొంచు
మొనసి వచ్చి ఋశ్య మూకమ్ము చెంతను
గ్రీవుతోడను మిత్ర భావమంది
వానియన్నయైన వాలిని దెగటార్చి
యతని రాజ్యమెల్ల నితని కొసగె 236

సీ కపిపుంగవుండు నయ్యుపకారమునకుఁ బ్ర
త్యుపకార మొనరింప నుత్సహించి
యుర్విలో నెందెందు నున్నట్టి వానర
కోటుల నొక్కటఁగూర్చి తెచ్చి
యొక్క మాసంబున నుర్వీ జతావును
గనుగొని రాకున్న గావనముచు
ముందుగాఁ గొందఱు మొనగాండ్రఁ బంపెను
మూఁడు దిక్కులకును యొనసి పిదప
గట్టిగాఁజెప్పి యొకనెల గడువు పెట్టి
యస్మదాదులఁగొందఱ నరసి కార్య
దక్షులను దక్షిణాశకు లక్ష కపులఁ
బంప నిట సీతఁగంటి నాభాగ్యవశత 237

క. అమ్మారుత తనయుఁడ నే
నమ్మా హనుమంతుఁడందు రందఱు నన్నున్

నమ్మఁడు ముమ్మాటికి నను
నమ్మానవనాథు దూతనని వివరింపన్ 238

అమాటన్విని సీత రాము కథయం తాలించి చాలించి వే
ఱేమో దైత్యుల మాయ నమ్మ వశమా యేరైన నిట్లాడిరో
సామాన్యంబని నమ్మలేము యడియానందధ్యాన్మై యుండు నా
ధీమంతుండగు వాయుసూతి యనె సందేహింప వల్దంచటన్ 239

అమ్మా నను నిటు పంపుచు
నమ్మానవవరుఁడు తన కరాంగుళి ముద్రన్
నమ్మకమున కిడెనాచేఁ
గొమ్మా యిదెయిదెయంచతండు కొమ్మకొసంగెన్ 240

క్షితిసుత రామముద్రికను జేతను సీత పరిగ్రహించి ప
మ్మతిఁదలపైని నుంచికొని మక్కువ నక్కునఁజేర్చి కండ్ల నం
చితగతిఁగప్పికొంచుఁబతిసేమము వేమఱుగ్రుచ్చి గ్రుచ్చి మా
నితమతి దెల్పి కొంచడిగి నెమ్మిని నమ్మెను రాము బంటుగాన్ 241

అమ్మహిజాత సీత ప్లవగాధిపుఁగన్గొని పల్కె నెవ్వగల్
గ్రమ్మెడు మోముతో నెవరు గన్నది విన్నది కాదు కాని రే
శమ్మది లంక యిందునముఁజాలఁగ రక్కసు లాడుమాటలన్
దమ్ముఁడ వీనులార వినరాని వితేటికి విప్పిచెప్పగన్ 242

ఏది యెటైనను న్వరియ వేటికి రావణు దీనదానవున్
మేదిని గూల్చి నన్గొనుట మేలగు కార్యమటంచు రాముతో
నాదు మఱుందితో నుడివి నన్గొని పొమ్మని వాక్రుహోయతన్
మోదము గూర్చు మంచుఁబలి ముద్రకు మాఱొసగెన్ శిరోమణిన్ 243

ఆ మాణిక్యము చేతనంది కపి రాజామాత్యుఁడా మాతతో నేమం బొప్పగ
నేమ జెప్పగం దాపింజెప్ప పామిత్రితో రాముందెచ్చెర విందుఁగూర్చెర
మిముఁ రంతిల్లి యుండమ్మికన్ వాపీదందయయుంచి నన్ను నడిగాఁబంపమ్మ
నత్తున్ నెమన్ 244

ఉ. ఇంకొక విన్నపంబు వినుఁడేను దశద్విశత యోజనాఢ్యమున్
గొంకక యొక్క యూఁకునను గొబ్బున దాటితి నద్దఱుండని
శ్శంకను రేయి యెల్ల నిముసంబయినం గనుమాయ కంతటన్
లంకను రోసి యాక్రొత్తిని లావుగఁ గాంచితి దక్షి నాకటన్ 245

గీ. రిః యిూక వనిక నెంతయు ఫలములు
ముంగిఁబాల ఎండి ముగ్గియుండు
గానఁదినఁగ నాకు నాసతిండొకటున్న
నష్టసేయుమంచు నామె యనుడు 246

ఉ. సీతకు మ్రొక్కి వాయుజుడు చెప్పెర నప్పుల వాసి వాసిగా
నాతత దేహుడై నిలిచి యాసురపర్యుని పూల తోఁట సం
జాతయిన్నస్తమస్త తరుజాతము కూకటివ్రేళ్ళతో వెసన్
పీత భయుండుగాఁవెలికి వేసితి గాసిల నూఁచముట్టగాన్ 247

ఉ. ఎంతట నూలుకుండకితఁడప్పటి సాధముఁగూలఁ దప్పియున్
ఎంతము రాడునప్టి వనపాలుర మొత్తగ మొత్తి చంపి మీ
రంతుబు మానుడింక రఘు రాముని దాసుఁడ నాంజనేయుఁడన్
మింతనమేల భానుసుతు మంత్రిని సీతఁగనంగ వచ్చితిన్ 248

ఉ. మిక్కిలి రావణాసురుని మించిన దైత్యులు వేవురేనియుం
జక్కగ నాజి న్నెదుర జాలరనంగ నదేమి లెక్కి యా
క్కుముక్కిడి రావణుండొకడు మోలకు వీరత నుండ బోరికిన్
పిక్కుడు, మీకు లంక యనుదండన దప్పదు రాజదండమున్ 249

వ. అని హనుమంతుఁడంతఁదన యాగమన స్థితి దెల్పి తోరణం
బున కెగఁబ్రాకి యుండఁగని పూవికఁగొందఱు పోయిచేవితో
దనుజవరేణ్య పేరడఁగెఁదావక పుష్పవనంబు నేఁటి తో
మెముకొని వానరం బొకటి పీఁక హుజాడొవరించె బ్రాకులన్ 250

చ. వనవు లదల్పఁబోయినను వాఁడెలమింబడ మొత్తు టాలతో
దనుజాల వెక్కిరింపఁదన దావునకేరివి జేరసీయదే

మన మిది యేరి పంపకము యిక్కట యెక్కడ దాపరించెనో
యొనరగ సీతయున్న తరువొక్కటిదక్క మథించె నన్నిటిన్ 251.

కనికపిఁబట్టఁగల్గు మొనగాండ్రను నేవురి పంపి పట్టుడన్
ఇటఁగడు మీఁదు మిక్కిలి ఘటించుట సిద్ధమటన్న రావణుం
డనుపను కింకరాహ్వయుల నంపుడు నేన్బది వేల దైత్యులన్
వనచరు బట్టబోయి యనువారలె కూలిరి యాంజనేయుచేన్ 252

పోయిన కింకరాహ్వయులు పోయిన వారదె పోకమైనటుల్
మాయముగాఁగ వేగ హనుమంతుని చేఁదిని చావుదెబ్బలన్
రాయుచుఁగోతిఁబట్టు మని రావణుఁడంపె మహోగ్ర మూర్తియై
యాయత శస్త్ర జాలుని ప్రహస్తుని పుత్రుని జంబు మాలినిన్ 253

జంబుమాలి యంతడంబు మీఱఁగనేగి
సైన్యయుతుఁడు గాఁగ జన్యమందుఁ
గారు చిచ్చుపైకిఁగదిసిన మిడుతల
బారు తీరుగాగ బాటె తీతె 254

ఆవార్తన్విని పంక్తి కంధరుడు దానత్యంతముంగుంది స
ద్భావు నావకరూపు నక్షుని మహోదక్షున్సుతుంబంపఁగా
రీవిన్వాడని కేగి పావనికి నోడెంద్రెళ్ళి యుద్ధావనిన్
లావౌదుఃఖముఁబెట్టి తండ్రికిని జాలంధల్లికి న్నార్యకున్ 255

అక్షుండూఁడిన తోడనె
రక్షోనాయకుఁడు తనయు రావణి నంతన్
వీక్షించి హృదయగతమును
బక్షా పక్షములు మాని పలికెం గఁటకున్ 256

అన్నాపుత్రక మేఘనాథ వినుమీ యున్మత్తుమారామమున్
ఛిన్నాభిన్నము సేసి యొక్క కపి తాఁజెల్లన్ని పీఁకాకుగాఁ
దున్నుంబట్టగ బోవు దైత్య భటులం ద్రుండించెఁగా నందఱన్
సన్నాహంబున జంబుమాలినవిలోయించెన్ బ్రహస్తాత్మజన్ 257

శా. నీ తమ్ముండతిదక్షుఁ డక్షుఁడడఁగె న్ఫీశాలి కీశాధ్యచే
భీతింజెందఁడొకింతుకేని కపికంపింపండు నాబోట్లకున్
ఖ్యాతింగోతిగ నెంచఁబోక తదవధ్య శ్రేష్ఠుడై తోఁచెడిన్
భ్రాతిస్నీతరమౌనె వానిని జయింపంగా నెటులబ్బెదో 258

ఉ ఆకృతి జూడ వాడుకపియౌ వనిలో లయకాలరుద్రుఁడే
నీకెద తాలినం జనుము నిక్కము జంకిన వానిపైకిఁబో
బోకు మహేంద్రుఁడాదిగను బోరనినున్గని పాఱిపోవ నీ
దాక జయంబెకాని వితథత్వ మెఱుంగవు యెన్నఁడేనియున్ 259

ఉ అనుటయు మేఘనాథుఁడనె వబ్బకు నాయనవిమ్ము నాకు నీ
పనవరమేమి లెక్క మును వాసవముఖ్యుల గెల్చినట్టి నా
కునుమల భ్రింగు మారికిని గుల్పగ దల్పక యుప్పుడంబొకో
యనుగతి కోతి యెంతటిది యచ్చెరు వొప్పగ బట్టితెచ్చెదన్ 260

చ. అని తనతండ్రితో నటుల నాడి ససైన్యుఁడు మేఘనాదుఁడ
త్యనుపమ శూరుడై కదలి యంతటరా సభయుక్త మానముం
గొనకొని యెక్కిపోయి యలకోతిని బట్టెదనంచు నెంచి నా
నిని గఱకంఠుకంటి కరణిం బురుణించెడు తూపులేయగన్ 261

క వానరునకాశరములు
నూనములట్లింపకేని జాఱకయిడమి వా
దానవుఁడెద లోఁదుమని
నానాఁటికిఁదీసికట్టునకు వచ్చెననెన్ 262

వ. అని మఱియు నా మర్కట వీరుని గుఱించి తర్కించి తన పౌరుషంబు
వాలమికి మిగుల వెగులుమ రావణి యిక కీర్తిప్రతిష్ఠలు రావని యిట్లని
వితర్కించె

263

చ. కపిని జయింప నాతరము గాఁదిక దొల్లి టివారులావు నేఁ
డపహతమయ్యె శస్త్రములు మారడి వోయడిఁగాల్పైవరీ

త్ర్యవుగధగాగఁదోచు నరయంగతకాలమెమేలు, నమ్ము కా
లవు గతికంటె నాశరబలం బిఁకనేల తెలంగు మున్నెలెన్ 264

అనిదనుజేంద్ర నందనుఁడ జాస్త్రము తానరివోసి యేసినన్
ననవరవర్య మేనికది నంత యొనర్పమి మేఘనాదు డీ
నవజ భవాస్త్రమే యిటులు నమ్మయిపోయిన నస్త్రశస్త్రముల్
గొనకొని నేతెయేమి పొనగున్నర వానర కోటిపైకిఁకన్ 265

మారుతి కీబ్రహ్మాస్త్రంబునఁజేమకుట్టిన పాటియుగాకుంటకు గతంబు
వినుము 266

హనుమయ చిన్ననాడొకట నాడును దూర్పునభాను బింబమున్
గనుఁగొనిపండటంచుఁదమకంపడి బింబము మ్రింగ బోనుధా
శనపతి యడ్డమేగి వెలుచన్ బెదరించిన వానరుండు భా
మవినిడి యింద్రుమ్రింగను గనుంగొన వానపుడాగ్రహంబునన్ 267

కని విదలింపనంత శతకోటిని కోరడగన్ శివాలునన్
బనువడివేలపై నతడు బాలుఁడు గూలుడు పొమ్మపిల్లమున్
గవియనిటందు నచ్చటికిగ్రక్కున జేరి మనోవ్యథం బడెన్
దనయుని నమ్యలట్లు డవ దండ్రి జగంబున నూరకుండునే 268

హనుమఁడలుంచు బిల్వఁబడె నాకపు చంద్రుడు నాటినుండి తా
నవిలుడు కోపయుక్తుఁడయి యాత్మజుఁగొంచు గుహ ప్రవిష్టుడా
టును విధిముఖ్యులందఱొకటంజని వాయువుగాంచి యోయిపీ
తనయుఁడవధ్యుఁడయ్యెడు వృథా కృధయేటికి నస్త్ర శస్త్రముల్
మెకవు నాపనేమిట గ్రహించగ లేనతివిప్పమీరణా 269

అవి యిట్లు వరంబు లిచ్చి బ్రహ్మాదులు వచ్చినదారిఁ బట్టి చెచ్చిర
నరిగిరంత. 270

ఉ దానవజాస్త్ర మింముక పెతందగఁజేయమి మేఘనాధుఁడ
వ్వానర ధుర్యుఁగొంచు వతివాదము పేయక తండ్రిపాలిక

చ్చే సురేంద్ర పుత్త్రుని మూలి యొనర్చిన వానరాధమున్
ధీవిధి పట్టి తెచ్చితివిదే తగుబుద్ధులు చెప్పఁ బంపుడీ 271

వ. అనుటయు రావణాసురుడునావనాత్మజుఁ గోఱ చూపునన్
గనుగొని దీఁటి నీసముజగంబున నెట్టేఁడు వాడు నామముం
గొని వినినంతనే యవియు గుండెలు బ్రద్దలుగాఁగ నట్టివో
వననిధి యెట్లు దాటి యెటు వచ్చితి నీపురికోరి నావరా 272

ఉ వచ్చిన వాఁడవీవిటకు వచ్చిన దారిని బట్టిపోక బల్
ముచ్చట వచ్చు వావనము మూర్ఖుఁడవై పెకలింప నేటికిన్
దచ్చెవలాడు కొంచపటి దానవవీరుల జంపనేటికిన్
జెచ్చెర మున్న వాస్తవము జెప్పుము వీడుదు జంపకుండ నిన్ 273

ఉ. ప్రాణము నీకుఁ దీపయిన బల్కుము సత్యము సత్కులైనచో
రాణను వీడువాఁడ విను బ్రాణముతోడ నిజంబు వల్కితిన్
రోణవులందు రావణుఁడు శూరతముండని నీవెఱుంగవే
పోణిమి భీతిఁ జెందకిటు బొంకక తెల్పుము వానరాధమా 274

క. అనవిని హనుమంతుఁడు తన
మనమున రావణుని నొక్క మశకము గాఁగన్
గొని కన్నొను తెగియించుచు
ననియెను జిఱునగవు పెలవులందున వెడలన్ 275

వ. దనుజాట యొక్కమాట వినుతథ్యము పథ్యము నీకుచెప్పెదన్
వననిధి దాటి వచ్చితిని వాలిని జంపిన రాముభార్యకై
వినుగవ వేడ్కపుట్ట యటు నీవనమెల్లను బెల్లగించితిన్
దనుజులు మున్నుడీకొనినందాకి వధించితి దేహరక్షకై 276

ఉ. చౌర్యగతిన్ దురాత్ముఁడవు జానకిఁ దెచ్చితి నీవు లంకకున్
శౌర్యము లేమి రామునకు జానకి నిచ్చిన నీకు మేలగున్
గార్యమెఱుంగు మింక నటుగా నొనరింపక తక్కితేని దు
ష్కార్యము పొంటెంద్రుంగెదవు రాఘవుచేత సబాంధవుండవై 277

ఉ నీ వశమందు నున్న ధరణీసుత నీకు నకాల మృత్యువే
రావణ యేరిఁగాగను ధరాసుత నెంచెదొ చేతులారగా
నీవిట దెచ్చికొన్న యశముంగతి నెంచుము కాలపాశ మా
దేవియె నీకు నమ్ముమిది తెల్పెద దథ్యము సేయునేటికిన్ 278

చ అనవిని రావణుండు కడు నాగ్రహమెత్తి కృశాన్వితంపగా
ననువరకోటి కాజ్ఞయిడ నవ్వ విభీషణుఁడన్న దూతనిన్
జనునె వధింప నిట్టిదని శాస్త్ర విరుద్ధము దూతకెందునుం
బనుపడఁగా విరూపకరణం బటు సేయగఁబంపు నాపుడున్ 279

చ వికటదశాననుండనియె వేగమె యీకపి తోఁక గాల్చి వా
రక విడువుండటం చనఁగ రాత్రి చరుల్విని యాంజనేయు తో
కకు వడిఁజుట్టి బట్టలను గట్టిగ నూనెను ముంచి యగ్గిమో
అకులు రగిల్చి కోతి గడుఁజాగ తనంబున లంకలో విడన్ 280

మత్తకోకిల
వీధివీధికి దూకి వానర వీరుఁడింటికి నింటికిన్
వేధసేయ రగిల్చి నిప్పును వేగగాలిచె నాతఁడా
సౌధరాజము లెల్ల మాఁడిచెజప్పగాఁబురినంతటన్
బాధనొందుచు మొత్తువెట్టిరి బాల వృద్ధులు లోనుగన్ 281

వ హనుమంతుండు తనవాలమ్మున జ్వాలాళిలమ్ముగ మండి మండు కీలికీలాలికిని
నాఁకలిదీఱ నాహుతియిడ నిదియె యదనుకొని లంకయెల్ల గ్రుమ్మరి మేడలు
మాడిచిన తెలుంగెట్లనిన 282

సీ దశకంధరుని మేడ దగ్ధంబు గావించె
గుంభకర్ణుని కొంపగుముల గాల్చె
మేఘనాథుని యొక్క మేడ పాడొనరించె
మకరాక్ష సదనంబు మంట గల్పెఁ
గుంభుని టిల్లును నికుంభుని యిల్లును
వజ్రదంష్ట్రుని యిల్లు వహ్నికిచ్చె

వింకపేరు గలట్టి యెల్ల దైత్యుల యిండ్లు
రగిలింపగగ్ని మర్కట వరునకు
నెపగి రక్కసు లిరుచేతు లెత్తి మ్రొక్కి
రంత నాబాలగోపాల మసురు లడలి
యింట వస్తువులను దీయ వెడము లేక
యాల గొల్లాల గోలయ్యె నపుడు లంక 283

క. ఎఱుగలి తఱుగక పరఁగుచు
దరిగొకి యెరియంగఁగొనఁదప్పించికొనన్
వెఱవించుకయును గానక
యెరసెడి మృగపక్షులట్లు మొరసిరి యసురల్ 284

ఉ. అట్టులు లంకఁగాల్చివడి నాత్మనుజింతిలెనాంజనేయుఁడే
పట్టున నామెసేమము నభాగ్యుఁడనై పరికింపనైతి నే
నెట్టులు పోయి రామునకు నేమని చెపుదు సీత పోకడన్
గట్టిఁడి బ్రహ్మనాతలను గట్టిగ వ్రాసి వితుల్పడింబడన్ 285

చ. అటులతఁడాత్మలో వగపునందెడు వేళను వింగిఁజారణుల్
బటుమతి నాడిపోయిరటు పావని లంకను గాల్చువేళ నెం
తటి ఘనుఁడో ధరాసుతకుఁదాసెగ వింతుక దాఁక వీయకా
దటఁబురివెల్లఁగాల్చెనిట ధన్యులమైతిమి సీతఁద్రుండమిన్ 286

మ. అని సిద్ధుల్ శ్రుతి సౌఖ్యవార్తలవగా నాలించి మేలంచు నా
వన చార్యగ్రణి కన్నులార సతిదేవింగాంచి మేనాదన్
జనాథాగ్రణి రాముఁడేమడిగినన్ జక్కంగ వక్కాణమే
నొనరింపంగల సంతోషమనికి న్యోషమణిం జూడగన్ 287

మ. హనుమంతుండొక యూకువంజనితో నాహా మేమొప్పారగన్
జని యాసీతకు మ్రొక్కి యంజలిని శీర్షంబందుఁగీలించి యా

జననీ నేనిపుడేగి కాల్చితిని బుష్పారామమాక్రీడ మున్
దనుజానీకము దాఁకన్నునరుల న్ధాత్రిబడం గూల్చితిన్ 288

మ. దనుజేంద్రుంగని బుద్ధిసెప్పి పురము న్దగ్ధంబు గావించితిన్
మనువంశాగ్రణి రాములక్ష్మణుని సేమంబొప్పఁదేఁబోయెదన్
దనుజేంద్రువ్వసుతాప్త గూల్చి యనిలోఁదథ్యంబుగా మిమ్ముఁగై
కొనురాముండిఁక నూరడిల్లుఁడిట బాగుగోరుచు నెమ్మదిన్
నను మున్మాటికి నమ్ముఁడమ్మ మదిలోనం బోయినే వచ్చెదన్ 289

వ. అని యనంతరంబు 290

ఉ. పావని యామె వీడుకొని పక్కన వారిధిఁజొక్కలించి తా
నావలి తీరముందరియ నంగద జాంబవదాది యోధుల్
శీవిని నాంజనేయుని వడింగని కౌఁగిట జేర్చి యాతనిన్
దేవికి సేమమేయన విదేహజ సేమముజెప్పె నాతఁడున్ 291

ఉ. వీరలు చూచుచుండగనె వీరయ వారిధి దాటి లంకకున్
జేరి నిశీదినింబురముఁజొచ్చిరఁజొచ్చితి రోసి తెల్లడన్
వీరములో నశోకవని వేగమున్‌జని సీతగాంచి నే
నారసి రామముద్రికను నామెకొసంగి నమ్మునట్లుగన్ 292

ఉ. ఆమె యొసంగు చూడుమణి నంది సతీమణి వీడి దైత్యు నా
రాముని గూల్చి నావయికి రాత్రి చరుల్బహు సంఖ్య రాగదే
వోముచు వామరూపముల నెంచక త్రుంచితి లంకఁగాల్చితిన్
వామము పాటి దైత్యుఁగొని నాతిని గూరిచి బుద్ధి సెప్పితిన్ 293

చ. ఇటకరుదెంచు వేళ జనయిత్రిని సీతను జూచి కన్నులన్
దటుకున నువ్వు చంద్రముని దర్దయుఁదర్దయ దాటి ధాటిగాఁ
బటుగతి వేగ మీకడకు వచ్చితి వీరలు సాఁఅంజూచి యి
వ్వటికిత నేమిట్టైన దిగఁబడ్డది యుండిన జెప్పుడీయనన్ 294

వ. అనుటయు నంగదుండిట్లనియె 295

చ సరవి న్వచ్చిన కార్యమెల్ల మనకుం జక్కం బడెన్ జానకీ
చరణాంభోజము గంటి మింతటియు నాన్నేని కిష్కింధకున్
సరగం బోదము రాముపాలికిఁ జనగా సంజాత సమ్మోదు లై
హొరువొప్పం ఖగలోక పాతగతి రీవిన్వార లొకుమ్మడిన్ 296

చ వలీముఖ వీరు లిట్టులని వార్య గతింబడఁ దూఁకి వింగికిన్
గిలకిల లాడి కొంచు దివిఁ గ్రిక్కిరియంగడుఁ గమ్మి పోవుచో
బలముగ క్షుత్త్వ షావలను భాదితులై యట మార్గ మధ్యమం
దలవడ భానుసూనుని మహావని గాంచిరి సంతసంబునన్ 297

చ వృధుతరసాల శోభి యలిపేశల ఝుంకృతిగాన మానమున్
మధురస సంభృతంబు ఫలమండల మండితమర్కి సూతి వ
న్మధువన మెట్టిగాంచి దిగి మ్రాకులకున్వడిఁ బ్రాకి రందఱున్
బృధులరసాల పక్వములు పండ్లను గండ్లను గాంచి కాంక్షలన్ 298

ఉ. అంగదు నావతింబడసి యాకపులెల్లరు గొల్ల గొల్లగా
ముంగలఁదేవ ద్రావి యతిమోహితులై కడుమత్తులై వడిన్
వెంగళు లట్టు లాడఁగని వీరిని మాను వనాధిపాలుఁడీ
సంగతి మీకనర్థమని సారెకుఁగీశుల మందలించుడున్ 299

వ రాజగు సుగ్రీవునితోఁ జెప్పెదవన్న యువరాజైన యంగదుండంగదగాని
యదలించి వనపాలాగ్రణి యగు దధిముఖున కిట్లనియె
300

ఉ. విబ్బర మొప్పఁదేనియల నేపెలివిచ్చినఁ గ్రోలిరీ కపుల్
సిబ్బితి లేక నాకెదురు పెప్పఁగ లాఁడవే యందుఁ జూడఁగా
దెబ్బకు నొక్క నొక్కనిగఁ దెంచెద నాకెదురాడువారి పి
యబ్బకుఁ జెప్పు కొమ్మనుచు నంగదుఁ డా దధి వక్త్రు మొత్తుడున్ 301

క. దవ్వున నా దధి వక్త్రుం
డవ్వనిఁ దివి చావు దెబ్బ లంగదు చేతన్

రివ్వున జని సుగ్రీవున
కవ్విధి యంతయును దెల్పి యతడిట్లనియెన్ 302

మ. ప్రకటంబైన భవద్వనంబనఘ నాప్రాణంబు లొక్కెత్తు వా
డికఁగన్గొంచును గద్గదమును బుట్టెందాని నీరంబులన్
దక పేరామని కల్లగంటు పడకుండన్ బెంచియుండాక మా
డక మీయంగదు డాగడంబుగను వీటంబుచ్చెనేదవ్యసిన్ 303

మ. హనుమ జ్జాంబవదాదులైన ప్లవగాధ్యక్షుల్ వడిన్ వచ్చిమీ
వనముం జొచ్చి యథేచ్ఛగా మధువు ద్రావన్ బొలునే వల్లనన్
వినగా మాటల మ్రాకులం బేటికి నన్వేధించి తారీయుఁడున్
జన నీయబ్బకు జెప్పి కొమ్మనుచు నన్ జాడించి పీడెన్ గడున్ 304

శా. ఆ మాటల్విని భానుసూనుఁడనియెన్ హాలిన్ హనూమన్ముఖుల్
హేమాహేములు కొల్ల సాధకులు వారే యేమునుల్సేసినన్
మోమోడున్నద నాకు నేమియున నామోదించితిన్ దత్కృతిన్
సేమం బేము వినంగ గోరితిమి వాసిన్ వారిని పంపుమాయనన్ 305

ఉ. అనుటయు నాతడేగవడి నప్పుడు లక్ష్మణుదర్కసూనుతో
మనవుడిదేల వచ్చిన నభామజుడప్పుడు వాని కిట్లనెన్
మనుజవ దక్షిణంబునకు మానుగవేగిన మర్క టాధిపుల్
వనమును బాడు చేసిరని వార్తను జెప్పగ వచ్చి నాడనెన్ 306

మ. హనుమంతుండెటకేగిన న్సకాల కార్యంబుల్ వడిన్ సిద్ధియౌ
నమామానం బొకయించుకేనియును లేదాతండె లంకాపురం
బునకుం బోయి ధరాసుతంగని మహామోదంబుతో రాముచు
ద్రమ వాదేవి కొసంగి యామెకడ రత్నంబందుఁడామారుగన్ 307

ఉ. అని యిటులాడు చుండఁగనె యంగద ముఖ్యులు దక్షిణాశకే
గినకపి వీరులార్పుటులఁగ్వ్వుధ కేతలు వేసికొంచును
జనిచని రామలక్ష్మణుల పాదములంబడి వానరాధిపుల్
వసుధవార్తు మానునత వారణ చెప్పిరి సీత సేమమున్ 308

వ. అంత రఘునందనుడు పవనసందనుఁగనుంగొని మనఃప్రియంబుగా నిట్లనియె 309

మ. పనియేమాయెనొ పీరలేగినది తాఁబండయ్యెనో కాయ యా
యెనొ రమ్మెందు పచింపుమన్న హనుమండెంతేని సంతోషి యై
జననాథాగ్రణి కంటి జానకిని గార్శ్యంబందు సాధ్వీమణిన్
మునివృత్తిన్ వనమందశోక వృమ హా మూలంబునందుండగన్ 310

ఉ. మారుతి చేరి వేగమునమస్కృతి పూర్వము రాముగాంచి మీ
మారుతి దీక్షమాని తమమానిని రాఘవరామయంచు వే
మారు తిరంబు మీ స్మరణ మావక తానొక చోన దైత్య భా
మారుతి ఘోర తీక్ష్ణమగు మాటల కోర్చక వేగలంకలోన్ 311

క. ఆ రామరామ యంచును
గారవమున నోరుకాయగాయ నెపుడు లం
కా రామమునఁగ్రసించెడి
నారామయుఁబ్రతి పదధ్యయను విద్యవలెన్ 312

సీ. అఘవంశ దమని రఘువంశధవకీర్తి
నమ్మి సేసితి, సతి నమ్మి నమచు,
నమచు హెచ్చరికతోఁగమను హెచ్చుగ నమ్మ
నమ్మల మిమ్మదా ననియె నచ్చి
నచ్చింత లేకుండన చ్చింత దిగద్రావి
యేకత మీవురా నేకతమని
తన నిజస్థితి యంత, మనజోక్తి నింత
బల్కి బల్కి, నికరమొల్కి నామె
నామెతగ నామె, తగమంగ్రమంది చేతఁ
జేతనము నందు నముద్దీర్ణ భీతి నీడి
బొందియటంబొందిటగ నమ్మ బొందగ నేపుడు
పుడమి వరమణి తలమండి పుణిత రమణి 313

చ. తమ దేవింబొడగంటి రామ యొక చెంతన్లంకలో శింశుపా
ద్రుమ మూలంబునఁగూరుచుండి తనపై ద్రోహంబెదో, దొర్లిన
ట్ల మితాఘంబొనరించినట్లు మదిలో హారామశ్రీరామ యం
చమర వ్మిమ్ము నెనంస్మరించుచును గాఢార్తింబడ న్వింతగన్ 314

ఉ. రావణునిన్వధించి రఘురాముడు నన్ గొని పోవునట్లుగాఁ
బావని, చెప్పుమంచు పతివత్ని విశాల్పడి యేమి సెప్పుదున్
గావలుడా దశనుడు గన్నులఁగానఁడు క్రిందు మీఁదునున్
హా వడి నేమిసేయునో మహాపద దేవికి నాతఁడెంతయున్ 315

చ. అనవిని రాఘవుండు పవనాత్మజుఁగన్గొని యాంజనేయ నా
మనము నలంత వాయ ననుమానము తీరఁగ సీత సేమమున్
గనుగొని వచ్చి తెల్పితుపకారికిఁ బ్రత్యుపకారమేమి నీ
కొనరుతునంచు వానవరోత్తముఁ జేరిచె నిండు కౌగిటన్ 316

వ. అంత శ్రీరామ చంద్రుండు వానరేంద్రుండగు సుగ్రీవు నవలోకించి యిట్లనియె
317

మ. హనుమానాత్మజుఁడర్కజా మనకు నాపద్బాంధవుండియ్యెడన్
స్తవనీయంబు మహోపకారము ప్రయాసంబోయి యాదేవికై
యవుగాముల్గని వచ్చి సందియము వాయం జెప్పె నేమిచ్చినన్
లవలేశంబు ఋణంబుదీఱునొకొ నిర్లక్ష్యంబుగా వైరిపై
కి వడింబోవఁగ న్వద్ధమైనవల సత్కృత్యంబు సేయింపుమీ 318

చ. అఱమఱలేక రాముఁడటులానతి యీయఁగ భానుసూతి మా
వఱకు వినోద మాటలు వల్లెయటంచతఁడేమి చెప్పెనో
బిఱబిఱ బారులైకపులు బీరములాడుచుఁగన్నుమూసి కన్
దెఱచెడు నంతలో బయలుదేఱిరి రాముని పాలికోలిగన్ 319

కపిసైన్యంబులు దైన్యతందునకడం గల్బాయితంబొమరాఁ
గ్రనలో రాముండు భానుసూతిగని యాకేంద్ర పీవలన్

విపులాంభోనిధి తీరముందరి గావింపందగు న్వేగమే
చపలాత్ముండగు దానవాధము వధింపంబోవు పైనంబు మైన్ 320

ఉ నుడివిన రామవాక్యములు నోటును వెల్వడి రామున్నై బల్
వడి రవిసూతి వల్లెయన వానర సేనలు నొక్క పెట్టునన్
విడి కపిరాజ ప్రోలు దధివేలకు గోల లొనర్చి కాంచు సం
దడి దరిసెన్ రఘూద్వహులు తద్గతి కచ్చెరు వంది కన్గొనన్ 321

చ అయినను కేశసేనగని యర్కకులాధిపుఁడర్కసూతి తోఁ
బయిగితి నిల్వనెన్నఁఖుఁడ పౌజుల నౌజుల గొంచు నీటఁడి
వ్వఁటను దపాన భూములు విషప్రతి వష విదూషితంబ వం
కటములు గాకయుండ మునుగాఁపానరింపగ నేఁగఁగాదగున్ 322

వ అని మఱియు నిట్లనియె 323

ఉ నీటఁడు ముందటంజనఁగ నిల్చిన సేన మదంతి కంబునన్
హాళిఁజనందగున్మముల నన్నను దమ్ముని నాంజనేయుఁడున్
దూలక యంగదుండు గొని తోడ్కొని పోవలయున్నవంబునన్
లీలగ వాహనమ్ములవతెంజెలినావుడు నట్లే సేయుడున్ 324

ఉ. అంజనసూను,డంగదుడు నర్కజువాజ్ఞను రాములక్ష్మణున్
బ్రాంజలులై విజాంపశిఖరాగ్రములందు వహించి మింటమున్
సంజనితప్రహర్ష జవసత్వములంది నిమేషమాత్రలో
నం జవిరెల్లరంగడచి నచ్చిన బంట్లయి వార్ధివేలకున్ 325

వ ఇట్లు సుగ్రీవుండు సానుజ సుగ్రీవవానరసైన్యుండై లవణోదధి యుత్తర తీరంబున విడిసియుండ నావలి యొడ్డున లంకలోన శంకరవర దుర్విదగ్ధుండైన దశకంధరుండు పేరోలగంబున దండి తారాతి మండలుడైయుండ ప్రహస్తాది దండనాయకులును నాగాయుత ప్రాణులై బహుఃప్రాణవములవదగిన యమాత్యులును మ్రోల గూర్చుండి వినీతిని సీతను నీడి యామినతియగు రామునకిడుమని నహేతుకంబుగా నుడివిన వామదులెల్ల దశవదనుండు పెడచెవినిడి యిఁక మీఁరనెవండేని నామదికి పరివడని యిట్టి నుడులు

నొడివిన వినను సరేకదా బెడిదంబగునదివంబు పెటికి యుటికి తలవరికెద
వని బెదరించిన వారలెద్దియుం జెప్పనేరక యామోటకుననారక చెప్పి యుప్పగిది
ముప్పును దెచ్చి కోనేల దద్దిచ్చి తర్జనము గొని తెప్పుకొనిన యుల్లతవితో
నేలయని బుద్ధి బుద్ధి యని నోరంజెయి చేరిచికొని యూరకున్నంత
వినయభాషణుండగు విభీషణుండు నయంభొవసవంబు మిన్నగ
నన్నకుఁగొండొక తలఁపి చెప్పిన నొప్పుకొనుఁదప్పొప్పరయుక తప్పనేని తప్పక
తఁడు ముప్పుఁ జెందునని తమ్ముండెన్ని తేటంగుల మంచి చెప్పినఁ జప్పరించి
దెప్పరంబుగ నొప్పకున్న నన్నకు ఇంకొకసారి మంచి వినుపించువాడై యుల్లనిట్లు
326

మేలయుంగఁజెప్పెదను మేకొని చేకొను నాదు విన్నప
మ్మేలరయున్న సీతమనయింటను రామునకామెనిచ్చి మ
మ్మేలర యంచు మంచిని వచింప విభీషణుఁడన్న యొప్పకా
యేలరయట్లు నాకని విహీనుఁడు దమ్ముని దాఁచె నీచతన్ 327

అప్పుడు కొందఱు మంత్రులు మెప్పులు సెప్పు వారలై రావణున కిట్లనిరి
328

మెకముల తేవి యుల్లరిగి మించి హరించితివీవు సీత నా
పికి నటులేమి సేసితివా సేసితి నన్న సెబాసుగాక యీ
వికట మనోవ్యథంబడుట వీరిడి ధోరణి గాదె నాథ హా
మికఁదలఁటాయి చేపికొని మేన దృశన్విడకుండు మెన్నిటన్ 329

అట్లుమంత్రులు తనకు వ్యతిరేకంబుగాఁ బలుకుటయు విభీషణుడు
రోషభీషణంబులతో దానట మండఁదగదని రాముపాలికిఁబోవం దలంచి
330

తాచిన లేచి మంత్రులు తామవిభీషణుఁడన్న బాసి యెం
తాచిన వాఁగ లేగి వినయమ్మున రాముని గాంచి పేద ముఙ్
దాచిన బొక్కినంబుగని తారి నటు శ్శరణంబు నట్లుగా
దాచిన తమ్ముఁడీతఁడభియాతికి నాశభయంబిడుండు నాన్ 331

దానవుని దీనవాక్కులు దశరథియగు దాశరథి యోచించి యార్తజన

శరణ్యుండుగావున రిపుసోదరు నాదరించి యుపలాలించి

332

ఉ. మున్ననసేసి కాతు ననుమానము మాను విభీషుండ యే
మన్న నజేయు రావణుని నారిపి చేయుదు విన్నధీశు ర
మ్మన్న, నఖండభక్తి నతఁడాతని యంఘ్రులపైఁబడంగ రా
మన్న వరాశి కిచ్చె నభయమ్మభయ మ్మిహాముంబరమ్మునున్ 333

ఉ ఆలినిఁదాఁజెలంగొనుమ నగ్రజుఁడిల్వెడలించి నేవధ
న్వాలిని బంటునంపు పవనాత్మజుఁడాడిన రాముఁడోపియ
వ్వాలిని గూల్చి తత్పదవి వానికి నిచ్చె విభీషణుండు నున్
వాలి నిజాగ్రజాతుఁడడవిన్ శరణన్నగుగాచెఁదప్పకో 334

ఉ. దాశరథీశుఁడట్లతని దగ్గఱదీయ విభీషణుండు వే
దాశరథీశ నా కితరమగ్రజు నొంపుటకంటెఁ బూన రా
దా శరధీశుఁగట్ట నిఁకదాపనికీ తడవేల వేలగా
దా శరధీశరారులనయంబున లోబడఁజేయ నావుడున్ 335

వ. అనవిని యినవంశోత్తముండుత్తమోపాయంబునవిరోధివి నిరోధింప వెరవగు
తెరువరయఁగోరి సుగుణమణిగణ భూషణుండును ద్వేషి భీషణుండు నగు
విభీషణుని నిట్లని మందలించె నెట్లనిన

336

చ. దనుజుల వర్తనమ్ము పురితత్వము రావణుశక్తి యుక్తులున్
దనుజుల వృద్ధి బుద్ధి బలదర్పము మంత్రుల నేర్పు నోర్పునం
దనుజుల వర్తనమ్ము వినయమ్ము నయమ్మును జేయు చేష్టలే
దనుజులునైన మార్గమున దాఁచక లోఁచక తెల్పు మీ యనన్ 337

వ. విని విభీషణుండిట్లని భాషించె 338

చ. దశవదనుండు దుర్మదుఁడు దామనుడున్ బహుపాపపూరు దుర్
దశ పీడనన్ శయించుఁబెరతమ్ముఁడధర్ముడు కుంభకర్ణు డా

దశవద నాత్మజుండు వరదర్పితుఁడర్పిత శస్త్ర శాస్త్ర ప
ద్దశవద చక్రవర్తి బహుదక్షుఁడు నంతటి చెయ్యి లేఁడెటన్ 339

లంకకు మూలకంద మతి లాఘవు డింద్రజితుండు దుష్టుడున్
లంకకుకూల మింద్రుని కిలావగు శత్రువు పెద్ద మంత్రియా
లంకవినాశకుండు నలలాతుల హేతులభంజకుండుపో
లంకకురార మారయుత్రహస్తుడు విస్తులు లంకకాడిటన్ 340

దక్షులు రాక్షసాధిపులు దారులు ధీరులు కోటి కోట్లు ధూ
మ్రాక్ష నికుంభకుంభులు సురాంత నరాంతక సారణు ల్విరూ
పాక్ష శుకాతికాయ మకరాక్ష విజిహ్మ సుమాలి మాలి యూ
పాక్షులు జంబుమాలియు సహాపులకంపన ముఖ్యులప్పురిన్ 341

ఇందరు నొక్కి యెత్తరయ నింద్రజితుండొకయెత్తు వానితో
నిందరు నాజి మార్కొనఁగ నేమనినన్ బదునాలుగేండ్లు వా
యిందరుణీ సుఖంబు నిదురెంతయు దాంతిని గట్టిపెట్టనే
నిం దరుమంగలండతని నేరఁడెవండి తరుండు మార్కొనన్ 342

రజని చరేంద్రు మాటవిని రాముఁడు వింతిల ఁదమ్ముఁడట్టి లే
రజ నియతుండు గాదె కనుఁడా శరసాలమునా శరాగ్నిఁబో
రజ నితకోప వహ్నిని గరంచెద నీవదునాలుగేండ్లు నీ
రజ విభవేత్ర భుక్తి నిదురల్ వలి సౌఖ్యమెఱుంగ వావుడున్ 343

అనుజాని మాటకు రఘువరుఁ
డనుజానిఁగని వంతసమున నటులేనిఁక ని
వ్వనుజాని బెడ దనుజా దశా
నను జంపుట వాదు పాలువకు బెట్టుమనెన్ 344

అంత విభీషణ సుగ్రీవులు జ్వలిత భూషణగ్రీవులై రామ భూభుజునకు గుడియెడమ భుజముల వడువునఁగొడ తోడు నీడవై నిడక కపి దళములు తడవు లేకుండ జలనిధి పైన వడిచి కెంకులేక యకలంకమతి లంకపై విడియ వెరువరయుచు సేతు బంధమ్ము కరమ్ము శేమంకరమ్మని స్థిరంబొనరించకొని

దృఢాధ్యవసాయులై సముద్రుం గూర్చి తనకు మార్గమిమ్మని ప్రార్థింప దర్భశయనుడై యున్న శ్రీరాముంగని నతి పూర్వకంబుగా నానతిగైకొని లంకపైకి లగ్గలు పట్టుఁడని దగు తెఱఁగు ప్లవగ యూథనాథులకు సాధక బోధకంబులు బోధించి సముద్రోపదిష్ట మార్గంబున నలుని సేతు బంధనమునకు నియోగించిన

345

సీ బలి ముఖబలము ప్రబలి నఖముఖములఁ
  ఎలు శైలములు వలములను దెచ్చి
యలవిగానివి యన్ని యలబలంబులు మోసి
  కొని వచ్చియు దధిలోఁగ్రోల వేయ
నలుడందుకొని చేతఁజలువుగా సేతువు
  పరుసగా వారిధి బెరసి కట్టెఁ
బది యోజనంబుల పరువును శతయోజ
  నమ్ముల పొడవు కాల్నడ యొనర్చి
సంతరించిన ఁగపులెల్ల సంతరించి
సేతువున కెక్కి నడచిరి క్షేమగతిని
నలుని పనితనమునకును నవిన బంధు
కుల నృపాలుఁడు మదిలోన నలరుచుండె 346

వ సేతు నిర్మాణంబునం గోతులందుపైఁ గాల్నడను లంక కెక్కి వచ్చి చేరఁబాఱుటయుంగని లంకదనుజులు కొందఱు కెందల ముందుమ బరస్పర సంభాషణలకు దిగి యిట్లనిరి

347

క మున్నెన్నడు నెవ్వారలు
గన్నది విన్నదియుఁగాని కాలగతి యిటుల్
మున్నల్లఁబాలు దేలుట
చెన్నలరఁగఁగపులు పనులు సేయుట లరయన్ 348

ఉ దానను బట్టి చూచినను ధర్మవు బుద్ధిని దానవేంద్రుడున్
నానికిఁజిన్నపెద్ద లిటువల్లని యెంతయు బుద్ధి సెప్పినన్

పీనులఁబెట్ట కాములున వేట్టిగ జానకి ముచ్చిలించి తాఁ
బూనికఁదెచ్చె నాఫలము పొవునె మిన్నక మ్రింగ కాతనిన్ 349

వ. ఇట్లు పలుజనులు పలువిధములగు నాడి పోతలకు దిగి కావలుఁడగు రావణునికి గావలసిన పనికాక మానునా పీనికి బ్రాణహానియు మానహానియు తోడవె కానున్నదని దీవెన బెట్టినట్లు బెట్టిదముగా ముంగలగానె యమంగళ వాక్యములు బెట్టి యాఁనాడు నాడుకొని తరిఁదరు చరులు తఱుచుగ రేఁగి

350

లయగ్రాహి

లగ్గలకు నెక్కి కపులగ్గలిక లెచ్చఁజని
డగ్గరుచు లంకిణిని బెగడిలఁజేయన్
మ్రొగ్గిపడె మేడలును మొగ్గతిలె గోడలును
నెగ్గదిఁకలంక యని నిగావడ దైత్యుల్
వెగ్గలపుఁగోపమున నగ్గివలె రావణుడు
బగ్గుమని మండిపడి ప్రెగ్గడల తోడన్
మొగ్గరములో రిపుల లగ్గము లొనర్చదను
బగ్గముల పెట్టనుముఁబగ్గెలను గొట్టెన్ 351

లయవిభాతి

దనుజ వరుఁడిట్లులని దనుజులఁదనూజులను
మొనలఁగొని మీరుచని మొనసి రిపు సేనన్
వనచరులు ద్రెల్లఁగస వనచరు భుజాల్సురఁగ
బెనఁకువను బాఱిచనఁబెనగుఁడరితోనా
యినకుల నృపాత్మజుడు మనకును విధేయుఁడయి
జనకజను నాకువిడిచనుఁదవకుఁదానే
వనమునకుఁగావ మరిమనకగు జయమ్మనుచు
మనపురిని జాఁటుఁడిక నని మురియు చుండన్ 352

వ. పురమున కాదరయ్యెనని బొరుకలంగ దశాస్యుఁడేగి గో
పురమనెక్కి తోరపు రిపుం గనిసేనఁగపీంద్రు జూడఁదీ

పురమున దాపరించెనని మూపులపైఁబడదూకి తాఁకి కా
పురమున కాశపీడ రవిపుత్రుడు మూర్ఛిలఁజేసె రావణున్ 353

చ. వెడుకక వెన్కముందు తొలిద్రేటున రావణు పాముజంపి లా
వెదుకరకంగ మోది ప్లవగేంద్రుడురామని రాముడంత న
వ్వెదఁగదురంగ నిల్లనియె నింతటి సాహసమేలొనర్చి తీ
వెదకద మాకు సోకెడరొకింతయు వాటిల విందునేమగున్ 354

క అనవిని సుగ్రీవుఁడు నా
యన వినియోగంబుగలదె యదనొదవఁగఁదా
యన వినయు విడిన నని యా
యనవిని హతుజేయుబుద్ధి నరిగితి నరిపై 355

ఉ ఏది యెట్టైన నీదయయె యెందనకు న్రఘురామద్రోహిచో
వేది యెదిర్చి కంటఁబడ నేమను మీవని తాపహారి నో
ర్వేదియ వానిపైఁబడ నేగితి నేగతినైఁబూన్కి నే
నేదియ పచ్చితిం బలవకిచ్చితిఁ జచ్చెడు పాటి వేట 356

క. దశవదనుఁడేటు పడి దు
ర్దశ పదనము లెండఁ జావుదప్పి యటకు మీఁ
దశవదకుంజెనె లోనికి
దశవ దశకుఁడని కపులు దవ్వుల నవ్వన్ 357

ప. మఱియు దశగ్రీవుండు సుగ్రీవుగుఱించి తనమునంబున 358

ఉ. ఇట్టై యెరుంగనట్లు ప్లవగేశ్వరుఁడెంతలు సేసి పోయెను
న్నట్టులె యుండి గోపురము నంది చివాలున వాలిపైకి నన్
బట్టియు నెట్టి నాదుపరివారములొఁదల లెత్తరాని సి
గ్గట్టి పడంగఁజేసె యట మాడవి బాడె మఱెంత వాఁడొకో 359

చ. అనితర సాశనేశుడు ప్రహస్తుని బిల్వఁగఁబంచి మంత్రి సీ
యవితరసాధ్యసాధన సహాయత చే నవలీల గెల్చి నాఁ

దనితర పొంగ వైరులను నవ్వెరు వానరవానరాళి నా
కనితర సొంపరాయికుఁడన్వర్గగతిన్మతిఁబాంచి చేయుమీ 360

చ అనవిని పంక్తి కంఠుని బ్రహస్తుడుగన్గొని యిట్లువల్కె నా
యన వినిపింపనైనతఱి నావ్వుడు సెప్పవలెన్ హితంబు నా
యన వినిమంచిగైకొనుట యర్థమగర్థము భూమిపుత్త్రియ పొ
యున విని వృత్తుగా దశరథాత్మజుఁజేయుట నాయమీయెడన్ 361

చ అవనిజ లోకమాత వినుమచ్యుతు డారఘురామమూర్తి యా
యవనిని గావఁబుట్టిరిపుడామెను రాముని కిమ్ముటంచు దా
నవ చెవినిల్లుగట్టుకొని నాఁడటు సెప్పితి వేమి సార్థక
మ్మవమతి సాధు తావ మెనుహోని కులక్షయ మంచెఱుంగవే 362

క దనుజాధిప వేయేటికిఁ
దనుఁజంపికొనంగ మందధుముఁడుందిను నే
దనుజావళి ఁదనుజావళి
దను మనుచులెఱింగికనైన ధరణిజ విడువే 363

గీ అట్లుగాదన్న నీకు జయంబుగల్గఁ
బోదు రాబోదు మంచి కాబోదు సంధి
నాదు బోదును జోరఁబోదు నాదు వోదు
గానపెలవిడుమని కొండె గానకొండె 364

వ అని యివ్విధంబున నింకం చెప్పంగల ప్రెగ్గడలందఱు ఁజెప్పఁగల నీతులు
దఱుచు ఁగఁదగ్గని యగ్గలి కందఱుమి చెప్పి చెప్పియు నెకసంబుగఁజెప్పిన విని
లోకవిద్రావ ణుండగు రావణుండు కొండొకసేపు మిన్నువిఱిగి కన్ను పైఁగూలి
నట్లుల నోరాడక మిన్నకుండె ఁగోపంబు దీపింప నెయియిడిన యగ్గివలె
భగ్గున మండి ఁప్రెగ్గడల తోఁగట్టకడకు గడంక తో నిట్లనియె
365

రామన్నది రాకుండునె
పాపీయము నారికేళఫలమందు వలెన్

బోనున్నది పోకుండువె
దాని భుజించిన సున్మధ ఫలమున వలెన్ 366

ఉ. కోతియుఁగొండముచ్చ మరకోటికిఁ గోటికి పొటి వచ్చునే
గోఁతిని సీతఁగ్రొవ్వి వెఱఁగొంటివి దింటివి దత్తలంబు చే
సేతుల ఘాతఁదెచ్చుకొని పీడల ముచ్చట వంతకేమగున్
వ్రాతఫలంబు వాకిటుల రాఁగను వేసుకొన్న వేమగున్. 367

చ ఎఱుగుదు సీతమాత జగదేకవహుండు రఘూద్వహుండు
నా కొలకవతారమెత్తి ననుగూరిచి యుల్లరు దెంచివారు పీ
రెఱవిఁక జేయనేల యనికేగి పబంధుత బంధురంబుగా
నొఱఁగెద రాము శస్త్రముల నోటమి యేటికి ముక్తిచే కుఱన్ 368

వ. అనుచుండ నిక్కడ నవ్వేల సువేల కొమ్మునఁ గొమ్మ మెకమ్ముల ఱేడగు సుగ్రీవుండు లోనుగాఁగల నఖముఖాయుధులు నఖముఖాలఁజేరి కొల్వ శుభలక్షణుండగు లక్ష్మణుని తో సంతోష సహితులగు హితులతో శ్రీరామ చంద్రుడు మంతనంబుండి రాయబారమ్ముగనుఁగొన రాయ బారమ్ము పంపుట మేలంచు నెంచి 369

ఉ. వాలి తనూజుఁబిల్చి వతి వత్స రశావను పాలికే విదే
వాలితనూజ మిత్రపరివారము తోఁబడ కిమ్ము సీత నీ
వాలి తనూజ వేఱుతెఱగైనను నిక్కము ధాత్రి నుండబో
వాలి తనూజులం బిలిచి యవ్వను జవ్వను జెప్పు కొమ్మికన్ 370

వ. అనితెల్పి తద్బుద్ధతంబు దెలిసికొని రమ్మని కృత్యంబు గరవుటయు 371

ఉ. అంగదుఁడా నరేంద్రు సెలవేఁదల నూఁదుచు లేచి తూఁది యొ
క్కింగ దురావరావణ సంభాంగణము న్జగఁజేరి యోరి వే
నంగదుఁడ న్మతిందలఁవు మంబుధులం బడముంచి యెత్తిని
వ్వంగదవెట్టి పీడ్కొలిపి నాయన వాయునాకుఁగావలెన్ 372

ఉ. వాలి తనూజుఁడ ద్వినుము వప్పితి నీకిట బుద్ధి సెప్పఁగా
వాలి తనూజ మిత్ర పరివారముఁజంపక యిమ్ము సీత నే
వాలి తనూజ నొందు తెరువైనను, రాముడు ప్రమంచు నిన్ను నీ
వాలితనూజులవ్వతుల నందఱ నిప్పుడ చూచి కొమ్మిగన్ 373

వ అనిన దశాననుండదరి యొడుల దొడల దీడి కొంచు న
న్నవియెడు పాటి వాఁడవె మృగాధమ యన్న దిగీశులేమి లె
క్కనినను వానరుల్వరులు నక్కట లెక్కట రోరి యింక నే
మనిన మనంగ నీను నిను నప్పుడు వచ్చిన వానరుంబలెన్ 374

క ఆమాటల్విని యంగదుఁ
డేమీ యెట్లెట్లులంటి వెఱుఁగ నొకో నీ
వా మారుతి సేసిన పని
యా మారఁగఁదలంచు మించుకంతయు మదిలోన్ 375

మత్తకోకిల

ఉండ విల్లును బండ మంచము నుండకుండ నొసర్చి నీ
కండ నుండెడి మూలరాణువ నర్ధసేనకు హెచ్చుగాఁ
జెండిపోయె సమీరసూనుడు సెప్పనేటికి రావణా,
చండమూర్తివి శిష్టకార్యము చక్కఁబెట్టెద నేనునన్ 376

మ దశకంఠుండతి రౌద్రమెత్తి కనుడు నైతుల్యవ్వడింగ్రమ్మి ద్వా
దశ సాహస్రము పైఁబడంగ దివికి న్గట్టించె తారేయుఁడున్
దశ నాంఘ్రిద్వయ హస్త వాలధుల చేత న్వారలంద్రుంచి దు
ర్దశఁద త్సాధముఁగూలఁదన్ని తమ స్కంధావారముంజేరుడున్ 377

వ హర్యక్ష సదృక్షులగు హర్యక్ష సైన్యనాథులెల్లఁబొదివి దివినుండి క్రిందికి దిగి పందడిగాకుండ శ్రీరామ చంద్రునకుముందు భక్తి మదిలొక్క మ్రొక్కి యొక్క యెడ వెడ గలుగ విలుచున్న ధృత కనకాంగదుం డంగదునిగని వాయుసూనుండోయీ తారేయా నీవు పోయిన పని యేమాయెనో పరగ నెరింగింపుమన నతండు తనకును దశవదను నకును జరిగిన తెఱగంతయు

దూవా దిగఁబడకుండ నఱటి పండొలిచి యఱచేత నిడినట్లు తెలియబల్కిన
గపులందరు విపుల గోపంబున లేచి లంకకేఁచి సందుల గొందుల దిగి సొట్లు
సాధించికంటబడిన నరక్కసుల నంటఁబట్టి కొట్టి కోలాహలంబుగ
హోలహోలంబువలె మైకమెక్కించి వేధించి బాధించుచు లంకముట్టడించి
కట్టేఁడి దానవులం బట్టి మట్టి పీటిమట్టి మల్లాడుచువెల్ల వీధుల యందు
నెటఁజూచి నఁదామయ్యై పురియెల్ల నల్లోలకల్లోలంబుగా నల్లకల్లోలంబొన
రించుచుండ నదివిని దివిజరిపు చక్రవర్తి సమువర్తి రౌద్రంబెత్తి యరులశల్యంబుల
రాల్చి రమ్మని తన బలమ్ములకు బలమ్ముగ ముదరి యిడి పంపిన రక్కసులు
కక్కసింపుచు దాయులజంపుద మెుండెఁజత్తె మెుండె నింతియుకాని
యినుమంతయు నూరక మఱల నూరికి మఱలమని గట్టిగ నొట్టు వెట్టికొని
పంతివాలిన పతినలు వట్టువంఁబొలికల నికఁబలుపో కలఁబోయి
మెుట్టమెుదల మెుదల కుండ నైరుల నొప్పించియుఁగట్టకడకుఁదామె
నరవానరులచే వారెవారక పాఱక రక్కసు లొక్కొక్కరుగఁదక్కుచుఁ దాఱుచు
వేగి నిక్కముగ నొక్కరుండేని బీరము వొకుండ నందఱు దరుచర వీరులచే
హతులై మఱల లంకాపురికి రానోచుకొనక లేచిపోయిన వాఁడు పోయినట్లదే
పొకగ విరగడయ్యె పోవుచుఁదరిగి నానా టికి రావణురాణువ నిదాఘ
నదీజలంబుల పోణిమి నను కరించి వాసిఁదప్పగాసి వడివడిగఁదీసి కట్టునకు
వచ్చి యణంగఁదొణంగె నందుఁదలగల యాశరవీరులందఱు నందు ౘ దరు
చరవీరుల చేఁగడ తీఱిన తీఱు నిమ మని యిట్లనియె 378

మ. హనుమంతుండు నికుంభు జృంభమణగన్ హంవీరు దేవాంతకున్
హనుమానత్రిశిరుందలల్బగుల ధూమ్రాక్షు వైగన్వికమున్
హమవింతింతలుగా నకంపనుని యాహోమెుత్తి వాహోరివా
హనుసద్మమ్ము వెసం జొరంబని చెదాన ద్రీంద్రు దంష్ట్రాంప్రులన్ 379

ఉ. అంగదుఁడాజిఁగంపమని నంత నరాంతక వజ్రదంష్ట్రులన్
రంగదభంగ శౌర్యమున రాచి మహోదర పూర్వ పార్శ్వ వా
రంగదునంగదట్ట మెదయుంగ నెఱుంగొక యుండఁబట్టి పో
రంగదలూఁడలాగికొని రాల్చి తలల్పడ దుల్చెనల్పురన్ 380

క. అంత బ్రహస్త మహోదరు
నంతక పాశాభవాల హస్తము వెడగున్
హంతకుడై తెగఁజుట్టియు
నంతకపురి కనిచెవ్రాలుఁడాజిని నాజిన్ 381

చ. గొదగొని తామహోద్ధతి నికుంభుని కుంభు విరూపనేత్రు బా
గొదవఁగ భానుసూనుఁడనిసొక్కనిఁ బోఁకకుఁజుట్టి యొక్కనిన్
గొదవడిఁగైకమర్చికొని కుమ్మరి సారెను ద్రిప్పినట్టు వే
గుదురిదె కాలుఁబ్రోలి కని కేకలు వెట్టుచుఁగొట్టె నేలకున్ 382

వ. ఇట్లు దండి మగలగు ప్రహస్తప్రముఖరక్షో వీరులులక్షోప లక్షల నను
సమరంబునఁ గసి నుసంగి పాసఁగఁగపాసిహర్యక్షవీరులతోఁచెనంగి సమసిరని
విని దనుజేంద్రుండు సమంద్ర భీతి నొంది యత్యంత నిద్రాసక్తుండగు
తనయును జన్మఁగుంభకర్ణుని నిద్దుర నుండి మేల్కొలుప దలంచి
యనుచరులంగని

383

ఉ. ఇద్దురవస్థ యింరగుట యేమెఱుఁగండికఁగుంభకర్ణునిన్
నిద్దుర లేపుఁడింత నిద్రుత రాజన లేపె రాతనిన్
నిద్దుర కండ్ల లేచి తలనింగికి నంట నిదేటి భూతమం
చిద్దఱు రాకుమారులవ నేగెను గోతులు భీతి జెందగన్ 384

ఉ. అన్నను గాంచి పోవుతటినాజికి దేటికి సీతనుంచి నా
వన్న సులిన్నతిం బతికి నప్పనసేయుట పాడి యంచ తం
డన్నను నన్ను నన్నవలెనన్న ప్రయోజనమేమి తమ్ముడా
యన్నను దమ్ము రాఘవుల నార్పు మటోరువమేని కూర్మిమా 385

వ. అవి యట్లన్న యన్నకు మన్ననతో నను జన్మండిట్లనియె 386

మ. పరమార్థంబని తెల్పినాఁడను సుమీ పౌలస్త్యమౌళి కాదాజికేఁ
బరమాప్తి యటుగాదు కూడదనిన బ్రహ్మాదులున్నాకు వో

ఆ.వె. వరుసఁ గలి యుగాది వత్సరమ్ము ప్రమాది
దివికిఁ గృష్ణుఁ దరుగు దినముఁ జూడఁ
బరఁగఁ శుద్ధపాద్యమి యయ్యె నం
దునకిఁ బుట్టు దొట్టు గణన యిడుము 142

వ. అట్లు లెక్కింప శ్రీకృష్ణావతారా కామసరంబుఁ దొట్టి నూట యిర్వదియై దబ్దంబు లేడుమాసంబు లష్టదినసం బులె తన నిర్యాణ కాలమ్మునకు సరిగ సరిపోవును గావున నింతకంటెవేఱు ద్వధాధ్యవసాయమ్ముగవ్యవసాయమ్మొద్దియు లేదుగావ నిదియె రూఢియని యెరుంగునది

143

క. శ్రీకృష్ణుండొనరించిన
ప్రాకట కార్యములలోనఁ బముఖము ను
మ్మా కౌరవులను వారిఁ గొ
శ్రీకరముగఁ గట్టి పెట్టె సిరి పార్థులకున్ 144

వ. ఇంకను యదుపుంగవుండు నొనరించిన ప్రాచీన బృద్ధిర్ముఖర్ధిర్ముఖ గణ పరిగణనీయాని దర్మ కార్యనులు వాచావు గోచరములై యుండు నాపన్న శరణ్యుఁడగువాని కల్యాణగుణముల నన్నింట నెన్న నాపన్నగేంద్రునకుంగాని నన్నుబుట్టించిన బ్రహ్మదేవునకుంగాని గూడ యలవిగానిచో నేనెంత వాఁడ ననుచుఁ గధ వినుమ వైశంపాయనుండు తన తాత ముత్తాతల కథలనువదింప విని జనమేజయుండు సర్వత్రాతయగు యదునేత భారతరాజులకు భారత రాజియందు ఁబ్రవేశించి యపార కృపారసంబు మీఱఁ గొంతేయుల కేలకేలూఁత యీవలసి వచ్చె వచ్చెఁబో యాజగన్నాటక సూత్రదారుండేల కౌరవులనెలఁగలపి నారిజ్ఞాతులు నగు పంచపాండవులను వారి నేలగెలిపించె నారిధిపరీత భూతలంబునంగల రాజులనేల యాఘోరతరాజిఁ మడియంజేసి వారలేలు నేల యంతయు గడించి యుధిష్ఠిరుచే నేల యేలించె ననహాయ శూరులజేయులు నగు పాండవేయులకు శ్రీకృష్ణుఁడేల సహాయపడ వలసి వచ్చె వచ్చెఁబోఁ బొచ్చములేని పెచ్చెలిగ మధ్యమ పాండవుఁ గటాక్షించి కంటికి ఱెప్పవలెఁగాచి రక్షించె అది యహావహాలాగ్రంబుగా దయంద్రైవాఱ వినిపింపవేయని యడుగుటయు 145

కుసుమ విచిత్ర వృత్తము

అనువ్రతరాధా యపహృత బాధా
వినమిత వేధా యధిక్షిత బోధా
వినమిత వేధా వినిహత మోధా
మునిసుతగాధా ముదిత విరాధా 146

గద్య

ఇది శ్రీనాథ యామునావతార పవిత్ర శరమర్షణ గోత్ర బుక్కపట్టణకుల కలశాంబుధి రాకాసుధాకర విద్యానగర సంస్థాన సముపార్జితానేకాగ్రహార బిరుదాంచిత కర్ణాట రాజాచార్య శ్రీవేంకటాచార్య పౌత్ర శ్రీనివాస తాతాచార్యపుత్ర స్వీయ మేధాసమాసాదిత రాజకీయ హూణ భాషా పాండితీ మండిత అష్టావధాన కరణ చణ శిష్టజనహిత వైయాకరణ పండిత రాఘవాచార్య ప్రణీతంబైన కువలాశ్వవిజయంబునందు

# తృతీయాశ్వాసము సంపూర్ణము

శ్రీ

# కువలాశ్వ విజయము

# బుక్కపట్టణ రాఘవాచార్య ప్రణీతము

## చతుర్థాశ్వాసము

శ్రీరుక్మిణీ మనోహర
కారుణ్యాంభోధి శౌరి కౌంతేయ సఖా
నారదగేయ యమేయా
నీరద విభనీలకాయ నిఖిలధ్యేయా 1

వ. దేవా దివ్య చిత్తమున నవధరింపుము అట్లు జనమేజయుండు బలు విడిబులు
గడిగిన విడి ముత్తెమువలె నలవడి వడివడిగిన వైశంపాయనుడు కృష్ణద్వైపాయన
ముని విరచిత సలీలా సుధారసాపార కాసార సకలసారస సపార భారతీ
భారతమతిని మతి తనివిదీర వినుపించి పునీత చేతస్కుఁనొనరించు మనీష
సత్కాల విసీషసీషత్కాల నిమీలితలోచనుండై యఘవిదారక పంచమ వేదంబు
విజజ్ఞాన లోచనమునకు గోచరంబుగావించుకొని యా కథమనోగతంబుగా
గ్రహించి యాతవికి శిష్టవిశిష్ట సంగతులను శ్రీవ్యాసముని రచిత మహా భార
తంబు వలన నెరుంగుమీయని భారతకథ ఇట్లని తెల్పం దొడంగె

2

ఉ. హస్తి పదాది ఘోటక శతాంగ మహాంగ సమృద్ధి మర్దన
ద్విప్తిక సాది సారధి యుతారి ధరాపదురావ సాలమున్
హస్తిన బాధ్య గోపురమువై స్థిరమై స్థిరమొప్పు నెప్పుడున్
హస్తిపురమ్ము హస్తి మశకాంతర మాపురి కన్యప్రోలికిన్ 3

క. శంతనుఁ డాప్రోలేలెను
శంతనుఁ డితఁడనుచుఁ దన్నుజనులు నుతింపన్
శాంత సమాధి గుణమ్ములు
సంతసపడి యుండ నిలిచి సడలక యుండున్ 4

ఉ. శంతను వంటి భూమిపతి జన్మశతంబుల నైన నబ్బు నా
సంతత పుణ్యసత్యవతి జాహ్నవి పత్నులు పుత్రుఁడష్ట ది
క్ప్రాంతనట ద్యశస్కుఁడును, భాగవతాశ్రయ భీష్ముఁడేల నే
లంత సతమ్ము సమ్మవట నంతయు గూడెను మంచి యంతయున్ 5

వ రాజకుల పరివ్రాజరాజగు శంతను మహారాజు గంగ యందు ముంగలగఁ దాఁగనిన తనయుడును దిన్త్రు తనయుఁడును నగు భీష్మునకుఁబెండ్లిసేయఁ గన్నియ నడుగ బోయి యొకబోయ పల్లెయందునందిమున కెందు సరిలేని యొక సుందరిన్ గని దరియంజని అక్కన్నియ మున్నెక్కి తఱియమున్పైఁ దరి గడువుమండఁ బరాశరముని వరుండు మార్గ వశంబున నరుగుచు నట తటస్థపడి యాకన్నెపైఁగన్నిడి కన్నెఱికంబు నెట్టిమన, నద్యోగర్భంబున నునద్య జన తరుణోపాయ కరణ పరాయణుండగు బాదరాయణుఁ దనయుగాను దదాతనయుగాను సరణంబుగ నిర్దుష్ట కన్యకాత్వమును మత్స్య గంధినామ ప్రత్యామ్నాయము యోజనగంధి నామంబుస్థేమంబుగ నాముని వరదానం బడపిన వరావీనగా నెఱింగి యాజనరాలి నాలిగ తాగైకొన నాలిగ రాజు తలంచుడు జ్యేష్ఠ పుత్రుడు భీష్ముండు పెండ్లిమానినన మానిని నిమ్మానవ పతికీత్తునని యామె జనకుండు సెప్పిన నా శంతనుండు మంతనమ్మునఁ బెరుగు పెద్దఱికము వెఱచె నున్నట్టు లామెపై బ్రామిక విడలేకయుఁగొడుకుం బెండిలి కెడఁ బాపఁగడు బాపమనియు నెటులుం బాల్పోక యాలుపై నొకయింత మాలుపై నొకకొంత మనసు బెట్టుకొని బియ్యము మీఁదను నియ్యము మీఁదను నాశయుంచి కొన్నాళ్ళవిలె మఱియాడు చిత్తంబున నత్తల పడుచున్న తండ్రియవస్థం జూచి నవునుగాఁ దెలిసికొని నిలింప వ్రతుండు చలింపని భక్తి నాజన్మవ్రతంబుగ బ్రహ్మచర్యంబు బూనిన నాస్థవిర వ్రవతి యాస్థకొలంది నావెలందిని బెండ్లియాడి యాచేడియ యందు జిత్రాంగద విచిత్రవీర్యులను నిరువుర కొమరుల మరువంటి సౌందర్యశాలులఁగని

తనకుఁగా నైహికసుఖంబుల నుజ్జగించిన నన్నుతుడె ప్రతి బుజ్జగించి స్వప్నంద
మరణమతనికి వరుసుగఁ గరుణించి తరుణవయస్కులగు సత్యవతి సుతుల
తరణోపాయమరసి యా యిద్దఱ బెద్దకుమారుని పౌర్వవర్గమందుంచి
యాష్టపిర రాజ దివికేగిన తదనంతరంబ చిత్రాంగదుఁడ వివాహితుఁడు గా
విచిత్ర వీర్యుఁడు వివాహితుండయ్యు ననపత్యుఁడుగా సంతానవంతుఁడు
గాకయ మున్న తనదేవు లంబాం బాలికలవిడి కాలధర్మము నొందుటయు,
భారత కులాభివృద్ధికి భీష్ముండు జన్మావధి బ్రహ్మచర్యావిధి వ్రతస్థుఁడై
యుండుటఁ దల్లి సత్యవతి వంశవృద్ధిని గూర్చి బుద్ధి సహార్నిశము
తలపోయుచున్నంత 6

ఉ మిత్రజనోత్పలమ్ముల కమిత్ర మహోత్పల రాజికి న్నిజ
చ్ఛత్రము వంద్రుడై వెలుగ శాంతన వార్యుఁడు నేల నేలఁడ
భ్రాతృ విచిత్ర వీర్య నిడు భార్యల శిష్యులఁ గూడి వేద్య-ఁడ
క్షేత్రములందు వ్యాసముని దేవరన్యాయమువం బ్రసూపతిన్ 7

ఉ. బుత్రులగాంచె నిర్వురను మున్నుతర రాష్ట్రుని సంతఁబాండునిన్
నేత్రవిహీనుఁడై యుట జనించెను వారలలోనఁ బెద్ద వ
త్పుత్రుఁడు చిన్నవాఁడకట పాండు తనుండుగ నుద్భవించెఁడ
న్మాతృ కృతాపహారముల మానునె యేరికిఁ బూర్వకర్మముల్ 8

గీ. తల్లిబాధను మౌనిమతల్లి బాధ
రాయణుండెప్పు మాతృపరాయణుండు
కడకు రాదాసి విశి తనకడకు రాగ
గని ప్రసాదించెసుతునీతిఘని విదురుని 9

మ. జనుషాంధుండు వరించెఁ బత్నిగ మహాపాధ్వావ్య గాంధారి నా
వనితా రత్నము మాలుదాల్చి యిటకు న్పాటిల్లమి స్వేచ్ఛనై
జనవంబాపలఁ దోడి కోడలు వనిమ్మల్యారివింగంటఁ దుం
దునుకల్గాఁ బడమోదె గర్భమిల నే దోషంబురాదీనునన్ 10

తన్వీవృత్తము

వ్యాసమునీంద్రుడును స్నానతల వా
యంగను రోతల నిడి తునకల్పో
గేసి శతంబొక్కటిగను సరిగా
నెంతయు నొప్పుల నిడిమెసవంగా
వాసిగ దుర్యోధన ముఖసుతుల
వ్వారిగఁ బుట్టిరి కుజములు నూఱ్వుర్
భాసురరీతిందనయ యొకతయున్
వ్యాసులు వల్కిరి తుదకొక నాకున్ 11

శా వ్యాసర్షీంద్రుడు నాంబికొయువ్వుతో వత్సా! హితం బాడమిన్
మోసంబౌను మయోధనుండు మనిన స్వామిం బ్రజానాశమా
గాసిన్ వీడొకఁడూడ బీడలడఁగుంగావ వ్విదుండంపిటుల్
నాసిందాఁజెని విల్లుగట్టుకొని యావ్యాసుండవన్ రాజనెన్ 12

మ. ముని నాథా వినుకోపగింప కిటు నాముఖ్య స్థిరాంతర్యమున్
జన నాశంబయిన స్వనాశమయిన స్సర్వం బెట్టైపోయినన్
ధనముం గోటిలభింపఁగాక పదియంత ల్పోవుఁగా కేమ నా
తనుజుం జంపఁగ జాలఁగన్న కడుపుందాఁజంపునే పెట్టియున్ 13

ఉ ప్రాకట వాక్ప్రసక్తి ధృతరాష్ట్రుడు నూమని వీడ నంచుఁదా
వాకొన నాని మౌని కవి బ్రహ్మయెటు ల్లిఖియించెవీ తలన్
వేకన మట్టు లేయగుమ వేఱువిధం బెటులౌను మిత్తికిన్
దాకొన దప్పిపోని తలదాఁటిన యవ్వుడయ్యెనఁ గాంచవో 14

వ. అనివ్యాసుండదృశ్యుండగుటయుఁ దదనంతరంబ దుర్యోధన దుశ్శాసన వివింశత్యాది నామధేయులు నూఱ్వురు పుత్రులు దుశ్శలగాని దుస్సల యనునొక పుత్రికయుఁబట్టి ధృత రాష్ట్రునింట దున్నతయంతయు నొకచో గుమిగూడినట్టులా పట్టున పెట్టుకొని పర్తిల్లు చుండిరి మఱియు వారికోఁ గల్యంశము మూఁడు మూర్తులు పూర్తిగాఁబుణికి పుచ్చుకొని పుట్టిన దుర్యోధనుండు చేఁటలోఁబడిన నాఁటఁగోలె నానాఁటికి జగద్ద్రోహియని

యొల్లరు దెల్లమిగ నడుకొని యెడు తెలుంగునఁ దఱుగు విఱుగు లేని వెరికి తనమ్ముగఁ బిలికి తనమ్ము తన మనమ్మున నెన్నుండు నెన్నుండు. మంచి తమ్ముని మాట వానిలోనే నాఁట వెన్నోట నెమకినఁ గానరా దీరీతి నవనిలోకిఁ బుట్టి నిల్లుగా పొథుత్వమను పేరెఱుంగక పెరుగుమండె నింతవట్టు ధృతరాష్ట్రుని గుఱించి తెలిపి యిటువాతని తమ్ముడు పాండు ని గుఱించి వినిందెద నెల్లనిన

15

ఉ. కుంతియు మాద్రియుం దనకుఁ గూర్చెడు పత్నులుగా సపత్నుల
భ్రాంతము శాంతమూర్తులయి సర్వముఁ జెప్పిన యట్లు సేయగ
న్యంతన కెక్కి యస్త్రములు నచ్చిన బంటయి తోడఁ బల్కగా
బంతము గట్టియేలెనిల బంటు పెంపుగఁబాండు డెంతయున్ 16

ఉ. పాండు నృపాలుఁడొండు తఱిఁ బండుగ గాఁ జవిఁ వేఁట కాంద్రలో
గండక పుండరీక హరి కందళి సైరభ విల్లకోలవే
దండ వృకాదులందు విమిదండర మించు కురంగ యుగ్మమున్
దండిగ సేయఁ బెంటితొఁ గద్దరి గద్దరి పోఁతు మౌనియై 17

ఉ. పాయమపాయముం బొరయఁ బ్రాణము బాణము తోవ లేవ
యాయతి యాయతి న్యవతి వంటిన మంటము గట్టవంపు న
ద్దేయు విధేయుఁ బాండుఁ బడఁదిట్ట నపుం బొడిగట్టుకొంటి నం
వాయన వాయ నత్తుకొని యార్చెడు జాలుబఁ గూర్చి యుల్లసన్ 18

ఉ. చేసిన ధర్మము ల్వెఱుతఁజేరగఁ బెద్దలసేవ బూదిలోఁ
బోసిన నేయిగాఁగ ఘనపుణ్యము లెల్లను బుగ్గిగాఁగ నే
వాసియణంగ నేడు పరివారలలో దల యెత్తకుండ నా
భాసనరించితే విధియుపత్య ఫలాప్తి కురంగ హత్యలై 19

వ. పాండు రాజట్టు తన కటుమటమ్ముగ విరుగొడలంబడి కదునదలుచు నడలు తడఁబడ బడలు తన వడఁతుల విరువురఁగని కరము కనికరములో మనమ్మున ఘనమ్ముగ దొమకు దొనకఁ గను కొలఁ కుల వెంట గడువల కొలందిగఁ దిగఁగాఱు కన్నీరు మున్నీరై పాల వారలతో విల్లనియె

20

ఉ. పత్నులుగారు మీరలు సపత్నులు నాకిఁక శాపయుక్తి ప
ద్రత్నము పుణ్యనష్టి విజరత్న సుఖంబగు స్వర్గ మీఁగడే
యత్నము విప్రయోజన మయత్నముగా సుఖ దుఃఖముల్నరుల్
బ్రత్నముగాఁగఁజెందు నెడఁబాయును వీనికి నేల చింతిలన్ 21

ఉ. ఏటికి బోటులార యిటు లీరు వసింపగఁ గాననంబునన్
నేఁటికిఁ దీరిపోయె విహనిర్వృతి మీకును నాకు నింతటన్
నేటుగఁ బొందు ప్రోలికిఁక నేను దపం బొనరింతు రేపుమా
పేటికిఁ బోయిక్రుంకులిడి యేకతమేకత లేక నాకిటన్ 22

చ. అవవిని కుంతి మాద్రియవుడాపురు మంచట నేడ్చి మంత్రియా
వనమున మిమ్ముఁడించి వనువారమె భారమె మేము మీకిఁకన్
బెనిమిటి తోడ మంగలడె పేరతికంబును మంచువిందు మా
తనువు లెట్టైనను స్సరియ తట్టలు నెండవె వడ్ల తోడుతన్ 23

శిఖరిణి

వశానాధప్రాయ స్థిత భరత రాద్వాక్యములకున్
వశాప్రాయ ల్పత్నుల్ వసరియని రోనాద విడినిన్
వశంబే మాకేగన్ సతికి మగఁడే ప్రావు గదవే
''యశోనా మృత్యుర్వా'' యని మనెద మీయాశ్రమమునన్ 24

క అటు లొక్కి వరుస విడువక
కుటిలాలక లేడువంగ గుంజాటకతం
డెటులన నోరాడక వా
రుట జంబున వింగడించి యుండుట కొప్పెన్ 25

వ. ఆపాండు భూపతి శాపకృతంబుగా బ్రాపించిన యాపదగవి యాఁచిపగని సంతాపంబు దీవింపఁ దాపముంలదుఁ గొందఱిట్లనిరి

26

ఉ. ఇంతటి భూమి కాంతునకు యింతటి పాటు తటస్థమయ్యెఁ వీ
యింతులు సేసికొన్న యదె యాతఁడు సేసిన పూర్వ కర్మ మో

యింతకు నేటి పౌత్రులు మఱేరును వారిని వీడి యీతనిన్
వింతగఁ బట్టె మాలవిధి పిమ్మకపైఁ బడు బ్రాహ్మ్యమున్నమై 27

మ. మునినాథు ల్విరచిత్తులై సలుపుచు న్మౌనవ్రతంబూని యా
జన నాథుండును క్షత్రియర్షి యనఁగా వర్ధిల్లవంబిట్టులే
మనమందాయన తోటిపాటుగ "యథాభర్తా తథా భామినీ"
యనునట్లా సతులిర్వురూని పతికి న్స్పష్టంబుగాఁ గొల్వఁగన్ 28

చ. కృతమతి పాండురాజటులు కేవలమున్వలనైన భామినీ
రతికృత పుస్తకంబును గరంబు గరంబని కట్టి పెట్టియున్
మతరహిత తత్త్వ తత్త్వమెడమూపిన నూడున కీడుగా సతుల్
వ్రతము ధరించి యుండనొక వ్రంతను మంతనమందు నిట్లనెన్ 29

క. మగపాపలు లేకుండుట
మగువల పొందెడలి తామనుట "పీవుత్ర
స్యగతిర్నాస్తి" యనెడి నుడి
పగలును రేయతనిమదికిని బాధ నొనర్పన్ 30

శా. ఈ పున్నామక భార నారకము నేవెల్లేఁగు వాఁడ మ్మఁపి
ట్మాపం బాపి యగణ్య పుణ్యపదము న్సాధింప రక్షీన్వ రీ
పాపం బేసగి దారొలంగునని యాపాండు క్షితీశుండు సం
తాపం బాపఁగ లేక శోకపడఁ జెంతం గుంతి దానిట్లనెన్ 31

క బ్రహ్మ రహస్య మొక్కటియు
జిహ్మముగా వినుతు మునివి పేయు మటన్నన్
బ్రహ్మయుఁ దలఁచిన మాత్రన
జిహ్మగ గతి వచ్చి కోర్కి చెల్లించు నమున్ 32

శా. ఉర్వీనాయక నాదు తండ్రి గృహమందుండంగ నేఁడున్నదై
దుర్వాసుండరుదెంచి యుండి యట సంతోషించి నాపూజకున్
గీర్వాణోత్తము నెవ్వనిని మదిలోఁ గీర్తింప దోతెంచి మ
త్సర్వేప్సల్లయ చేయునంచు నొక మంత్రం బిచ్చె నాకప్పుడున్ 33

క. ఆమంత్ర మిపుడువ స్థిత
షై మించెదు వాయుమదిని పొంగొపొంగం
బామంత్రించెద వెవ్వని
గా మించెదరో వచింపగాఁదగు మీకున్ 34

క. ఆమడికిఁ బాండురాజవు
దేవిక పెక్కినటు తనకు నెగు భుజములుగా
నానవలాప్రతి బహుమతి
నానయగును పీయులేమి నాకవి పొగడెన్ 35

క. నాకులము వఱుత పొలగు
నాకులముగ నమను వెతలనందఁ జెలుల క
న్నాకులత నుద్ధరించితి
నాకులముగ నాకొలమున కధిదేవతవై 36

గీ. తల్లివిగఁ బుట్టక సతీసుతల్లివిగను
గనుము ధర్ముని ముసు మనఁగన్ నమవుగఁ
గనుము కొమరుని మనుమని మని మనుమని
మనకుదురు బ్రహ్మమానము మనఁ గుదురుగ 37

వ. ప్రియుని యనుజ్ఞఁగైకొని విరించి నమున్మని నెంచి మంత్రమున్
బ్రియమొదవ న్నపించి పృథప్రీతిఁ బరేతపతి న్వరింపగా
నయమతి ధర్మదేవతయు నాఁతికి బ్రాలిగఁ దోచి యేచి వ
ప్రియతము బుత్రుగాంతువని ప్రేమను బల్కి యదృశ్యుడై చనెన్ 38

క. రమణికి నెలమసలెను గడు
నమరెను నమమాన పూర్తియగుడు నగడున్
నమర విభుఁ డలర మగఁడిఖ
గమున మతున్యమ నమామఁగని ధర్మజునిన్ 39

వ. అంతట గొంతికిఁ బాండు భూకాంతుడిట్లనియె 40

క. ఒక కన్ను కన్ను గాదని
ప్రకటముల్ లోకోక్తిగాఁ బడు కావునఁబడున్
వికలత యిడునొక సుతుఁగను
మకుటిలబలుఁ బనుఁ గొల్చి యనుటయు నంతన్ 41

గీ. మగని ననుమతి పృథయును మగని ననుప
డినయముఁ గన న్మనువునఁ బండిన యనువున
మారుతుని గొల్చి కనియె గుమారు మారు
మారురుచి భీము శూరుఁ గుమారు మారు 42

వ. మఱియుఁ బాండు మహీశుడు తనయగ్ర మహిషితోడ నింక నొక
తనయుండుండుట బహుజన్మ సాఫల్యం బనియు బహుపుణ్యపరిపాకంబని
యార్యానుమయగు నాభార్య గొంతికి ఇట్లనియె 43

ఆ వె. ఒకట రెంట మూఁట నొనరంగ నాల్గింట
నైడి లోక వార్త కనుగుణముగ
దేవపాలుఁ గొల్చిదేవి బాలుని నాఁకఁ
గాలుఁ బోలు వంశకరునిఁ గనుమి 44

వ అనుటయు గొంతి మున్నుగనినట్టి సుతద్వయి కంటె దంట పా
వన ఘనచాపవిద్య ననవద్య పరాధ్యుని దైవభక్తి నీ
తనికెనయేరు లేరను దప్పక చెప్పకొనంగ నందఱున్
దనయుని గాంచె జిష్ణు కరుణన్ శ్రితకృష్ణుమహోష్ణు జిష్ణునిన్ 45

వ అతని కర్జునండు ఫల్గునండు పార్థుండు కిరీటి శ్వేతవాహనుండు బీభత్సుండు
విజయుండు కృష్ణుండు సవ్యసాచి ధనంజయుడు నరుడు మొదలగు
శుభనామంబులు అనేకంబులు కలవు తత్త్నామ నిర్వచనములు ప్రసిద్ధంబులు
గాన నిందు వివరింప ననగత్యంబని విరమించితి 46

సీ. సవ్యసాచి సముండు సత్తముండొదవునే
ధర్మ్యండు జన్మశతములకైన

విజయుఁ బోలెడు వాఁడు నిజముగాఁ గల్గఁడో
    నుగ్రుండు నతనికి నోడిపోయి
పాశుపతాస్త్రమ్ము పరఁగ లంచము పెట్టె
    ననితర సాధ్యకార్యముల నెల్ల
దా నిర్వహించెను దానవ గణములఁ
    గాలకేయాదులఁ గడిమి నోర్చి
దేవేంద్రు మదికిని దృప్తిఁ గావించెను
    ఖాండవ దహనమ్ము కడతఁజేసి
మత్స్యయంత్రము స్వయంవరమునఁ దెగసేఁ
    పాంచాలిఁ జేకొనె పగర గెల్చి
బ్రహ్మ రుద్రాదులుఁ బడయఁ జాలని యట్టి
    ముక్తి మార్గము కృష్ణమూర్తి యిచ్చె
గయుని జంపగఁ దాను గావింపుపూనిక
    విజయునకై శౌరి విడిచి పెట్టె
వృజినమ్ము పోరుతా వ్యధ పోరవిన యా
    పార్థుని సూరార్చి భవ్య విశ్వ
రూప మాతని కపురూపము జూపించి
    ధన్యునిఁ జేయడే జన్యముగను
సైంధవుఁ జంపగ శపథమ్ముఁ జేసిన
    పార్థుని గాపాడ భాను బింబ
మస్తమింపగ జేయ నాత్మ చక్రము చేతఁ
    గప్పి కర్పింపఁడే కల్లిమాట
పార్థుండు తనప్రాణ పదమంచుఁ బలుమారు
    తెల్పఁడే భువి వాసుదేవుఁ డొకట
యర్జును పైనున్న యతిమైత్రిఁ గృష్ణుండు
    నిజపురి విడిచి యాగజపురమ్ము
నాత్మవాసము గాఁగ నంగీకరించెను
    గాక ద్వారకయందుఁ గాలు నిలిపి

యెుక్క పూటయినఁ దానుండఁడె శ్రీహరి
బ్రాహ్మణ మృతపుత్రు ఁబార్థుఁడేయఁ
బూని చేయంగ లేక తానగ్నిఁజొరఁ బోవ
నిజకార్యముగ మాపె నిర్వహించి
యాతని నీతని నరయుచుఁ గావఁడే
వృథ సుతులను దెచ్చి మెచ్చి యిచ్చి
మఱచి తప్పున బార్థుండు మానె గాక
వాఁడు వేడ వికుంఠము వ్రాసి యీఁడె
యాదవేంద్రునకును బహిఃప్రాణమతడు
మాడ సామాన్యుఁడే మహాశూరుఁడతడు 47

ఉ. పుట్టిన బార్థువంటి ఘనపుణ్యుడు పుట్టవలె స్వగంబులో
విట్టిఁడు వట్టిఁడుం గలుగనేమి ప్రయోజన మెల్ల వారలున్
గట్టుపకాసి మాసి యని గట్టిగఁ బార్థుని జెప్పహేతువై
పుట్టున గృష్ణుడే నరుఁడు పార్థుడె కృష్ణుడు గాఁగ నుంటయే 48

వ. అంతఁగొంతేయు లట్లుదయించి మించి వర్ధిలుచున్న తదనంతరంబ 49

ఉ. మాద్రికి కూడ గుంతి తన మంత్రము తంత్రయుతంబు దెల్పగా
మాద్రికి నేరులేరవఁగుమారుల నిర్వుర మారహాకులన్
సద్రుచి నశ్వినీ సురుల సత్కృపచే నకులున్ శుభాంగు
మాద్రిగర్భిరు గాంచె సతి యాసహదేవుని దేవభావునిన్ - 50

శా. పంచప్రాణములట్లు లేఁగురు సుతుల్పాపిల్లి వర్ధిల్లగా
బంచే స్వర్తిని దాఁకఁబోకు ముసుము న్వారించి యున్నాన కా
పంచాస్త్రాభవలగ్న మాద్రి సతితోఁ బాండుండు క్రీడించి నే
పంచత్వంబును జెందె నామె సతితో సాధ్వీమం గూడగన్ 51

చ. కాంతు ననంతరంబ వెతఁ గందుచుఁ గుందుచుఁ గుంతి భావదోఁ
గాంతు ననంత రాజ్యము సుఖంబని పోవ సపుత్ర పీటికా

కాంతను గారవింప దన కాంతకు జిహ్వను వాంఛసేయుండే
కాంతము వ్యర్థించె దన యాత్మజులట్లుగ బాండుసూనులన్ 52

శా. గాంగేయుండును ధార్తరాష్ట్రతతియుం గొంతేయు సాద్రేయులున్
బొంగార న్నమరాది విద్యలను సంపూర్ణంబుగాఁ దీర్పఁ పే
యంగా ద్రోణుని శిష్యవర్గమును సర్వాతిశయుడై విద్యను
ప్పొంగె న్లొంగడు దాయకాయ మనంభున్ భాషించి యెవ్వారలున్ 53

క. దుష్టులని ధార్త రాష్ట్రుల
శిష్టులనుచు బాండవులను జెప్పిరి వారల్
సృష్టికిఁ దడియని వారీ
సృష్టిని లేరెరు వేయు చెప్పనేలా? 54

మత్తకోకిల

ధార్తరాష్ట్రులు పాండు సూనుల ధర్మశీలుర బాలురన్
ధూర్తులై తరిగొందు నెవ్వగ నొవ్వఁజేసిరి భీముడు
వ్యర్థుఁడంచు సుయోధనుండు గరంబు పెట్టియు గంగలో
నార్తిగా బడద్రోచి ద్రాఁచుల నంటగంటి శరీరమున్ 55

క. భీమున కా మున వాపెత
చీమ గఱచినంత బాధసేయక పోగా
సేమ మొసంగ నెసంగుచె
బాములు గీములును దైవభక్తికి మీదన్ 56

క. నాగాయుత సత్త్వునకు న
దాగరి సుతున కవిషోల్బఁ దాకక యుండన్
నాగాంతక వాహనకృప
నాగారికి బాధసేయ నాగములగునే 57

గీ. ధర్మరాజుని పొగడిరి ధర్మమూను
భీము నలరంగ రణరంగ భీము బలుఁగ

విజయు సమరమున నను విజయుండనుచు
గనల తులంరారె వరుభువి కుల తులని 58

వ. దరిఁగొని కర్ణుఁడా శకుని దాఁ గొని తమ్ముఁడు దుస్ససేనుడున్
దరిఁకవి బోవి వారుగను దారు సుయోధను జట్టి కొంచునుం
దరిఁకొ వర్గంగ వల్మరును దాఁటిగ దుష్టవతుష్ట యాళ్య నం
దరిగొని దేవికిం దమరెత్తై యొనరించిరి పెక్కు దౌష్ట్యముల్ 59

వ విదురుఁడ ద్రోణుడుం గృపుడు భీష్ముడుఁ ద్రౌణియు దార్త రాష్ట్ర వీ
ట దిరముగాగ నుండియు దృఢమ్ముగఁ దద్గుణ దోషమెన్నవోఁ
బదిలురు సర్వసమ్మతులు పాండవులంను నుతింత్రు వారి దు
ర్మదులని యేవగింత్రు ధృతరాష్ట్ర తనూజుల నోజ నెప్పుడున్ 60

వ అందరి వారలలోఁ గొందరు వారికిట్లనిరి 61

ఉ జనను నీకిటు ల్లగదటంచును భీష్మ కృపాదు లార్తి సం
ధానము సెప్పిరే నడుగు దాటునె కౌరవనాథుఁడుం బరా
న్వేనముఖం హి దర్పమును నిలిబడి న్మాగమాట గాక వా
రావగఁబూవ గర్తలయి యాతని కేటికి జెప్పరైరొకో 62

వ మఱికొందరిట్లనిరి 63

ఉ కాలము కర్మమిట్లు చెలగంగను గంగ ప్రవాహమేగ మో
కాలమరించి యావుదురె కానవిటుల్విధివ్రాసి యుంటలో
కాల మరించఁ బెంచఁగదె గంబడపేయుగఁ గర్తయుండ మా
కాలము మావ్రనౌవె యని యాగిరి కౌరవవృద్ధులత్తఱిన్ 64

గీ యోధులగు పాండవులును దుర్యోధనుండు
గాంచి రొమ్ముల కుంపటిగాఁ దలంచి
వారలను దూరభూమికి బంపుమనుచు
మెలఁకుగాఁ దండ్రి చెవులను గొఱుకు నుండు 65

ఇట్లు బహుజన మారకుండగు విజకుమారకుండుర కదనవిగా బవిగొని

ఘోరంతఁ పొద్దుమాలిపోయె మాలిపోయె జనకుండు మొుక కొండొక
తటి వినక పెడచెవిపెట్టియు గట్టకడకు బాండవులకుం దనకు ఋణాను
బంధంబు దీరిపోయె బమ్మరైన బుట్టకేయమ్మెతోపుల వెడమడి బడి వడి వడికి
వెడమిచ్చియయ్యంధనృపతి నమ్మతించి

66

మ. ధృతరాష్ట్రుండొక నాడు ధర్మజునితో దీపించి కోపించతే
హితముంజెప్పెర వారణావతమునందేతెంచి తోతెంచు నీ
కృతపుణ్యప్లున సినహూదరులతోఁ గీలించి మేలెంచి వి
శ్రుతము శోడశదానము ల్మిగుల నచ్చోఁజేయుమీ తండ్రికై 67

వ. అదివిని యానుయోధనుడు వావ్వఁబురోచన నాము వామువిన్
బదిలుని బిల్చి నీవునవి పాండవులుండగ వాసిఁ గాశిలోఁ
బ్రిదులక లక్కయిల్లు కనిపెట్టి రచింపుము వారలందులో
మెదలఁగ బ్రుందఁ జిచ్చిడి తమిందమిఁ దీరిచిరమ్ము రమ్మనెన్ 68

క. ననివాఁడ నముచుఁగని యా
పని వాఁడ వటంచు నిన్ను బట్టియటకువి
న్నని పెరఁ బనిదీర్చిన నిన్
దనిపెదఁ బనదనము లిచ్చి తలమునుకలుగాన్ 69

వ. అనుటయు 70

క. తగదనక కాని పనికిన్
దగుదు నముచు వాఁడు వారణావత మరిగెన్
వగ వఁగ నర్థాతురులకు
నగురుర్పో బంధువాడి న్యాయము గాదే? 71

వ. అనువగు చోటు చూచుకొని యాతఁడు లాఁతి యెఱుంగ కుండ ని
న్ననువగు ఫక్కి లక్కయిలు నాణెముగా రచియించి కాల్చియుం
డెను గనువారి కీతఁడు కడిందిగఁ బాండవ పక్షపాతి నాఁ
జని చలిపిను సేవియును జానగఁ ద్రొక్కని పుణ్యశీలుడన్ 72

మ. అదరంట ప్రయమూలి పాండవుల వట్లంధాధిపుండవ్వుకో
పదయుండై విదురుండు వారలను నాప వ్వాగ నసింమమున్
విదు రంద్రుంచెద రంచు లక్కయిలు హాసిం దప్పికొండంచు న
ద్విదురుండూకొన ధర్మపుత్రుడు చెవివ్వెసి న్మరుత్పూరితిన్ 73

ఉత్సాహ.

శమన మానుడును దనయనుజన్ములెల్లఁ దల్లియున్
శమన మూవికొని పెముకొని సాగిరాగఁ గాశికా
శమన ముందరియ విడిసెను జక్కి లక్కయింట నా
శమన లాన ననెడి విదురు శాసనమ్ము నమ్ముచున్ 74

సీ వగలెల్లఁ బాండవుల్పగ వెల్లడికిఁ దేక
మృగయావినోదులై మృగము లణఁచి
తే లక్కయిమ్మున రేలక్క యిమ్మున
నున నడమ్మున నుండిరి పవనుజాఁడు
వెడల దారిని గని వెడలించి నిదురించు
నన్నదమ్ములఁ దల్లి నటుకడ నిడి
యేయూరి యెఱుకెతో యేవురు సుతులతోఁ
బంచ తగంబండి పంచత గన
గీ తెలుపకుర యోరి యొరులను జెడదపీవ
యనునటుల్విధి యా పురోచుని దెచ్చి
మాట నాలక్కయింటిన మాటి చిమ్ము
పఱచెదము వారిఁగొని దవ్వు పవనసుతుడు 75

క అక్కడి జన యెఱుకుల మృతి
నొక్కటగని పాండవులుగ నూహించి కడున్
వెక్కనముగ దురపిల్లుచు
గ్రక్కున దుర్యోధనునకుఁ గమ్మున్నాపెన్ 76

క. ఆపోవుటదే పోలె
యాపాండవు లంబ తోడ నరిగిరి నరుగన్
బాపల రూపులు దాలిచి
మోసిక వారేక చక్ర పురమున కవలన్ 83

క. వ్యాసర్షి యాజ్ఞవారలు
భూసుర వేషముల నొక్క భూసురునింటన్
భాసురగతి నుండగ నొక
వాసరమున నింటివారు వందురఁ దొడఁగన్ 84

వ. అంత జేంతనున్న కుంతి యయ్యాక్రందనము తనడెందమ్మునకుఁ దొందరసేయ నొయ్యనొయ్యనా యింటి పొలతి తోనోయయ్యా ! యిట్టులొక్కపెట్టున యింటి వారెల్లమల్లడిఁగొని యుల్లంబు తల్లడిల్ల డిల్లపడి యొదరు కలతని దానెమ్ముద్దానోదాని వాపీమల విననలతుంగాన వే వినఁదగినది యైన వినుచుమయ్యా యనిన నప్పారుండు బారి దొలంగు మక్కనవో య్యక్కా! యెక్కడనే నెక్కాలంబున నేని గనివినని యిక్కట్టు మాకు మిక్కిలి మీదు మిక్కిలిగనేర్పడె. నేర్పడరి యొక్కటరక్కసి యొక్కఁడెక్కడనుండియో వచ్చి యీచక్కి కిక్కడ దావరించి నెట్టుకొని యున్నవాడు. వాఁడొనరించు వానరలీ పగిదివియని వాక్రువ్వ వాకును మాకొన కొను పికును దరము గాదైవము బెద్దనబుద్ధియ వెంతయు నాదరమ్మున పీదవాదరము సేయ వాదుకొనియెడ నేని నాదుమనమున నున్న వంతనంతయు వావంతయు విడువక మడిపెద నాలింపు మవ్వా !యని యధరాని విలిచు మాణి వెలంగుచు వెలుంగురాల్పడ విట్లనియె 85

చ. బకుఁడను నొక్కరక్కసుడు ప్రల్లదుఁడల్లనఁజేరి యిందులన్
మొకమొకపాటున న్నగముల మీద నెగంబడి చెందుచుండగా
మొకముల తేదు పెల్లవలె బ్రింగఁ దొడంగిన నింటికొక్కనిన్
గకనికసేయ కిత్తుమని కట్టడసేసిరిమొప్పె నాతఁడున్ 86

చ. ప్రతిదిన మొక్కఁడేగు నొకబండికి గుంభపు కూడు పంపియున్
జత యెనుబోతు లాన్పికొని పోగి యుతండెట మండు నాడకున్
వెతకుచుంబోవ రాక్షసుఁడు వేళ యొకించుక మించకున్న నా
మెతకులు నోట వేసికొని మ్రింగును బోతుల బండి మానిసిన్ 87

క. ఇలువరుస నిట్టులరాగా
విలువరముగ వారుపాల వేఁడది వడి నేఁ
డిలువరుస యెట్టులిరవగు
బలువిడి విధి దాఁట నెవరి వశమగు దల్లీ ! 88

క ఒక యమ్మ కన్న బిడ్డను
నకిఁ బుత్తునొ మాటలాడఁజాలని నాపు
త్రికఁబుత్తునొ నోరెఱుగని
యొకడే సుతు బకుని నోట నోర్తువె ద్రోయున్ 89

ఉ. తల్లికిఁ గూర్మికాన్పదము ధన్యను గన్య నన్య నంపగాఁ
దల్లికిఁ దండ్రికాన్పదము దారుణ ధీరుఁగుమారు నంపగా
దల్లిని దండ్రి కాన్పదము దారను దారను ధీర నంప భీ
తిల్లి కిరాతుఁడైన బకు నాహృతికై తగునే వోదునో 90

గీ ఎట్టులును బాలునొక మాకిట్టి మెసఁగు
దలఁగఁగల పుణ్య పురుషులు గలరె యంచు
ముంచికొని వచ్చు నార్తిలో మునిఁగి యుంటి
మార్చెదో తీర్చెదో యమ్మ యనగ కుంతి 91

వ. ఆవృత్తాంతము అంతయువిని గొంతి యాయింటి వారికి మాఱుగ తన రెండవ కుమారుడు మార సదృశ శూరు సమీరసూను బకాసురున కాహారార్థమంపెద ననిన నవ్విప్రుండు నవ్వి యవ్వా! నేఁటి దినమేటి దుర్దినమ్మిలాటి చెడుమడి వినవలసివచ్చె నెంత మాటాడితివి శివశివ నీవ యిచ్చెద వదియైన నయ్యయ్యో యెంతపాటి చెడుమాట నాకు వినవలసివచ్చినది తన చేతులతో దన శ్రవణ కుహరములు మూసుకొని హరిహరీ యనుచు

బ్రాహ్మణుండిట్లనియె

92

క. ముట్టమని చూడవచ్చిన
బట్టైన దయ్యమయి యున్న భంగిని మిమ్ముస్
బట్టి యతిథులన వితధుల
గట్టిడి లకు 'నోటఁ బెట్ట' ఁగా నెటులోర్తున్ 93

వ. అనవుడు నాయమయు వాడు గలిచికొని యింతటి మాట యేలని యెదురు వలవదు డుగుండు కలగుండు వడెడు మిమ్ముఁగని కరమ్ము గనికరమ్మొద వొదవి నాకునేన పరోపకారము బహుజన్మ సంచిత సుకృతమని యెన్నికొని నాకన్నకడుపు రాకాసికి గ్రాసముగా గాసిక్షైన పోర్చి పెల్చి యాయంబూనితిఁ గాని మీరు కోరినవెలిమెచ్చులకు నిచ్చిన దానను గాను మీ యెందరెందఱున్న దరిద్రులకు నెందరున్నను నందమండు నేనియే తిరిగకుఁగాయద్రేఁగగునే నేవెఱుఁగకున్న దానను గాను ఇఁక నేతొందేమియు మాటాడక కర్తవ్య మెద్దియో తద్దయు గూరిమి నోరిమిగొని పేరిమిగాఁగావిండని మఱియు నిట్లనియె

94

ఉ. ఓడకుఁ డోడ కుండుఁదిదె యుద్ధరణంబొనఁ గూర్తు మీకునే
బోడిమి నాకు నేవ్వురు సుపుత్రులు వారలలోన నొక్కనిన్
రోదువడంగ నిత్తు బకుద్రుంచి యతండి దియాదిగా నిటన్
జీఁడ దొలంచు మీఱలఱచేయిడి ఆొమ్మున నిద్ర నోనటుల్ 95

క. వారలతో నిట్లని తన
చేరువ గారవము మీఱఁ జెలఱలాడెడి కి
మ్మీర విరోధిని గనుగొని
వారని దయ దొలుఁక గొంతి వల్కె సుతునకున్ 96

వం.వా.

ధరామరాళి కీడఁ గూడి దాడిఁ గీడు పేయు వా
శరారు నాశరారులెన్నఁ జక్కఁ జక్కడంచు దు

ఘోరమ్ముగా దురమొనర్చి పావన వసిష్ఠులన్
'గరమ్మురమ్ము బాగుసేసి కార్యమార్యులౌనన్' 97

ఉ. ఆమె యమ్ముక్ష భీముఁడరి వార్పఁగ బూని మునుప్పునిప్పుపై
నామెత నెక్కి మెక్కుచు తదన్నము నున్నఁగ బ్రొద్దుపుచ్చ నా
వా మునుఁదోక ద్రొక్కిన మహోహ వటన్ బకుఁడుగ్రమూర్తియై
గామిడి యేగుదెంచి తటకా వడి చూచుచు నోప కిట్లనెన్ 98

గీ. జొరా నేమున నేక వక్రపురమేనా లేదె యేదేశమున్
నొరా నేమున నేక చక్రముగ మున్నారీ ర లేలన్నమున్
దేరం గ్రుమ్మరుమండి కుట్టి నపుడే తేలంద్రు తాఁగుట్టకే
తేరం గుమ్మరపుర్వటంద్రటుల గాదే మంచికొండేనియున్ 99

గీ. అనుచు భీముని దనచేత నురపాడున
నొప్పదెందక తడు వావిజప్పరించి
కులు మెత్తిన పిడికిటఁ గదియఁ బట్టి
నొనటఁ బొడిచిన బకుడు తమ్మకొని నచ్చె 100

తరల

బకుని సోదరు లొక్కపెట్టునఁ బైకిఁదాటిన భీముడున్
బ్రకట సంగరమోనొవర్చితి వ్రతముగా నరమాంస మీ
రికఁ దినందగ దట్ల దింటిరియేని బంపెద మిమ్ములన్
బకుడు పోయిన చోటికంచని పల్కఁజాటిరి వారలున్ 101

మానిని

అట్టు బకాసురు బట్టి వధించిన
హాలిపిరేలిరి యేలుగవ
ప్పట్టునఁ బాండవులంబను రోడ్కొని
బ్రాహ్మణ వేషము లొప్పు నెనన్
గట్టిగ ద్రౌపది పెండిలి వావిని
గ్రక్కున నక్కడి కేగిరిగాఁ

జెట్టలుగాఁ గను జెట్టను బాలులు
వెంతల వంతలు చెప్పుమురాన్ 102

శా. కాంపిల్యంబున సోమకుండు సుతకుం గల్యాణముం జేయనై
పెంపారంగను బెండ్లియాడు నతివ స్ఫీతత్వుఁడంచుండగాఁ
ఐంపెవ్వారిని లక్ష్యయింట ధృతరాష్ట్ర శ్యేష్ఠజాండంచు భూ
తం వంబాటకుఁ దానొకండు దలవంగా దైనముండెన్నగా 103

వ. అవి యిట్లు ద్రుపదుడు వివరం బుధితరింపందగు తరిందరికిఁదెప్పునాడు హరియకాక వేరొక్కండెవ్వండవి మనంబున దలంచుచు మఱియు విట్లనియె 104

క. వారల దేవాంశజాలతి
శూరులు దారులెటులా శుశుషణ పోరిన్
జేరఁగఁ జాలును గాలుని
మీరిన బలులట్టి వారు మిత్తికి వతులే 105

వ. కావ నీ లక్ష్యయింటి వార్త వీలివార్తగా నోపు దైవానుగ్రహ సంపన్ను లావ న్నుల గుదురా? వన్నుగ వట్లగుదురన్న ఐదుగురు వగుదురు గాన వెట్టులైవనీ లోనవ లాక్షాగ్రహాది భాధలు లక్షోవ లక్షలు తప్పింపుకొవి యుంద్రైన మరక్షితులై యుందురు వారల వెందులకు రప్పించుకొను నుపాయమువా నేవ వన్నాదనవి ద్రుపద నృపతి తన పురంబున 106

మ. శ్రమ యావంతయు లేక యేను శరముల్పంధించి బంధించియం
త్రము నేలంబడఁగోల నేయు నతఁడే ధవ్యిభ్యుఁ డీతవ్వికిన్
రమణుండంచును మత్స్య యంత్రమురుదారంగట్టి చాటింపభూ
రమణుల్వేడ్క స్వయంవరంబునకు జేరవ్వచ్చిర చ్చోటికిన్ 107

ఉ. కర్ణుడు శల్యుడున్ శకుని కౌరవనాథ ముఖాది యోధులన్
ఖర్గముపేరి దాని ధివియంజని యావనికేము తారమం
చర్ణవరాఢ్య భీరుంట వాఁగిరి దండము వెట్ట దావికిన్
వర్ణిగ నున్న క్రీడియుఁ జవాయవ దుత్సిమ మత్స్యయంత్రమున్ 108

సుగంధి

ఏక దాటి పార్థుతోడ భీకరాజి సేయ నా
దూటి మాంతి సేనలన్ని యూాచకోత కోయగా
నీకు మ్రొక్కు వారమయ్య నేడు పీడుమున్న బో
బోకుడంచు ఫల్గునుండు పోర నోర్చి నందఱున్ 109

క. ఆగతి పార్థివ కోటులు
నా గిరిరంబుగ నరుండు నా ద్రౌపది వే
వేగం దోకొని చన హరి
బాగుగఁ బార్థుల నెఱింగి భ్రాతకుఁ దెల్పెన్ 110

గీ. మత్స్య యంత్రంబు విలఁబడ మార్కొనంగ
తోడ శల్యారి బనకేగెఁ దొలుతనంత
బక విరోధియు మధ్యమ పాండువునకు
ఏకఁ దోడ్పడ విలఁబడె వెన్ను దన్ని 111

వ. అపుడు కృప ద్రోణ పురస్సరంబుగాఁ గురుపతి, కర్ణశల్య ప్రముఖ యోధాను
యోధులు స్వయంవర లబ్ధ విజయుని పైకి జననోడి సంచలిత చిత్తుఁ
బాంచాలుందరమిడి తరమిడి నప్పార్థుంగూడి యున్న విప్రులు నొహోయంచు
నోటమి యేటికి సిపాల మేము గలుగ భూపాలు ననూయా పరవశులై
యరయక ఏకందాకినఁ బార్థుండెదుర్కొని వారిపైఁ జాలఁగఁ గోల్తల
నేయుచుండె నవుడు
112

చ. ద్విజాలు తలంచి పార్థునొక విప్రునిగాఁగను చాందసంబునన్
ద్విజగణ పూర్వపుణ్యమునఁద్రెంచె వితండల మత్స్య యంత్రమున్
నిజమున కీతఁడుందరియు నేర్చునె యంత్రము నింమకేని భూ
భుజాలగు కర్ణశల్య కురుభూపతి ముఖ్యుల దాక శక్యమే 113

వ. అటులు విప్రులమాయకత్వంబున వర్థునంగూర్చి యమే యుబ లవ రాక్రమ
శాలియని యెఱుంగక తెఱంగుమాలిన మాటలాడికొనుచుండ స్వయంవరా

కం



ర్థాగత భూపతులీ విప్రుఁడోపం లేమున్నయది ద్రుపదుండు నృపతుల
వంచింపందలంచిమత్స్యయంత్రంబని యొకమిషసన్ని యుందర నిందు
రప్పించె. దైవమానుషబలసంపన్నుండు గాన నీపాలుండే పారమత్స్యయంత్రం
బుదెగవేసి వన్ని వసికొన్న వన్నిన్నియుఁదాఁ జేకొనియె నీతని తప్పేమి? యీ
విపత్తునకు ద్రుపదుండు మూలమిమ్మనృపతి ద్రుంతుమని యందరు నొక్క పె
ట్టునఁ బైకిరాగ నాఁగలేక పాంచాలుండు బ్రాహ్మణులమఱుంగు సొచ్చి కావుమని
వేడుకొన నవటఁ బెంపారు సౌఖులో హో పాంచాలా! చాలుచాలు వెఱపేమిటికి
మేమిందఱు మఱలేక నీపాల నుండఁబర రాజుల యాట సాగ నిత్తుమే యను
చుండ భీమార్జును లిరువురు బలువుర జాలువున శరజాలంబుల గ్రుంచి
ద్రుపదు నోడకుమని పరువ మిచ్చిన నతండు వారి హెచ్చైన బలపరాక్రమముల
మెచ్చుకొని నచ్చువిడి నచ్చి యుండె నందుఁ గర్ణుండర్జునిం దలపడి యాతని
శస్త్రాస్త్ర జ్వాలా పారమునఁ దొప్పదోంగి కాలుసేయాడక గ్రొప్పడి యుండఁ
జాలగఁ దహారివ న్నని నెదుర్కొన బాండవమధ్యముండొండెఁ
బరశురాముండొండెఁ గాక వేఱొక్క నికిక్కడిమి యెక్కడిది బ్రాహ్మణ
బలం బమోఘంబు ''ఇదం బ్రహ్మమిదం క్షాత్రం శాపాదపి'' శరాదపి
యనెడు రీతి నప్రతి హతంబుగాన నీపాలుతోఁ బోర నాతరము గాదని
యతనికి జేయెత్తి దండమిడి యారాచకొమరుపై గట్టిపట్టుగ నారాచ ప్రయోగ
ప్రమేయ పుస్తకంబు గట్టిపెట్టి యా యోధనంబు మాని సుయోధను
గూడఁజనియె నట్లు శల్యుండు భీమునితోఁ బెండల కరుగఁదా గదా
యుద్ధమునకుఁ దలపడి యతనిచేఁ దలపగుల చావుదెబ్బలుదిని
చావుదప్పికన్నులొట్ట వోయె నన్నట్టులై యెన్నఁటి కింక భూసురులతో
బరిహాసమున కైనఁ బోరాటమునకుఁ బోఁగూడదనుకొని భీమునిచే
యుద్ధభూమిం బుక్కొడు మన్నుగఱచుకొని వెంబడి లేచి యొడలి
దుమ్ముదుడిచి కొంచు పోలికలనికిఁదొలగి చనియె నిట్లు ప్రచ్ఛన్న
బ్రాహ్మణాకృతి మున్న పాండవులిర్వురు భండనంబున రాజన్యమండలంబుల
మాఁచముట్టుగనోడించిరి. సంక్రందననందనుండు స్వయంవరోపార్జితయగు
ద్రుపద నృపతి నందనం బొందుగఁ దోడ్కొని చని తనవిడిఁది పట్టగు
కుంభకార మందిరంబున నానందము గదురం బ్రవేశించి వాకిట గిటకిట
జనంబు నందడింప నిల్చి లోన మున్న జననిం బిల్చి 114

మ. ప్రియుతము లిత్తగంటిమని పేర్మి నరుండన గుండెబేది న
ప్రియుతము కించి ముందటి మదిం దినదగ్గ పదార్థమంచు నీ
ప్రియుతము కింపుగా నముభవించరె యేవురటంచుఁ బల్కె యు
ప్రియుతము మింతిగా నెఱిగి పేరట యందఱు నిమ్మటన్మదిన్ 115

క. అదిదైవ నియతముగుటను
మదిని కడు వ్వింత పెల్లి మది పాంచాలిన్
మదిమదిఁ బాండవుఁ లేవురు
బ్రిదులక వ్యాసర్షి యాజ్ఞఁ బెండిలియైనన్ 116

క. అవుడట్లు దైవ నశమున
వివదంబుధి దాఁటి పాండవేయులు కృష్ణన్
నివుణత గొనఁగలిగిరయని
ద్రుపదుడు కృతకృత్యుఁడయ్యె దోషమునంగన్ 117

ఉ. తమ్ముని పుత్రులవ్వనిత తోడను జానటుదప్పి యెప్పి న్వ
స్థమ్ముగఁ ద్రోవదింబడసి శ్వశురగృహంబున నిందులందుమున్
దమ్మున జాడగోరి రవిన్ ధృతరాష్ట్రుడెరింగి నమపా
తమ్మున పిడి వారివి హితంబుగ రాఁబనిచెన్ ముదమ్మునన్ 118

క. ఇంద్రమను విభవుఁడంద న్వ
పేంద్రుఁడు తన యమజ భాగమిడి యనుపింపన్
ఇంద్రయశస్కులు పాండవు
లింద్రప్రస్థ పురమునగి నింత దలిర్పన్ 119

క. నలువురు తమ్ములితమ్ముగ
నలువకు నలుమోములట్లు నలిపాలనకున్
నలుఘనములు నళి వెలయఁగ
నలువుగఁ ధర్మజుడు పాలనము సేసెనిలన్ 120

సీ. ఎంతటి రాజైన నింగాంతఁ గల్గనే
    సత్యమాన్య సజాతశత్రు సంజ్ఞ
నెంతటి శూరుఁడే నెన్నిక క్కెనే
    స్థిరముగా గను యుధిష్ఠిరుఁడటంచు
నెంతటి రేనె నేరిని నెందెని
    రహిఁబిల్చిరే ధర్మరాజటంచు
నెంత పుణ్యాత్ముఁడే గంగఁగల్గనే
    దివికి నేమేని తోడ్చు దినక
గీ. ఘనత నే సత్యముని నైన గర్వశత్రుఁ
దాడి తప్పని వాడని యాడ నొక్కొ
చెప్పడెవిన్నెల్ల ధర్మరాజునకుఁగాక
మహిత లఘుఁడు గాడె సామహితుడతడు 121

ఉ. ద్రోవది వారదుండి డిన త్రోవ తిరంబుగఁ జూపి యేటవ
య్యేవురు భర్తలందొకనినే వరుగాగొని యుండువట్టి వో
నోవర మెవ్వరైనఁ బెలలొంటిగఁ జొప్పినఁ దీర్థ యాత్రకుం
బోవలె నన్నకట్టడిని బోటి యుధిష్ఠిరు దండముండగన్ 122

మ. ఒనరన్ భూసురుఁడొక్కఁడేగి యొకనాఁడు ద్వేగియై పార్థుతో
వినిచెన్ చోరులు, వారు నైనికని నేరంబందు నో ప్రుచ్చిలెన్
మనర శ్రాత్రిని నోరు పెట్టికొని తద్వృత్తంబు వాపోవుచా
నని గన్గొన్న పెటుల్పవించుమది యొంటి నీఁలుగాశేరికిన్ 123

వ. అనుటయు ధనంజయుండు మనంబున ఘనంబుగఁ బిరవాలు లాడి 124

మ. తన గాండీవ శరంబు లగ్రజుని పీఠంబందు నుండంగ ని
వ్రుని యార్తి న్నిమవేఁ బుట్టినకృపన్ బోవమ్మునా కూడదా
యను చింతన్ దిగ్రాని చొప్పి గృహమా యాశ్రీయుపుల్గొని బా
లుని కార్యంబును దీర్చి క్రీడి మదిలో బోవన్న జాగ్రత్తలిన్ 125

ఉ. అంత గిరీటి యేగి తన యన్నకు బ్రముక్తి ద్విజమ్ము వింతయేఁ
బ్రింతు నటంచు మైమఱచి రేవర యోవరఁ జొచ్చి తెచ్చితిన్
మంతు వరంతు విష్కృతికి మానక యేగెదఁ దీర్థ యాత్రక
న్నంతట నన్న బ్రాహ్మణుని యాపద దీఱిచి యాత్రలేటికిన్ 126

వ. అనియున్న యన్నకుఁదిన్న గన్నెఁగదన్నరాజ ధీరుండగు నగభిన్నందనుండు
కొండొక విచారించి పెండియు నిట్లనియె
127

చ. ప్రతినకు భంగమైన నిలపార్థు డటంచు మునవ్వరేజముల్
బ్రతికిన వాళ్ళ లోకము నెటానను బానను బొందు టొప్పుంగా
కితరము నోలునే నుడువ నేటికి నేఁటికి బోయి వచ్చెదన్
మతి నమకూల మందికొని వానతి వానతి యిమ్మునాకిఁకన్ 128

గీ. గట్టిగా నన్నగారికి నొట్టువెట్టి
పట్టువట్టినఁ గానిమ్ము దట్టి యంచు
నెట్టకేల కతఁడు సరియే యనంగఁ
దీర్థ యాత్రకుఁ బార్థుడేతేరగడఁగి 129

వ. అపార సువర్ణ భారంబులు వెంటఁదీసికొని బ్రాహ్మణుల కమిత కనకం
బొసంగి
130

ఉ. అంతట లేచి పుణ్యనదులందున గ్రుంకి యులూచిఁజూచి యా
యింతి వరింప బెండ్లియయి యింద్రజుడా ఫణికాంత యందిలా
వంతునిఁ గాంచి పిదప దుదిఁ బంతఁ జన్మ్మగులూరుఁ దత్పురీ
కాంతునిఁ జిత్ర వాహనునిఁగాంచి వరించెఁ దదాత్మ జాతమున్ 131

గీ. అంగజాకారుఁడర్జును డడుగనిచ్చె
నంగ నామణి యైన చిత్రాంగదను వి
వాంగజాతను జిత్రవాహనుఁడు నామె
యందు బార్థుఁడు బభ్రువాహనునిఁ గనియె 132

కౌంతేయుఁడట గొంతకాలము వసించి పంచతీర్థంబున నవగాహనంబు సేయంబోవ నందుండు నగ్రాహంబులలో నొక నక్రంబా సింహ విక్రముండగుకవ్వడి కడకాలు పట్టి కడకాలోనికిఁ దివియ నతండా కాల్మొనలికి మాఱుమసలి దాని వెలువలికిఁ దిగిచిన నానక్రంబొక యువక్రముముగ నప్పరస్త్రై తనకును దన యనుంగులైన గంధర్వ తనయలకు నీట సుఁకు నొకానొక ముని యాగ్రహంబున గ్రాహ రూపములొదవి యప్పంచ తీర్థంబునఁ బడియుంట లోను గాగల వృత్తాంత మంతయుఁ గలయంత వట్టు చెప్పిన విని విన్యమ్ముఁడప్పారువంది తక్కు గ్రాహంబులం గూడ శాపంబను పాపంబున కెడఁబాపి యచ్చరల మచ్చకంటుల గానించి కొంతకాలంబు నరుడు మణలూరు పురంబున నుండి బభ్రువాహనుని చిత్రవాహనునికి వంశవృద్ధికై దౌహిత్రు ధర్మంబునఁబుత్రుఁ గానొసంగి యభ్యర్థంబున నుండు గోకర్ణ క్షేత్రంబున కేగి యా పుణ్యతీర్థమున నుండగా దీర్థంబును స్వార్థముంగూడఁ గూడి వచ్చినట్లుగా ద్వారక నుండి వారక యాత్రార్థ మరుదెంచిన వారొక కొందరు పార్థుని చూచి యాదవుల కుశలప్రశ్నములడిగిన నరునకుఁగృష్ణ సమాచారములు వాచానుగోచరములుగాఁదెల్పుమాఁదద్యశః ప్రస్తావనాంశంబున భృశంబుగఁ గృశోదరి కృష్ణ సోదరి సుభద్ర భద్రంబుగా బేర్కొని యాపె సౌందర్యాతి శయంబును దదాశయమున కెక్కఁటెక్కవిధములఁజెప్పుచు విట్లనిరి. 133

## సుభద్రా వర్ణనము:

అతివ చక్కదనంబు నతివో గ్రాహ్యంబు
గాన వర్ణింపఁగాఁగష్టసాధ్య
మతిశయోక్తిగ వర్ణనాంశ మేమి యటంచు
విచికిత్స మదిలోన విడువ వలయు
నుర్విలో నుండెడు నుపమాన వస్తువుల్
దగు గగనార విందాయమాన
మగుచుండు పతియువయునములతో సాటి
యొనరింప నొకటియు నుర్విగామి

తుఱ్ఱి మయూర పింఛమును గొప్పునఁగాలవి యుంచఁ జైకఁ గో
వ్రాల్లక యూఁగె నీ పిఱుఁగు నొందిన భద్ర సుభద్ర యేమమా 140

ఉ. మదలి యనంగ రాజ్యసిరి శోభిత లక్ష్మికి రాజధాని యే
కద యదియట్లు గాదనినఁ గట్టిన తేరు పెడిమ్ము తేజియున్
వదలక సవ్యహాసములు బాణము లౌటని శంఖ కాహళుల్
మదగజ ధర్మ కుంభములు మానిని మేన జెలంగ నేటికిన్ 141

గీ. అందమూను మొగమ్ముతోఁ జందమామ
సామునకు రాక యుట యేగె మామ పోల్కి
కందు వృద్ధిక్షయంబుల కందుఁ జెందుఁ
గావనీ కలంక వికృతి గాన కాన 142

క. చిలుకల కొలికి తమాలతఁ
జిలుకుము పెలతేని యెలుఁగు చెలువులు పలుకుం
జిలుకలకుఁగలుఁగు సుధభ్రమ
చ్ఛిలుకల మృదు వచనరచన చెలువ పలుకులన్ 143

క. పలువరుస లలన కలరుము
బలువరుస లవరమూడి పకపకనగుమున్
బలు గడిగిన ముత్తియముల
బలువిడి నంచలకుఁ గలుఁగు బడిబడి నడలన్ 144

క. శశాంతయుననుయని నా
రి కథపుండాను మదుట లిఖియించి మదుల్
శ్రీకారము తుదమొదలను
శ్రీకరముగఁ బెట్టె ననఁగ జెవులలరారున్ 145

గీ. అంగమును జూచినంత ననంగు దారి
బడి మరుల్గొందురని మరుండడరి తనదు
చాప యుగ్మము వెక్కిడి నాకరముఁగ
ద్రోలవిడె నన నరి కనుబొమలుఁ గొప్పు 146

శా. ఆకాశంబున సైంహికేయుఁడహిత్వి యాజన్మ వైరంబునన్
రాకా చంద్రుని మ్రింగ పోగ వెతకోర్వఁజాలక బ్జారి భూ
లోకంబందును గందు దాఁచి యిటవో లోలాక్షి వక్షమ్మై
దాకొన్నాఁడని పొంచె రాహువనగాఁ దద్వేణి రాజిల్లెడిన్ 147

చ. బిసరుహనేత్ర బాహువులు వేమరు తామర తూండ్ల మాడుగాఁ
బోనఁగ దటంచు వాదనకుఁ బోకుఁడు మీకు రుచింపఁ జెప్పెదన్
బిసముల కుంతమందు నరవింద ముఖంబు వహించి విమ్మన
బ్లోనఁగ సతీ భుజాంతముల నేటికిఁ బద్మము లొప్పుచుప్పుడీ 148

సీ. విధు బింబమున నుండి సుధ ముష్టిఁ బెకలించి
విధి వధూముఖమున వేయనదియు
వెలదికి స్మితమయ్యె వెల్తి యేర్పడె నెల
కరి లాంఛనంబని యంద్రు జనులు
నాకొలంత మఱల్పనజాఁడామె మధ్యంబ
పాటించి తెగటార్చి పైకిఁ జల్లె
నది చంద్రులోఁబడ కబ్రంబు నైఁబడి
మెరుపయ్యె నెలవెల్తి తొలఁగదయ్యె

గీ. పైగ సతి మధ్యమందు నాభామొదవె
నిట్లొకటి సేయఁబోనఁగె వేఱొకటి భక్షి
తేల సిలకు నేన శాంతారు జాపరంతు
పూతి గందోఉభవత్తమ పోల్కి గాఁగ 149

క. పలుకుల కులికిపడును సతి
పలువరుసయు మోవి యలుసు పడలిఁకురులకున్
బలునడలు నడుమునకుఁగుచ
ములు మలుకు విదేటి చిత్రమో కనుఁగొనుఁడీ 150

క. విచికలగంధి కనుంగవ
కువయుగ్మము కచభరమ్ము కురువుమ దీనన్

ప్రమదముగఁ దన్ను దాఁగవి
సవరింపుము శీఘ్రమె భయమోక్షముడీ 151

గీ. లంపగాదిది లావణ్య జలధిగాని
మత్స్య కచ్ఛపకుముద పద్మ ప్రవాళ
శైవలావర్త మౌక్తిక శంఖభంగ
ముఖ్యమవ్విత్తి నల్లట యొనయనేల 152

గీ. సర్వలోకోత్తరుండైన శౌరితోడఁ
బుట్టు నగుటనో తల్పను పురుషవర్యుఁ
పాణిఁ బట్టుటవో మానుభద్రతోడఁ
బోలు సుందరి యెందును బుట్టలేదు. 153

వ ఇట్లు ద్వారకజనములారకపౌభాగ్యోన్నిద్రయగు సుభద్రరూపరేఖా విలాసాదుల
విడరానివిగాఁ బలు దెఱుగుల నొఱుగు తెఱుగులు లేకుండ వ్రాక్కొచ్చి
యొప్పులొలుకఁ బూనగ్రుచ్చినట్లుగఁ జెప్ప విప్పమ్ముందు చెవుల పండువుగవివి
మెచ్చుకొని యామచ్చకంటిఁ దనకంటఁ గముగొంట కెప్పుడెదువువో యని
వోరువ్విఱల్లార నామెను గూర్చి వినిన యంశమునె సంశయ విచ్ఛిత్తి యడిగిన
నడువున నొకసారి మఱియొకసారి యడిగియు మగిడిమగిడి వేసారులు
వేసారక గ్రుచ్చిగ్రుచ్చి యడిగి తెలిసికొనుచు నుచు కోరిక లీరిక లెత్తనత్తఱి
యబ్బిత్తఱి కడకేగ నమకట్టి యుండ నందునందు నుండక్కడకుఁ
జాక్కియూఁడిపడి నట్టు లాడఁబోయిన తీర్థమెదురు వచ్చినన్నట్టు వెతక
బోయిన తీగ యఱికాలఁ జుట్టవేసి కొనినట్లు తలచినపుడ కొలచిన
యున్నదైవము మునుకొని మొలచినట్టు తలవని తలపుగ విజయము సేయ
విజయుండు తనకు బ్రాణబంధువు విష్టదైవము తోడు నీడయు
నేడుగడయుఁగాన నవ్వేణుగాన ప్రియునకుఁ గవ్వడి సర్వాంగాలింగిత
భూతలంబుగా సాష్టాంగ దండ ప్రణామంబు లాచరింప నెవ్వరి కెవ్వలను
మనవు మఱువుల గోచరంబు గాని శ్రీకృష్ణదేవుండలవిఁటువ చతుర్భుజంబుల
నెత్తియెత్తి కౌగిలించుకొని యీయాయా నీతలంచిన తలంపు లంపులేకయు
ఫలింపఁగలవు క్రొత్త పెండ్లికొడుకవు కమ్మని దీవనలిచ్చి కుశలంబడిగి కొన్ని

నీకలందుండి తన చెలియలు సుభద్ర యందతని మనమ్ము ఘనమ్ము
గఁదవులుకొని యున్నట్టు దెలిసికొని దవులమున్న నటించు నని కలిసి వచ్చినట్టు
ఘటింపఁజేయ దుర్ఘటమ్మని యతని మనోరథం బొడఁగూర్చు వాఁడై ద్వారక
చేరికగాన నందముక రమ్మని దయదొలక మృదుమధురమ్ముగా నోటియార
మాటలాడి వేడ్కనతని తోడ్కొని పోఁదలంపున నామలింప నామంతింగల
పనియు నంతి యగునని యంతికముగానవచ్చెదనని పార్థుండు తనకు
చిత్తము బడఁజేయుదు నాపై దయ యుంచుమనినాపై తృష్ణ్యప్రేయుని
జల్లఁగ దోకొని చనియతని యతివేషంబున నుండుమని తనయింట
మరుంగునడ నొకచోనుండ నియమించినఁగ్రీడి తన యతిమానుష వేషంబు
దాఁచి యతి వేషంబు దాల్చియు నతిమానుష రూపంబు చూపఱుల
చూపులకు నోపిక పోఁజేయఁదగి యుండె నాకృతిక యతికి వరివస్యసేయ
ననశ్యముగ లావణ్య సముద్రయగు సుభద్ర కృష్ణు నానతి నేర్పడి విజయుండను
పందియమొదమినెప్పుడు మనుష్యుని బోలిన మనుష్యులుందరా యనియు
మతియొకప్పుడు కొలందిరాని నానతివంబుగా ముసుగిడి యాయతికిఁగాన
రాకుండ చాటునడమాటున దాగి తన్ను సత్యారుక్మిణులు నాయతి నాయతి
కరుణకు బాత్రురా బన గుదువులేయని కాలము ననుసరించి మేలము లాడ
విజయు పీదదునకుఁ గన్ను దవిలి యున్నను మున్నట్టు శివ్యరికం దెలియకుండ
నటించును నాయతి నాయతి శుభమ్మేయుమునడిగి తనకు మగడౌనఁడగు
నోయని యుడుగక తనకు మేనత్త కుమారుడు నతియగునా సెలవాఁడగునా
యని మెత్తమెత్తగ గడునడి నడిగి తెలిసికొని యర్జునుండు నరుండగునని
యాక్షమముగ నాయతి నడునిన నినియు నినని దానివలె ముసిముసి నగవుల
నామాటలు గిటునఁ బుచ్చును సాముద్రికము చూడుడని తన చేయయ్యతి
కిచ్చి చూపించిన నిదియగు శుభలగ్న మని యాయతి యామెచేయి బట్టుకొని
నీ మనంబున గల వాఁడిప్పుడ నీచేయిఁ బట్టెనని మాచనగాఁ దాని
యాపార్థుండని చూచాయగా నతండు దెలుప నీయతికి నామతి యిచ్చి
తాటేలనైతిఁ గదాయని యాతని మెలంగకయ నీలిని దొలంగ బోనా యన
నీచేత నీమతి చిక్కియుండ నెటు తొలంగి పోయెదో యదురాజ పుత్రి
పోపోకుమని యాకుహనా భిక్షువు సుభద్రను మెన్నాడి కూడంబోన సముత్సుకున
జట్టుపక్ష్కులవారందరు వారల నిర్భర సాహాద్దంపతులుగ నీవొవు మండి

యాయతి పార్థుండని దేవకీ వసుదేవులకు సత్యారుక్మిణులకు హరివంశ బూర్తిగా సుభద్రకు స్వామిభవము వలన నమునగాను తెలిసి పాణిగ్రహణము కించి సూర్యావంబుగ నటుకు మున్నె సర్వవిధముల నిర్ణీత ప్రాయమైయుండె సుభద్రా పార్థులన్యోన్యరాగంబులు గూఢంబులు గాఢంబుగా నరాగములు గూఢములుగా తగిలి యొండొరులు వరగడియ యేవి విడియుండలేక బాలిచి గొన్ని పోలిందేలు చుండిరి.' కవ్వడి యెవ్వరికిఁ దెలియకుండ మౌనవ్రతంబుదాల్చికొని దొంగనాకట మంచము వేసికొన్నట్లు వేచియుండె. వాసుదేవుండెరుంగ నట్లు బలభద్రాదులతో గలిసిమెలిసి యుండియు మునలికి దెలిసిన చెవలికగా సుయోధనునకు సుభద్ర నిప్పింప దలంచి యుంటనే సవ్యసాచి కిప్పింప నీక యుద్ధము గొట్టు నన్న తలంపెఱింగి హలికి హరి తెలియ నీయక యుండె. ఇటులుండ వర్షించు వాఁడు తన వాఁడైన గదబంటిని గూర్చుండు మన్నట్లుల ఘటనా ఘటన సమర్థుండగు శ్రీగోపాలదేవుండు తనపట్టునఁ గలండని నూనులు నూనెయు నొకటి తెలివిగలవాడె వెలికిబోవువాడు కదాయని యావధూవరులు తటేవేచియుండి కొండొకనాడు వారిరువురు రైవతక గిరిపై గ్రామదేవతకు జరుగు జాతర గమంగొందము వెనంబున వరుదారు నరదంబు నధిరోహించి కరినగరికిం బోవుచుండ యాదవులు వారవులిదెయాదిఁ గొని హరిప్రేరణంబున దమ కన్నియ కన్నియు బోధించి పార్థుండామె నెత్తికొని పోవుచున్నాడని యాదవులు నాకురు నీరు వెన్నవిలి యాను సుభద్రముగ విడి యా సుభద్రను విడుచు నట్లు పెట్టిపోనియెడ నిమ్నమాశరముల పాలొనరించెదము. నీవు నరుండవైన నేను హరుండనైన నేమని బెదిరించి శరజాలంబుల విడిన నామధ్యమ పాండవుఁడవలీల వారల నెల్ల నోడించి నోనాడ నేసిన సుభద్ర సారథ్యంబున వారల నెల్ల వెనుకఁ బట్టించి తన కరిపురంబు తెరువుఁ బటించి రథారూఢులై వధూవరులు పోసాగిరంతట నిర్జితులైన యాదవులు ద్వారకకుంజేరి యాదవేంద్రునకు దద్వృత్తాంత మంతయు నివేదించిన శౌరి పీతాంబరాది వ్యజనంబులతో నర్జును పోకకు నగవంబని లేదనియు మన పైతృష్వసేయుడు తన మాతుల పుత్రుంగొనిపోవ నతండు తగడే తల్లి దండ్రులు సమ్మతించి యిడకున్నందునయ సుభద్రనతడేల కొంపోవు వారల యభిమత మెట్టిదో తెలిసి కొనక యతని వెనుకన బోవుట మీది తప్పిదము గాదె యావుండ దూడయుండ గుంజనఱచునే కాన నాతని

వట్ల విద్వేష ముడుగుండని శౌరినివారించి యోదార్చిన విని యంతట
బలభద్రాదులు శోక విడిచిరి. సుభద్రార్జునులు కలిసియు ప్రయాణంబుల
హస్తి నగరంబు దరిసి సుభద్రను ముందు గోపికవేషద్రౌపద్యాద్యంతఃపుర
స్త్రీల మనస్సులు సమాహితంబులు గావించి సభార్యుండై సభార్యులైన
ఫల్గునుండు పురంబు ప్రవేశించి యందు స్వస్థ చిత్తముతో నుండ నింతలో
హలి హరి సాత్యకి ప్రముఖ యాదవ వరులు దేవకీ వసుదేవ సహితమ్ముగా
హరణమ్ములు సంపూర్ణముగా గొని తెచ్చి వధూవరుల కాప్యాయనమ్ముగా
నొసంగి సుభద్రార్జునులు క్షీర నీర న్యాయంబున నుండగఁ గనుల పండువగా
గాంచి కతిపయ వాసంబు లచ్చట నుచ్చటదీర వసించి యింపుగ
సంపదములంది తక్కిన వారలందఱు స్వపురంబున కరిగి సుఖంబుండిరంత
కృష్ణుండు పార్థుతోఁగూడ నింద్రప్రస్థ పురంబున నుండె నంత కొంత
కాలంబునకు.

154

గీ. భద్రమతి సవ్యసాచి సుభద్రయందు
మన్యుఘాతారి ఘనునభిమన్యు మాన్యుఁ
గనియె సుతు హితు విధు వంశకరుని ధరణి
మరుని నెగులొని సేయు సమరు వరాంగు 155

ఉ. ద్రౌపది యందుఁబాండవులుదారుల ధీరులఁ జారు మూర్తులన్
బ్రాపున గ ంచి రేవున నృపాలురు బాలుర నేవు రేవురన్
జాన శరంబులందెదురఁ జాలఁడు వారిని జామదగ్న్యుఁడు
ద్దీపిత లాజి నయ్యలకు దీటుగ వచ్చును ద్రచ్చి చూచినన్ 156

గీ. మౌని కులపతు లతులముగ
శౌనక ముఖమునులు దీర్ఘ సత్రము సేయున్
బూని యహర్నిశ మాజ్యం
బానఁగ మందాగ్ని బడియె నగ్నికి నై 157

క. వివిధ మహౌరధి గాన భు
వివిధము ఖాండవము దగల బెట్టింపుఁడు తీ

ఏ విధాత్మ జాడ్య మడుగ జ
ఏ విధము వేడగదగ్గి విని వృష్ణినరుల్ 158

క. ఖాండవము దహమవే నా
ఖండ లురవ మాగి వారు గాల్పింపంగా
మెండుగ సకలోద్దేశము
మండి యడఁగె మిగుల దొకటి మందున్నైనన్ 159

గీ. అశ్వ సేనాహ్వయంబను నహియొకండు
తల్లి తోఁగూడ నందుండి తలఁగఁ జూడఁ
గ్రీడి వోపీక యాగినఁ గిలికెఱుగ
మరగి కఱఁగెను బగబట్టి యురగ మరిగె 160

క. అయురగ మరిగి మరిగియు
యాయుశ్శేషంబు కలిమి నలవడి రాధే
యాయుధముగ మృధమున విజ
యాయువుఁగొన మండి తాని హతమయ్యె సుమా 161

వ. ఆవిధబంతయుఁ గర్ణార్జునుల ప్రధనంబు వల్ల తన్నిధనంబు తీరు తెల్లమిగ తెలియనగు 162

వ. అంత ధర్మరాజా రెండవ యమ ధర్మరాజం బోలె నింద్రప్రస్థ పురంబున ననుజ తనుజ తరుణీ సహితమ్ముగ హితముగఁ దమ్ముగని జనమ్ము సంతసిల్ల నెంతనమున నివసించి గొప్ప రాజా శిల్లఁ దటిదప్పకుండఁ దప్పక లూరి యప్పనమ్ములుగఁ గప్పమ్ము లప్పమ్ములప్పనసేసి యరిగాపులై వఖముఖముల నుండి వచ్చువచ్చు బళ్ళు బల్ల కొలంది కొలంది యుదరాకుండ రాఁగ వాగ తురగ రథపదాతి చతురంగ బలమ్ములతోఁ దమ్ములు నలువురు నలుదిక్కులకు వెడలి దండయాత్ర సేసి దిగ్విజయమొనర్చిఁ తెచ్చిన కానుకలు కవకవు రాసులు మానక వచ్చి తండోప తండంబులై మెండుకొని యుంటవిండుకొని యుండె, వివిధసమృద్ధి నవపెరధులు గల కుభేరుతోఁ దులదూగుచుండి యుధిష్ఠిరుండు తాఁబెట్టినది భిక్షగఁదా బట్టినది రక్షగదానన్నది కక్షగదా బట్టినది

బంగారముగాను బెట్టినది పింగారముగ మూరెల మట్టములు పేరి తమ్ములిమి
కెలమి పెందలాట్ల మరభిత్సు దైవందివాళి వృద్ధిగ మూని బృంద
మయుల్నాగలా భాగ్యతులై విందులఁ దవియఁ బరమ భాగవ తోత్త
ముఁడవిపించుకొని గోవిందుని కృపపైఁ బాలు పక్ష పేలబాకు పిముదమత
సకల ప్రాణి కోటియు విరహాయముగు పతని పరిపాలనమునఁ గలిగిన హాటుని
వేయునోళ్లబొగడ వెగడి విలుగు తలుగు లేని మూర్ధన్య పదవి యొదవి
తనయందుఁ బ్రజలు ప్రజలు యందుఁ దాను పెట్టుండవలయునో యట్ల
యుండి పరప్పరాను రాగంబు నన్యోన్య ప్రేమయు, మఖప్రదముగాను రాజన్య
జనక భావసాజన్యమునకు కొఁజనక యూపాజన్యము స్వామి భావ
సంబంధములతో నెయ్యముగ వియ్యమొంద నొకనాడు ధర్మరాజు విందు
వళదీర్పి యుండ బుద్ధి విశారదుండును దమరుని విద్ధితశారద నారదుండునగు
నారదుండరుదెంచి సర్వలోకపాల సభలనందు వసించు రాజులను దెల్పి
పాండురాజునకు శ్రేయోదాయకముగా రాజసూయ యాగమ్మొనరింపు మని
ప్రేరేపించ విని యావ్యాపారము భవ్యాపారమ్ముగ గొని శ్రీకృష్ణదేవునికి
వినిపించిన నమ్మహామహుండు హర్షించి

163

చ. ధర్మజతోడఁ గృష్ణుఁడని దర్పముఁబొంది సమస్తరాజులన్
ధర్మము రాజసూయము నొనర్చుట యుక్తము గృష్ణమాన్యమున్
మర్మము విప్పి చెప్పెదను మాగధుఁడుం బెదురింతలేక దు
ష్కర్మఁధర్మఁదూరణ కర్మకుఁడంచును పేరుమ్రోగెడిన్ 164

మ. యశముప్పొంగ వానికిం గుడిభుజంబై పూని తప్పేనలన్
శిశుపాలుండును పాలమ్మొనరుచున్ జీతమ్ము భత్యమ్ముతే
కశవార్థమ్ముగ వచ్చి వానిదయకై యందుంద్రు సేనాధిపుల్
పశులై మంత్రులుగాఁగ హంసడిబికుల్ వర్తింతురే కోదయున్ 165

ఉ. హంసుడు వాని తమ్ముఁడు డిభాగ్రణులై యొకనాఁడు వారుపై
కంసులు లొక్కి పెట్టుగనియున్ గని మన్నియుపాయ మాజితో
హంసుఁడు చచ్చె నచ్చటకు వార్తయి మోడిచికుండ నమ్మి న్వ
ధ్వంస మొనర్చి కొంవడఁగె వార్ధి పడంబడి చచ్చె హంసుడున్ 166

ఉ. చేయఁగలట్టి ప్రెగ్గడలు చెల్లిన చెల్లి. జరాతనూజుఁడున్
గాయముఁ దిన్న బెబ్బులియు గాయము జబ్బయుతెక్కలెక్కుటన్
బోయిన పెక్కి కోరలుడిపోయిన సర్పముఁబోలుచు న్మృత
ప్రాయుఁడుగా సహింపఁజలపట్టితమేని పుడోడు వాఁడనిన్ 167

గీ. పేర్చి బార్హద్రథిం దెగటార్చి తేని
యరయ నెఱవేఱు రాజసూయమ్ము యమ్మ
గాన క్రీడిని భీము వేగాన నాదు
తోడఁ బంపు జరాసంధుతోడఁ బోర 168

మ. అన శల్యారియవె న్యదుప్రవరుతో నయ్యాహరి మాకు నా
యనువుం దల్లిని దిక్కుప్రముక్కువెలి వియ్యంబొజ్జవువ్వెజ్జపి
మనే నాసను సంగఁదమ్ములను మాకత్యై సమల్గార్యమున్
మనసం గర్తవు గానఁ జిత్తము బడిన్భావించి తావింపవే 169

వ. అనుడు శ్రీకృష్ణ జిష్ణు పావనులు పావన స్నాతక విప్ర వేష ధారులై యత్యంత
సంతోషమ్మునఁ గదలి
170

ఉ. ఆవ్వన లేచి మువ్వురు గిరివ్రజ మన్పుర మేగి మాగధున్
జివ్వకుఁబిల్వ వాఁడును నిశీధిని బారుల కేల విప్రవాఁ
గవ్వడి వాఁడు విప్రులను గాము వృకోదరుఁడీత డే హరిన్
దవ్వులనుండి వచ్చితిమి దాయవు నన్నిఁ బట్టి చూడగన్ 171

వ. అవియిట్లు యదువుంగవుండు తమ విజ్ఞప్తి యున్నది యున్నయట్లు తెల్పి
గొల్పుగొనుమతిఁ బోరికి వాయితమ్ము గమ్ము తెమ్మనుటయు
172

చ. అనవిని యాబృహద్రథజుఁడాజ్యము వేల్చిన కేలి పోలికన్
గనగన మండి లేచి విరకాలము మండియు వేచియున్న నా
కనువుగ మల్లయుద్ధమిది దబ్బిన భాగ్యము కల్మినంచు నం
దనువకుఁ గట్టి పట్టమును దాఁదగ దాతెను భీము నామునన్ 173

సీ. పడి జరాసంధుతో పడముడి పిడిగ్రుద్దు
లాటకుదిగి చేతి తీట దీఱ
వితఁడాతనిని వాఁతఁడితని నాతతముగ
వోలి నేలను బెట్టి కాలఁజములు
నిట్లు పోరి రొకింత హెచ్చు తగ్గులు లేక
యెట్టకేలకు భీముడెప్పి దాయ
మెడబట్టి నేలపై బడవెట్టి దాకాలఁ
బెడ కొత్తి పెఱకాలఁ బెనయ బట్టి

ఆ.వె. క్రమ్మి పచ్చిలాటకమ్ము చీల్చిన మాడ్కిఁ
జేత మాగధీశుఁ జీల్చివైవ
రెండు పచ్చెములు నొక్కొండు గాఁగలియును
నెప్పటట్ల వచ్చి యెదిరి నెదురు 174

క. దానికి వెఱపడి శతశత
దాని బలుండడుగఁ దద్వధ విధము సెప్పెన్
దా నీరజాక్షుఁడతఁదరిఁ
బోనడఁచెను వ్యత్యయముగఁ బొదిగి తునియలన్ 175

క. ఇటులా కుటిలాత్ముని హరి
పటు విక్రము డనిల సుతుని బాహుల కెఱగా
ఘటియించి రాజకోటికిఁ
దటుకునఁ జెఱయుడిపి యరిగె ధర్మజు కడకున్ 176

బంధురవృత్తము:
అనుదినమునుగనియును మఱిఁగనఁగా
నానలు గొల్పెడు శిల్పములున్
గనుగొను జనులకు బడలికలడఁగన్
గ్రాలు కెలంకులలంకృతులన్

మనమున కెమ్ముగ నొనరిచి మయుడు
　　నొమ్మనుగ దానమాన సభన్
ఘనమణి రుచుల శమన తనయునకున్
　　గమ్మల పండువుగా నొసఁగెన్ 177

ఉ. ఆసభయందు ధర్మజుడు నాసభయంబున బెల్లరాజు లా
యా సదుపాయవాలు జనులొసనఁజేసెను రాజ సూయమా
యాసము వాసి వ్యాసముఖులశ్లీ ముఖంబెటఁ గానమంచవన్
నాసము ద్రేలువెట్టికొని నాలుకమంగొఱుకంగఁ జూపటుల్ 178

సుగంధి

రాజసూయ మందు ధర్మరాజు భీష్మవానతిన్
బూజసేసెఁ గృష్ణు సర్వపూజనీయు దానికిన్
రాఁజి యోము మండి చేదిరాజు నిందసేయఁగా
దేజు మీఱఁ జక్రధార ద్రెంచె శౌరి వైద్యునిన్ 179

వ అట్టి రాజసూయ మహాధ్వరంబున రాజరాజగు దుర్యోధనుండు దానధర్మాదులు సేయఁ బెత్తనంబు వహించి మహింగల ధనమంతయు యుధిష్ఠిరునింట జేరెనని యడిగిన వారి కడిగినట్లు లొసంగుచుఁబొగుగింట జూపరా నాపెద్ద చెయ్యి యున్నట్లు ద్రవ్యంబెల్ల రెండు చేతులంగొల్లవెట్టుచుండి మయనిర్మితమైన యాసభాస్థలి చిత్రవిచిత్రంబులు గనుంగొను వాడై సుయోధనుండందొక నాఁడు తిరుగు చుండి యేపు మీఱు మయు శిల్పనైపుణంబు బెఱవారు వెఱవాద వెప్పుడుగన్నను సజలప్రదేశంబుల జలంబుగనను నిర్జలములు సజలములుగ సద్వారము లద్వారములుగ నద్వారములు సద్వారములుగ సమతలములు విషమతలములుగ, విషమతలములు సమతలములుగ గానంబడుంగాన నాగాంధారేయుండు శిల్పదిదృక్షా భారదారేయుండై చెప్పనలవిగాని యాగొప్ప సభయందలి విచిత్రములుతప్పవేయక కనుగొనుచు సందుగొందులు తిరిగి వెఱగందుచు దానియందము చూచిన కొలంది వింకచూడముచ్చటగనుంటనమందానంద మంది ముందు గనియెద గాక యని యప్పటికి తిరిగి చనుచునొక

విశ్వలతలముగని పేరెగఁ దట్టైన దట్టంపి బిగఁగట్టి కచ్చుబట్ట నెగబెట్టుకొని
నజల నిరాకరముగనెమ్మెట్టువేల యని తత్తరముగ నడిచి కుత్తికబంటి నీటంబడి
బుటుకలు వేసి గుటకలు మ్రింగి తడబడుచు దడిబట్టలు పిడిచికొని యొడలు
తుడుచుకొనుచు నొకకోగోడ లేదనుకొని వాటముగ నడిచి కవాట మడిచికొని
మనలు నెడ నొసలు బొప్పిగట్టిన నొప్పి నప్పప్పాయని పాణిని ఫాలతలము
నిమిరికొనుచుమిట్టపల్లములు నొకటిని మతియొకటిగ నెంచి తత్తుపారవు
కారియులను కెందుము నీతండ తండ్రికి కొడుకే కదాయన్నట్టుకే యుద్దేశంబు
గానేరక తన దంతరాళము నుండి ప్రోవి తెలుంగెలుంగ గ్రుడ్డియెద్దు చేనఁబడిన
వడవున దరియుంచు గావక నయుప్పతిప్పలు పడుచుండ బాంచాలీ
వృకోదులందరిన యుండి యతని యవస్థలు గనుగొని యప్పట్టున పట్టరాని
నగవొగని ఫక్కున నవ్వ రారాజున కది చచ్చిన చావై కడు సిగ్గునడిని దాయనని
వీరు నన్నింత వింతగ గేలి సేసిరి గదా వొరయేదాయ బారియలేదాయెఁగదా
యని వానమూని మగఁడు తనను మొత్తినందునకుఁ గాదు సవతి చూచినందున
కవినట్టు యొట్టనో యెట్టకేలకు వెలులాతనికి బదుగుటిలో నగుబాటున
కగ్గమ్మైనిడి వెలిమచ్చులకుఁ బాండవులఁగూడుకొని తోడని పీడికొని యచ్చట
గదలి మెదలకుండ దన కరిపురి కరిగి మలగెడి యుల్లంబుతో తండ్రికడ
కుఁబోయి ప్రణమిల్లి తనపాటును భంగపాటును లోనుగాగల తనమది
నొప్పినంతయు సెప్పి యంగలార్చిన గన్నీరు మున్నీరై కడుపల గొలంది గార
నడలుచున్న తనతనయు నిగతము మూరార్చి ధృతరాష్ట్రుండిట్లనియె
180

గీ. ఎందుకేనిటికీనా యనకానరణియెందుల గండెదు హీమని కరణి
నందియుమును పీడు చాల వైభవము సౌఖ్యమ్ము సోదర సహితమ్ము పొందు
యెందున కెందునకే నీమతమున సేవగించక నొత్తునే పనిక్షైన
బొందుగఁ బియుంగఁ బూనితి నేని పుణ్యమో పామో పూని సేయింతు 181

క. జనకుడు సమ్మత మొదవగఁ
దనకట బరవశము నిచ్చి దయదొలుకాడన్
మనమారఁ గబల్కి గొమఁదు
గొనకొని యనుకొనియె కోర్కి కొనసాగినటుల్ 182

క దుష్ట చతుష్టయ మొకటొడ
విష్టముగా గూరుచుండి యట బాండవులన్
గష్టములఁ గుడిపి రాజ్య
భ్రష్టులుగావింతు మంచు భావింప తఱిన్ 183

వ. దుష్ట చతుష్టయాంతః ప్రవిష్టుండు నిష్టుండు నతుల యుక్తి శాలియు
మాతులుఁడు నగు శకుని యక్ష విద్యా విశారదుండుగాన భాగినేయుఁడగు
గాంధారేయుని కిట్లనియె

184

ఉ శకునిని నక్షవిద్యను విపక్షులన్ గెలువంగ నేర్పునే
మ్మికముగ నేరులేరు హనుమంతుని ముందర కుప్పిగంతులా
ప్రకటపు జూజ మేర్పరుప పార్థుల గెల్చి తదీయ వైభవం
బొక నలుసైన వీడకిటు లోర్చి దనివ్వ దనీకు సర్వమున్ 185

క అనిన విని వోలు నని త
క్కిన వారలు సమ్మతింప గితవ సుబలజుం
డనువుగ ధృతరాష్ట్రునకు వ
వినయముగాఁ జెప్పె మతులు విఱుగన్ నతఁడున్ 186

వ విదురునిఁబిల్చి ధర్మజుని పిడక యాడకు రాగ నక్షో విదు రుచిపుట్టఁ జెప్పి
మనవేడ్కను దోడ్కొని రమ్మటంచు భా విదురువ లబ్ధికైవనున వేవని యాతఁడు
ధర్మరాజు నీ విదురుని శ్రేష్ఠ మూనకు ముపాన మటంచు జెప్పి తెచ్చినన్
ధర్మరాజు శకునితో జూదమాడంగ వంగిన భీష్మాది కురు వృద్ధులు వలదుడుగు
మని చెప్పి చెప్పి వేసారి కట్టకడ కిట్లనిరి

187

పంచపాది:

ముడి విడి చూడు మూవరకు మూలము జూజము తొల్లి నైషధుడు
దుడుగక యాడి ద్వాపరుని కోడి చనెన్ తన కట్టు బట్టతో
విడువఁడె బట్ట బోకుమని పెద్దలు బుద్ధు లెన్ని చెప్పినన్
విడువక యాడి యాశకుని పిక్కిలలోఁబడి ధర్మజుండు తా

పవనుడి తోపుగా దనుజ వర్గము దుర్గము వాలిపోదిగా 188

ఉ. పోవిధిఁ బాండవాగ్రజుఁడు నెల్ల పణంబుల మోటు వోవుడున్
తీవిని దుస్ససేనుడు వడిన్‌జని యంతిపురంబు లోనికిన్
ద్రౌపది నీడ్చి తెచ్చి సభయూత బహిష్టను తాకఁబోకుమఁ
యొ్య వలదంచు కృష్ణయన నాగక యూడిచె నామె పుట్టమున్ 189

క. ఆమె పతివ్రత గావున
నేమనిఁ దలఁచెనొ మదిన్రమేశుని గృష్ణ
స్వామి కరుణారసమ్మున
నామహిళకు వల్వ లక్షయములయ్యె మెయిన్ 190

ఆ.వె. లేగి విప్పి విప్పి తెక్కలు వడి దుస్స
సేనుఁ దూరకుండె సిగ్గు గలచి -
వనిత నాదు తొడను వచ్చి కూర్చుండుమ
టంచుఁ గౌరవేశుడవహసించె 191

చ. పడిముడి పల్కి బాములుకుఁ బట్టగఁ జాలని యుల్క దృష్టిలో
నుడుకుచు దుస్ససేనుగని యొట్టిడి నో వదియించి నీ యురం
బడఁరగ వచ్చి రక్తమును వానెదఁబావ సుయోధనున్ వడిన్
దొడలును దెంతు నాగదను దుర్గతి కింజనువాడ దప్పినన్ 192

వ. అని ఇటులత్యాగ్రహంబున పదవుడిన యాపేడిమదుబమ్మదిం దశ ద్వాదశగ్రహపతుల యోగవద్యోష్ణతనహాసింపలయకాలకేలి పోలికననుకరింపఁ బ్రళయ కాల రుద్రుని కోపంబు భీమరూపం బెత్తినట్లు దపింప బెదవులు చలింప నత్యంత రౌద్రాకారుండైన వృకోదరుండు పెట పెట దంతము ల్గొఱుకుచుఁ గన్నులు నురలు విస్ఫులింగంబులింగ లమ్ముల వలె సభవారిపైఁ బడ నహవఱబుఁ దక్షిగహవంబు దరికొన్న దుదరునామొుక్కో యువ నక్కల పాంసనులగు సుయోధనాధుల మీఁద పుఁడిపడి వీక్షించుచు నదిచిన నుడువుల నదువున విని పదముడి తీక్ష్ణప్రఁ బ్రభవ లాఘవంబె నెదుర్చంగల వాఁడని కదువడిఁ గడగడ వడఁకన్ వారా సభయుందొక్కఁడైనఁ గానరాదైరి.

మఱియు నటుకు ముప్పు కృష్ణను గని తటకాపడఁ జెలఁగులక వెఱి తగులమునఁ
దవిలి యుండు ధండిముగఁటిమిగల మగని నిందేరవేవేరికొనుము మగువాయని
కారుణ్యంబున కర్ణుని కఠోర వాగ్ధోరణికి నసాధారణముగు కట్టల్కవొడమి
పుడమి కదింప ఫల్గునుండుతనిఁ ద్రుంప నపుడె తెంపు సేయ సమకట్టియుఁ
దమకింపక తమకింపక సహనంబు సేయుట శుభావహారి బగుసేఁత
యనియుఁ దగుసేఁత యనియు నప్పట్టున సమయము తప్పవచ్చు ననియుఁ
దనయున్న మూలమున వచ్చిన పొచ్చెమునకు గడువొచ్చి కొనుచున్న భీభత్సుండు
భీభత్సరసము మొగమున వ్రేలాడ నెదిరి భర్త్సనఁ జేయుచు నిట్లనియె 193

పలువగ నాఁడు పుట్టనెడి పాడివి పీడిత సాధ్వి ద్రౌపదిన్
బలువగ వేఱె యొండువతి బల్లిదు నీసభఁ గోరుకొమ్మనాఁ
బలికిన పాపికర్ణుఁదల బాణ హతిందును మాడి యాజికిన్
బలి యిడువాఁడ నవ్వనికిఁ బాసితనే నృడు వాడఁ జిష్ణునన్ 194

అని కర్ణకఠోరంబుగా రిపు కర్ణ కఠోరంబుగా నర్జునుఁడు పల్కి
యభ్యర్ణజనంబుల నెల్ల గలయం గనుంగొనుడు హాహాకారం బెత్తి యాసభ
మహార్ణవంబు వగిదిను ల్లోలకల్లోలంబగుట యు నాయార్భటి చెవులార విని
జనుషాంధ నృపాలుండు తనకోడలికి మనః ప్రియంబు సేయం దలంచి 195

భీముని కోపవహ్నికి దపింత్రు విజాత్మజు లిందనమ్ముల
ట్లాము దొలంగి కన్నవియు నంతటి కాటుక పెట్టవేల నిం
తేమిటి కంచు మాను విడిపించుచుఁ గోడలి కామె భర్తలన్
గామిత రాజ్యమిచ్చి విడెఁ గన్నము లోనవి గుట్టినట్లుగన్ 196

సుగంధి
లోఁగి జావు దప్పి కుప్పులొట్ట వోయె నన్నటుల్
ఱోగియయ్యు వొక్కసారి జాజ మాడి ధర్మజుం
డాఁగ కేగె వెండి కౌరవా గ్రజుండు బిల్వఁగా
పేగి మామమాట యంచుఁ జెప్పు బుద్ధి పెద్దలున్ 197

వ. మఱల సముద్యోతంబునకుఁ బిల్వంబడి జద మాడ వెళ్ళఁగొని వచ్చిన యుధిష్ఠిరుంజూచి యుక్షితవుండగు సౌబలుండు హితత ముండుమం బోలె వెలఁగు వీలు వాలుగని బ్రాక్కుచ్చొధవెల్లయిన సిపారి పణంబున గుణహీనములగు కరితురగధనకనక వస్తు వాహనంబు లొడ్డవలయు దుమ్యాని వలు విలువ గలవి గాన వలుదగ దుఃఖకరములు గాన వాని మానివేయుద మని చెప్పి మఱియు 198

చ. శకునియు ధర్మసూతి కిటఁ జంకలు గొట్టుము నోడువారు గొం
కక చని ద్వాదశాబ్దములు గానము మౌనులరీతిమండి యిం
కొక సమయేరికిం దెలియకుండఁ గుండ వలెన్ జరానే
రిక వయువం గనంబడిన రెట్టి శరత్తు లటుండ గానలెన్ 199

వ. అనుటయు 200

గీ. అట్టిద్రైన యొద్దున కనుమతించి
మఱిపెడి యొకింత యొందఱు మంచిఁదలఁచి
చెప్పినను ధర్మజుఁడు పెడచెవిఁబెట్టి
శకునితో జూదమాడెను జడుడు వోలె 201

క. కుటిల మతియైన శకుని క
పటమున మఱి ధర్మరాజు పణ మోటు వడెన్
జటుల సువహోయకుండట
పటు ధర్మాత్ముఁడట పెతకుఁ బాల్పడె నహహా 202

క. అదిగని యాసహదేవుం
దదరి వడుమఁ దోక ద్రొక్కినట్టి ఫణిగతిన్
మదిఁ గొదుమఁ దగని కోపము
గదురన్సభ బెదుర నవుడు గఱముము బలికెన్ 203

క. సకల జనుల్వినుండీ మా
సకలైశ్వర్యమ్ములోడిచి శత్రులకిడు వా

శకుని శకుని సాళ్వము లఘు
శకుని పతీంద్రుంచు వాఁడ జగమోహనఁగన్ 204

వ. ఇట్లు సహదేవుండ సహ మానా ప్రతిమాన ప్రతి నోద్రిక్తుండై పేదిమి నాడిన ఘన రౌద్రోక్తులకు సభాస్తారు లెల్లఁ దల్లడిల్ల జగమ్మతని దగుఁదగు నని పొగడె సదాచారులైన పంచపాండవులు ధార్తరాష్ట్రులకు సదాచారులై యుదారులయ్యు ననపాయమ్మగు న్యాయమ్మునకుఁ గట్టువడి కట్టువుట్టమ్ములు దక్క దక్కంగల భూషణాది రాజ చిహ్నంబు లుజ్జగించి తమపోక కుమ్మలిక నొందు ప్రకృతి జనమ్ముల స్వజనమ్ముల వలె బుజ్జగించి కించి ల్లక్ష నొక్కలకుం బెద్దలకు నెఱిగి నాని దీనవల ఘన భావ వల నంది తోడని వేడుక దయయుంచుమని పేడికొనుచు వీడుకొను విదురాది క్షేమం కరులంగూడి కొనివనారలు గాగలించుకొని తమ్మహితమ్ము చెప్పుకొని కొంత దవ్వనుగమించి విడఁజాలక జాలి విడఁజాలనెవరులు కాన్పించి యొక్కొక్కరేయక్కడ దిగఁ బడుటయుఁ

205

చ. వడివడి బంధుజాల మరిసంచితుడంచితు డుంచి తల్లిన
య్యెడ విదురాలయంబున వసింపఁగ దామట వచ్చునంతకున్
విడువక ధర్మరాజు తనవెంటను దమ్ములు ధౌమ్యులాలురా
నడివికి వెల్వడెంబడి జటాజిన వల్కలములన్ ధరించుచున్ 206

చ. అడవికిఁ దండ్రులేగు నటి నాయభిమన్యుడు ద్రౌపదేయులున్
గడుకొని ద్వారకాపురము కాపురమై హరియుండదండగా
వడి గడివేలు రన్నిట సుభద్రయె పొగక నందయందఱున్
బడలిక యుంటికంటె గుడి భద్రము యున్నటులయ్యె వారికిన్ 207

సుగంధి

ఓలిఁ బాండవేయులు న్సుయోధముండుఁ దండ్రియున్
బాలు పంచి యాక పైఁగ బాధపెట్టె కానికి
ట్లేల పంపు వారొ వీరికింత కింత కల్ల నం
చాం గోలు బాలగోలునయ్యె వాఁడు తప్పుదిన్ 208

# అరణ్య పర్వ కథ

సీ. సాధరంబుగ వెంట సోదరుల్తరుణి రా
    మేదిని పతి కీర్తి మిన్ను ముట్ట
సురసంఘమునకు భూసుర సంఘమునకు మం
    తని విసుగున లేక తనివి గొల్పి
అనగణ్య కథలను ఘన పుణ్య నిధులను
మునులచే వినియును మును కలికి యు
మానినీయుతు సర్వమాన నీయునిఁ గృష్ణ
వల్ల వడుమ గాంచి నతులవించి

గీ. ఘోష యాత్ర నెపమ్మున గ్రూరుడగుచుఁ
గానలోఁబాండవులను నిష్కారణముగ
జెరుపగా వచ్చి గంధర్వు చేఁతను బడిన
వాని దుర్యోధనుని జెఱవాపి పుచ్చె 209

గీ. వాని వరుసలు విడిచి ద్రౌపదిని పదివె
గాఁదలంచుచుఁ జెఱగొని కానలేగు
సైంధవుని బట్టికొనియు దక్షులను దలఁచి
ప్రాణములు గాచి పాండవు ల్పావు విడిరి 210

సీ. దుర్యోధనుడు ఘోర దుర్వాసముని తోడ
    పదివేల శిష్యులు బలిసికొలువ
భుక్త్యనంతర వేళ భోజనంబిడుమంచు
    వచ్చిన శల్యారి పక్షియనుడు
వారలు గంగకు వార్చి రాఁబోయిరిం
    తటఁ బాకమొనరింపఁ దడవు లేమి
భీతిన్మైఁ జేతులు పిసికి కొనుచు కృష్ణ
    యొదవెంచ శ్రీ కృష్ణుడేగు దెంచి

గీ. పాత్ర నంటిన మెతు కఱచేతి గుంటెఁ
కృష్ణు ద్రౌపది చేఁగొని యారగింప
మునికి శిష్యులకును దలమును కలుగుడు
భుక్తి లజ్జవదే పోకపోయెఁదలిసి 211

గీ. పంచపాండవులే కాక యెంచి చూడ
వినుము హరికిని బ్రాణము ల్వేఱ కలవె
యెట్టి యెట్టి మహాపద లెగిరి పోవె
పార్థులకుఁ జీను కుట్టిన పాటిగాక 212

సీ. ఫల్గునుఁడొక పారి ఫాలాక్షు డీకొని
పందికై డీకొన బలిమి గడఁచఁ
గడకస్త్ర శస్త్రముల్మడిసి పోయినఁగ్రీడి
పిడి గ్రుద్దులకు దిగి విడువకున్న
ముక్కంటి వెఱగంది ముక్కుపై వ్రేలిడి
కొంచుఁ బాశుపతమ్ము లంచమిచ్చె
నింద్రుడు కడు మెచ్చియిచ్చె శస్త్రాస్త్రము
లొక కంట కనిపెట్టి యుండి వాని
గీ. ప్రేమ నమరావతికిని రప్పించు కొనియెఁ
గొన్ని నాళ్లకు నూర్వశి కూడఁ దివురఁ
గూడదని త్రోసి తెల్పెనుఁ గొడుకు వరుసఁ
ప్రియమె నతిపొందుకనఁ జితేంద్రియున కెందు 213

క. అందువకు పగచి యూర్వశి
నందనుఁడని వావిగలదె నాకస్త్రీ కీ
పందుము పేడి తమ్మని
కొందలపడ శాపమిచ్చె గోపము కొలఁదిన్ 214

క. ఆశాపము ముందొక సమ
యాశాపాశమున నీ కనాయాసముగాఁ

ప్రాశస్త్యముగాఁ గడచెడు
నీ శాసము లాభమంచు నింద్రుఁడు పల్కెన్ 215

సీ. వడముడి మండి పడి వడిగదవిలో
గడువడిఁ దిరుగుచుఁగడిమి మెఱయ
మేరు ధీరుండయి మీఱు కిమ్మీరుని
జేరి కిమ్మన నీక చీఱి చంపె
గంధ సింధుర యాన కామింపఁ దెచ్చె నా
గంధికం బందని ఘన సుమంబు
తమయింట బ్రాహ్మణోత్తము రీతి భుజియించి
శమనజా నకులుఁబాంచాలి నెత్తి 216

ఆ. కొంచుఁదిన్నయిల్లు గ్రుద్దలించిన యట్టు
అరుగుచున్న యాజటా సురాఖ్య
బిట్టు జంపె గొంతు బిసికి వెల్వడి వచ్చె
వాహనమ్ము మ్రింగ సాహసమున 217

క. బృహదశ్వుడు రోమశుఁడును
మహనీయులు వ్యాసమౌని మార్కండేయుం
డు హితంబుగఁ గనవచ్చి న
మహితంబగు కథలు చెప్ప మహిపతి యలరెన్ 218

గీ. చేత మలరంగ గడిమాయ జేయఁజేసి
ప్రీతిగాఁ గృష్ణ షడ్రసోపేతము గను
వేడ్క వడ్డింపఁ బదివేల ద్విజులు దినముఁ
బంక్తి భుజియింప నలరిరి పాండు సుతులు 219

క. ఈ విధమునఁ బాండవులకు
భావింప వరణ్య వసతి పన్రెండేండ్లున్
దీవిఁ బది రెండు దినములు
గా వెళ్ళెను జనులు మునులు గారవ పఱుపన్ 220

సీ. వనవాస దినములు వడిసి పోయెడు తఱి
    ధరణి దేవుఁడొకండు ధర్మజుఁగని
హరిణి యొక్కటి తనయరణిని హరియించెఁ
    దెప్పింపుమని వేడ దప్పరముగఁ
బంచపాండవులేగి పఱువఁద్రోలఁగ లేఁడి
    వశ్యముగాక యదృశ్యమగుడు
నన్నదమ్ములు దాని వెన్నాడి యలసి ద
    ప్పని జెంది నీరార్థమనువ నన్న
ఆ. నకులుఁడేగు దెంచి నళినాకరము నీరు
ద్రాగఁబోఁగ యక్షుఁడాఁగు మన్న
వినక యింతటి లోన మునిగిపోయెడి దేమి
యమును నీరమాని యతడు వడియె 221

సీ. అన్న యెంతటికి రాకున్న గ్రన్నన సహ
    దేవుడేగియు నట్లెఁద్రెళ్ళుట యును
బెండ్లికై మత్స్యాల బిల్వఁబోయిన వాఁడు
    రాఁడాయె మళ్ళ తోరణము దాఁక
నన్న సామెత గాఁగ నన్న లర్జున భీము
    లేగి వొక్కఁడొకఁడే యొరిగి రరిగి
కట్టకడ కుఁబోయి కౌంతేయ వర్యుండు
    తనయనుజన్ముల దశకు వడలి
యేల వీరలిట్లు నేలపై కొరిగిరి
    కారణంబు లేని మారణంబు
కలహమైన జాడ కానరిదిచ్చోట
    దైవ మేల వీరిఁదన్నెఁ జావె 222

సీ. ఆన నేమాయె నేమైన నీమాయను
    వలిలమాని యొకింత చక్కఁబెట్టు

కొనువాఁడ నని రాజు కొలువిలోనికి దిగఁ
బోఁటోఁకు ధర్మాత్మ పొసఁగ నాదు
ప్రశ్నములకు నుత్తరము లిచ్చి నీరాను-
మటుగాక త్రావెదే ననుజులట్టు
లరుగు వాఁడనుచు నశరీరి వాక్రువ్వ,
వాతఁడంతవ విల్చి యడుగుమన్న
గీ. యక్షుఁడడిగెను ప్రశ్నమ్ముల సదృశమ్ము
లంత టింతటి వానికి నవగతమ్ము
చేయఁ గోరుకుడు వడసి విశేషములుగ
నన్నిటికి నుత్తరమ్ముల నతఁడొసంగె 223

సీ. అందుపకును యక్షుఁడంది యానందమ్ము
ధర్మరాజనకొని ధర్మరాజ
నీ యుత్తరములకు నాయుల్లముప్పొంగె
నీ తమ్ములం దొకనిని వరింపు
మిత్తు నావకులుని నిమ్మన్న నగి భూత
మిట్లేల దుర్భలు నేరికొంటి
ననఁగ నాతల్లికి మనఁగ నేనొక్కండ
వాని తల్లికొకండు వలదె చెపుము
ఆ. యన్న సంతసిల్లి యన్న నీదగు ధర్మ
గుణమునకును మెచ్చుకొంటి ననుచుఁ
దమ్ములందఱను ముదమ్మునలబ్ధ జీ
వితులఁ జేసె యక్షుఁ డతుల కరుణ 224

వ. ఇట్లు భీమార్జున నకుల సహదేవుల లబ్ధ జీవులై బడలి యొడలెఱుంగక నిదురగదిరి పండి కొంత వడికిఁ దెలివి పొరలి యదిరిపడి లేచి నట్లుల్ల సిల్లిరంత

225

క. ఆయన యరనిమునములో
నాయన వరతా నుకంప యముఁడై నుతు నీ

వా యువటువ గను వేడుక
వాయున వచ్చితి వటంచు నవ్వుచుఁ బల్కెన్ 226

శా. పారం బారయ దూరమైన వనవాసం బనాయాసమై
యీరాజ ద్భువనేశ నోయనఁగ మీకీ ద్వాదశాబ్దంబులున్
దీరెన్ ద్వాదశ వాసరంబులు వలెన్ దెల్పన్మనుల్నిత్యము
శ్రీరామ స్మరణైషధేద్ధహ సతాశిద్యాది చారిత్రముల్ 227

తే. వరవి నజ్ఞాతవాస వాసరము లరుగు
తెలుఁగు నెలుగంగ గానలోఁది విరిదుఅలి
యరణి హరియించి మిమ్ముల హరిణి కరణి
బఱచి నాడను దయఁగనఁబఱచినాడ 228

క. అనుటయుఁ గౌంతేయాగ్రణి
తన జనకున కెఱఁగి భక్తిఁదమ్ములుఁదానున్
విని యొక కలగవేఁగునె
కనుఁడీ కడతేఱు నట్టి గతి మాకనినన్ 229

వ. ఆధర్మ దేవత ధర్మరాజున కిట్లనియె 230

లయవిభాతి:
తనయ విను నీనడత మనమునకు నెక్కె విఁక
ఘనముగను గాంచెదరు కనుకవి శుభంబుల్
మనియెదరు సౌఖ్యముఁ గని యెదర ధిక్యనొక
ఘనపురిని మన్కిఁ గని జనములు నుతింపన్
గనుఁగొనఁగ లేరు మిము మనమనుజు లేరు నటు
లనువుగను జేరువర తమువులమ బేరుల్
వెనఁకువను వైరులను జెనకి మరుమాడి జయ
మును జగమును లౌనవగఁ గని యెదురువత్సా 231

వ. అనియిటు పాండవాగ్రణికి నాయున వాయున గానఁదోప దీ
వన లరణి న్వరమ్ములిడి వారికి వారకదృశ్యుఁడై చనం

గ నుటజమేగి వారల ఆకారికీఁగన్నులు వచ్చినట్లు
దెనరువఁ దెచ్చియిచ్చి రరణిద్వయ విప్రున కింది దీవనల్ 232

చ. పితృపతి పేషనో యరణి విప్రు నపేషనొగాక యీ జగ
త్పతి యదుభర్త శిక్షనో శుభంబుల భంగురమైన యట్టులా
కృతు లిటమండి వచ్చెనొ ముగింప నరణ్యని వాస మబ్బ
కృతులకు వారివారికిని గేవలమ్మర్థములైన యాకృతుల్ 233

క. జన్యమ్ముల స్థిరుండని
మాన్యతమ యుధిష్ఠిరాఖ్య మహిఁబడసిన రా
జన్యశ్రేష్ఠున కలవడె
సన్న్యాసికి నర్హమైన సవరణ లెల్లన్ 234

క. నలపాక భీమపాకము
లల రారెడు సుప్రసిద్ధి మవనీస్థలి లో
నలవల్లన సుగుణంబులు
వలరె వృకోదరుని యందు నద్భుత శయ్యన్ 235

గీ. సర్వలోకోత్తరుండైన సవ్యసాచి
కూర్వశీ శాపకృతముగా మర్వి షండ
రూప మింద్రుని దీవన ప్రావు కతన
వల్ల భోగ్యమ్ముగా నపుడానహిల్లె 236

క సతతము నా నత్యులు సుత
తతి కగదంకారులగుటఁ దక్షులవశ్యం
పితురాహార మవెడి నుడి
గతి హయవశు వైద్యములకు ఘనులైరందున్ 237

క. ఆరయఁదలవని దలఁపుగ
వారీమణి ద్రుపదరాజ నందన కలరెన్
సైరంధ్రీ రూపంబును
బేరిమి మాలిని యటంచుఁ బేరునొకటియున్ 238

క. ఆయా రూపము లాగలి
నాయె బహిర్గతము గాక యనవాప్తముక్తి
బాయక వారలను న
ర్గాయుక్తి పృథాసుతుందు నర్గములువలెన్ 239

వ. ఇట్లజ్ఞాతవాసకాలమున కనురూపంబులుల్చివడి యయ్యాఖ్యెర యదావ
పాళ్లి తెలియ వచ్చునంతవరకు బహిర్గతము గాక యనువర్గ ప్రయోగమునకు
బూర్వము దాతువుల యందు ననిహితర్గములై యుండొండొక యర్థాంతరముల
నతినుండ బాండవులు పరిజన సహితులై సహితులై చని తీయనరిజనుల
నరిపరోప వర్తనముల కనిచి ధౌమ్యుల నగ్ని హోత్ర పురస్సరమ్ముగా ద్రుప
ద్రుపద నృపతి పురమున కనిపి యెవ్వరేని మాష్టిలిగతుల నడిగిన నడుగిడ
నెడలేక పీనులు దూరని చిట్టడవిం గాకులు దూరని కాఱడవింబడి యెయ్యెడ
నడిఁగి రో పాండవుల యడపొడ గానరామి కతంబునని గదా మేమేకతము
మరలి వచ్చితిమి వారుమని మఱలవచ్చి మనల మఱలఁగను గొనిన పిదపగదా
మనవారని వారని ప్రేమ వారిని మనము పిలువుపిలగువని యమఁడీ యీనుడి
మఱవక మరియొక తెఱఁగున మఱచియై పీ నొండె వెఱచియైన నొండెఁదఱవ
ఁబోకుఁడీ యని కఱపి పుచ్చి యుధిష్ఠిరాది పాండవులు తెలిపిగని సహచరీసమ్మ
తై దుస్సహ నిష్ట పరిష్కమగు సమ్మత్స్యనగరమందు నా వత్సరం బుత్సవముగ
నుందమని డెందమున నందరు గుదిర్చికొని కొందలము దిగఁద్రావి యా
త్రోవగొని పాదచారులై వడవిబడి విడివడి నరుగుచున్నంతఎన్నండు
వెండకన్నెఱుగ కెన్నఁగఁదిన్నఁగ బోతుటేగయు వన్న చౌఱన్నశింపదని
యంతిపురంబున మండి నట్టి యాయమ్మల మిన్న కృష్ణ గనానంతము నిధి
తప్పఁ జూచుటన్ పాన్నారి పాదచారి యయి పోవుమ నాకటదప్పఁ దూలుచున్
240

క ద్రోవది యవెఁగడు దప్పిలిఁ
ద్రోవదిటం బడఁగ నాకుఁదాఁటి మెదడి నో
లా వడుగామడ యాయెను
బోవలసిన యూరువెందుఁ బోయెనో యేమో 241

వ. అవివిని ధర్మరాజతి దయన్ వతిగొండొక కొంతదవ్వు వా
ముసు గవలామెఁ గొంత తజి మోసియు వేలగిలంబడంగు
ర్జునుఁడు నిజాంప పిరిఁగను జూపె యిదంగల మేరమారుచున్
చిన దనుకవ్ మదివ్ దొనక చేడియునుం దయద్రెప్పి దింవగా 242

క. ఇది గోపుర మదిగోపుర
మిదియదె ఋషి వచ్చినారమే వామడ లిం
కెడి బుద్ధి చేసియుంతయుఁ
బదిచె నడుగు దీసి యడుగు బెట్టం జాలన్ 243

గీ. వారలందఱు నొకచోట జేరిచేరి
తీరి మఱుఁగునఁగూర్చుండి యేరికోరి
యొండొరులఁ బాఱ చూచుచు నుచితభంగి
నంత గర్తవ్యమిద మిశ్లమమఁచు ఁగనుచు 244

వ. అజ్ఞాతవాస వాసరంబుల యందు జ్ఞాతరాజసేవా ధర్ము లగు ధర్మరాజునకు నాతని తమ్ములకును గొమ్మకు మద ద్రీతివి నీతివి లోకోక్తులతో గూర్చిపేర్చి తెల్పువాడె ధౌమ్యుండు తనయెుర్ధ గూర్చుండఁ బెట్టుకొని వారల కు నూరిపోయువాడై యిట్లనియె

245

ఉత్సాహ
ఊరఁ జేరియుండు తఱిని నోర్పు నేర్పు గూర్పుఁ డన్
నోరు మీరరాదు పెఱల నొచ్చి యేని మెచ్చి యున్
గోరి తొమ్మువిగిది పల్కు కూడదెట్టి పట్టునన్
పూరిపుల్ల యేని వారల భూతి దాఁక బోకుడి 246

ఉత్సాహ
అంత కంతహ పెఱల యంతిపురములోవి కే
కాంతమందు హాస్యలనము నందగూడ దేయెడన్

కింత భర్తలేని తఱిని స్త్రీల తోడ బ్రాతయున్
మంతనమ్ము లాడఁదగదు మామడట్టి కర్జమున్ 247

ఉత్సాహ

నోటి మాట జాఱ నవల మాఱుపేలు వోసినన్
దీటు గాదు మాట పరువు దీనివోసి పోవుగా
కోటు నోలు మానుషంబు గోటిలోనఁ జిడ్డన్
నోటినిండ మాటలాడ నోట ముత్తెముల్ పడున్ 248

క వనితాధర్మము మర్మము
వనితాల్మి వరుంధతికి నమశ్య మొనయు జ
వ్యని తాఁద్రి కరణశుద్ధ ల
వని సీత పతివ్రతలఁ బ్రశస్తలు సుమ్మీ! 249

శమవతి సతిసావిత్రి య
నమశీల యరుందతియును సాధ్వి మ కన్యా
దమయంతీ మదయంతుల
నమసీత పతివ్రతలఁ బ్రశస్తలు సుమ్మీ 250

సీతమాన మానవతి చిక్కెదెట నైనిటేలు పేసి యా
భూతల మెల్ల చోటులను బూనికతో వెదకించి మాడఁ బ్రా
చేతముఁ దాది కావ్యమునఁ జెప్పఁడె తప్పుట సాఁటి భూమి వి
ఖ్యాతిని రావణుండు తమకంపడి యామెను తాక గల్గనే 251

అవని తనయతో సరియయి
న వనిత నయ మహితయంచునంగ నెపుడు త
ప్పనని తన యశము బర్వదె
ననసీతనయాంచి తోక్తి నామము వెలయున్ 252

ఉర్వి పీయూరి కాయూరెంత యాయూరి
కీయూరు వంతగా నెఱుఁగ వలయు

గికురింప వడ్లగింజకు వడ్లగింజయు
    వట్ర పెట్టదటన్న వార్తఁ గనుఁడు
నిద్ర వోయిన వాని నెఱిలేవమ్ము మే
    ల్కొన్న వానిని లేపఁ గూడ దెందు
ముప్పతిప్పలు బెట్టి మూఁడు చెఱువుల నీరు
    ద్రావించి రిపు తలఁదఱుగ నలయు
నొవరంగఁ దాను బట్టిన కోడి కాళ్ళచే
    కాలంచుఁ గూర్చున్నఁ గలఁత పొసఁగు
నెవపెట్టి మసివూసి నేరేడు కాయగాఁ
    జేసిన వెంటనే చేటు పొసఁగు
మంటి యెద్దైనను మాయెద్దె గెలువంగ
    వలెనన్న నదియు పో వాదమందు
రొరుల కల్మికి నేడ్వ నొక కన్ను పోయెను
    దనకు లేదని యేడ్వఁ దక్కు కన్ను
పాపంబు గల్గిన భయము గల్గుచునుండు
    వదిలేని నాఁడు భయంబు లేదు
నోరున్నఁ దలఁగాచు నీరున్న మడిఁగాచుఁ
    దారున్న బండి కల్తనరఁగాచు
పెద్ద చేనికిని మంచెలు మూఁడు నేటికిఁ
    బనిలేక పొరుగిల్లు చొరుట తప్పు
వఱచి మూళ్లెడు నక్కపైఁ దాటి పండుర్లి
    పడి నట్టులగు బీద వాని పాట్లు
పగటి పెత్తనమున్నఁ బనులకుఁ జేటు గు
    రాత్రి పెత్తనము నిద్రకును జెఱుపు
ఊరివానికి లేదు పీరి భయం బిన్నఁ
    గుములాఁ పికిని లేదు కాటు భయము
కుఁగొని బ్రలులతోఁ గలహింప రాదంద్రు
    మించిన పనికిపై క్రింద పడకు

పరభామ తోడను బంద్లికిలింపకు
    కొఱగాని పనిని జేకొనకు యెందు
గుణహీను చెల్మి చేకొనఁ బోకు రాజు తో
    బరియాచకము నమ్మి పట్టరాదు
బంధుల తోడను బగఁ బూనఁగారాదు
    పాఁడితో నోపదు పంట చూడ
నవ్వి నవ్వినవోట నడుగొడ్డైనను జాలుఁ
    నవ్వుచు మాట్లాడ నష్టికలుగు
నడుగని మాటల కంది యుత్తర మీకు
    భక్షించుచును నడువంగ రాదు
పిలిపించుకొని పాము పెండ్లికిఁ బిలువకే
    చనవచ్చుఁగనుగొనఁ జన్మమునకు
బరగంగ నొంటిగా బయన మేగుట తప్పు
    పరుగురిలో బద్దపాము నమ్మ
పరుగెత్తుకొని పోయి పాలుద్రావుటకంటె
    నెఱి మేలు నిలుచుండి నీరుద్రావ
నేఁ బ్రాణికైనను హింసచేయుట తప్పు
    సత్య మెప్పట్టున నదలనుప్పు
నొచ్చియు బరునిపై మదునబద్ధంబు
    కీడు మాటను జెప్పఁగూడ దెపుడు
పేశ మన్యద్రవ్య మాశించ బోకెందు
  . పాముసకు విషము పంటనుండు
జ్ఞాతివానికి మందు చుఖవులందున
    నేతరికిని నిలువెల్ల విషము
అన్యజంపుటకంటె నాత్మహత్య పరమ్ము
    విప్రుపాముల కంటె విషముమేలు
ఇంక నిట్టులు ధర్మము లెఱిగి నడువ
నరునకు శుభమ్ము లేతెంచు ధరణిలోన

గావున సలక్షణమ్ముగాగను నవించి
వాడ విస్తర భీతి నిందార లేదు 253

వ. ఇటుల సోదరులకు సాదరమతి యుధిష్ఠిరునకు ధౌమ్యుండు తెలిపిన యనంతరంబు

254

# విరాట పర్వ కథ

క. తమ యజ్ఞాత వసతి కెం
దమరునో యేదేశమగు నోయని తలచి విరా
ట మహీపతి పుటభేదన
మమరాలయ సమర మాశ్రయమ్మని వారల్ 255

వ. సవ్యంబుగనవ్యగతి ధన్యంబగు మన్మాన్యంబరయుమతి దూరంబున గలదుత్తరి
వరారణ్యంబగణ్య పుణ్యులగు పాండవులు దారులు సదారులై
దరియం జొచ్చి

256

క. తమ యాయుధమ్ములనొక
శమి వృక్షము మీదగట్టి శవము నొకటి పై
వ మరిచి యెవ్వరికిని సా
ధ్యము గాకుండంగ జేసి యరిగి రవలకున్ 257

క. కంకుడను పేర ధర్మజుఁ
డందు వివేకుండు వలలుడని భీముండున్
గొంకక బృహన్నలాఖ్యను
శంకర సన్నిభుఁడు నావిజయుఁడమరె నొగిన్ 258

క. దామగ్రంథి సమాఖ్యను
సేమంబున నకులుఁడశ్వ శిక్షకుఁడయ్యెన్
హామికఁ దంత్రిపాలుఁడు
గా మహి సహదేవుఁడాలగాఁ బరియయ్యెన్ 259

క. వరుసగఁ జని యొకరొకరులు
వరుసను వెడలించి మత్స్యపతి పురమున భూ
వరు సన్నిధి నిలిచిరి యె
వ్వరు సద్రూపములు తెలియఁబడకుండన్ 260

క. పాండవు లందఱు విరటుని
యండను నాయాయి పదవు లందమరఁగ నే
దండఁగ మన పాంచాలి యు
దండ సుదేష్ణకడ నమరె సైరంధ్రి గతిన్ 261

గీ. కంకుభట్టు పాచికలవాడు నావాఁడు
ధర్మ శాస్త్రములయు మర్మమెల్ల
విప్పి చెప్పుచుండి విరటుని మది కెంతొ
సంతసమ్ము సేయు సంతతమ్ము 262

క. వలలుఁడు సూదస్థితిఁగొని
కలమాన్నాదులను రుచులగడి సూడఁగ దా
నలవఱిచి విరటునికి మది
వలరించు జయించి జెట్లహారులం గరుణన్ 263

క. క్రీడియుఁబేఁడిఁగఁదన మగ
పోఁడిమి విడనాడి యాడు పుట్టువు రీతిన్
జేడియలకు నట్టుఁడై మ
ప్పిఁదుత్తరకు నటనమ్ము నేరుపు చుండెన్ 264

క. నకులుడు విరాట నృపుకడ
నకులీ నాశ్వచయములకు నధిపతియై తా
నకుటిల విమర్శనమ్మునఁ
బ్రకటుఁడు దినమొక్క రీతిఁబ్రబలింపించెన్ 265

క. అసహాదేవుండటులయి
యా సాహసారమును నృపతి యండ కరిగి యా
యాసహరణము గ వలవడి
యా సహసింపుము వెలిరటు నాలను వేలెన్ 266

వ. ఇట్లు నారలార్యురయ్యె తావులఁగుదురుకొని విరటు నెదకు రంజిలంగ
నానాఁటికిఁబ్రియంబు నాటి ప్రియగౌరవంబులు గదుర బెదరు లేక దినములు
గడుపుచుండ నంత గొండొక నాడు

267

చ. ద్రుపదనృపాల పుత్రియపురూపపు రూపము కాన జెందియున్
అపర రతియటంచున సమాన బలుండు పకాముడై మహో
వివదు దధింబడంగడఁగి విప్రవి జాధిని జెప్పియప్పకున్
గుటుము పన్ని దాని పడిగా నొడగూర్పుము నాకు సోదరీ 268

వ. అనుడు నంత 269

ఉ. అప్పకుఁజెప్పఁగూడని మహోగ్రహముగ్రముగాఁగదట్టి యా
చొప్పున నిప్పుదుప్పటినిఁ జొప్పగఁ జూచెద నొక్క తమ్ముఁడా
దెప్పర మిప్పని న్విడుము దీని పతుల్గల రగ్ని సన్నిభుల్
ముప్పానరింతు రొప్పదిది మూర్ఖలిదేటికిఁ బొమ్మటంచునెన్ 270

క. అప్పయుఁ జెప్పిన బుద్ధులు
నప్పలుకులు ములుకులట్లులగుడును జెవికిన్
నిప్పువలె మండిపడుచును
నప్పయని పిలిచి దానికనియెఁ గటువుగాన్ 271

మ. ఎటులైనన్పను కూర్చి యావనిత నన్నింపార గూడంగఁ జే
యుటకుం బూనక యుంటివేని యిపుడే మగ్రానలంబందు న్రమం
డుటయే రూఢి యటంచు సింహబలుఁ డౌత్సుక్య స్థితిం బల్కగా
నెటుల న్ద్రాపెనొ బ్రహ్మవీని తల నట్లేకాక వేటొల్లగున్ 272

వ. అని మనంబున మధ్యస్థ దలంచి మాలిని బిల్చి యల మాయన్న యింటి కరిగి

హోలఁదెమ్మని పంపుటయు నామె యామె కిట్లనియె

275

ఉ ఈరసమెత్తి సింహబలు నింటికి నన్ననుపంగ నాని కల్
దేరఁ గఁ బొమ్మటంచును మదేశ్వరొ యీ పనివన్ని వానికిన్
దారువు కత్తెవోలెఁ బరదారఁ బవిత్రత నేరి కోరి నే
నేరను నీకు మార్మనల విప్పువకుం జెదలంటునే చెలీ!

276

వ అనుటయు నీకు సందియమ్ము వలదు నామాట వినుము కూడని పనియైన
నేనువిన్నంపెదనే

277

మ అని సైరంధ్రిని హోలపాత్రగొని మాయన్నయ్యకే యిచ్చిర
మ్మని పంప న్నుపవల్లి ద్రోవదియు నాహో మీఁద నెట్లౌనొకో
యని యుల్లంబురియాడగాఁజని తదీయాగారముందుంచి పా
త్రను రాఁబోవగఁ బట్టెవాడు పలిహస్తమ్మెట్టులో యామెయు

278

పట్టు దప్పించుకొని సతి బయలు కుఱుకఁ
గీచకుండామె వెంటను నీచుఁడగుచుఁ
దవిలి పట్టంగఁ జూచిన దవులనున్న
వారలదలింప నాఁగె నాపామరుండు

279

ఉ. ద్రౌపది భీమునింగదిసి తాఁబడినట్టి పరాభవంబుమన్
దాఁచక పూసగ్రుచ్చిన విధంబునఁ జెప్పిన నేఁడు వాని సం
తాపముఁ దీర్తు దాని నలెద్రక్కులు పెక్కులు చూపు వాఁడు రా
నావయిఁగాగలట్టి పని యంతయు నేఁగడ తేర్తు నంచునన్

280

ద్రోవది యోపగింపకొక త్రోపను రాఁజని భానగర్భ వా
క్యావసులన్వయించి కలియంజనుదెంచెద నాట్యశాలకున్
నీవట కేగుదెమ్మన మనీవను గీచకుఁడో చెలీ దయన్
రీవిపి నమ్ము నేలితి పడి న్నరునేలితి కూలి బంటుగాన్

281

అవి మణియు

282

క. చీటికి మాటికి వలపులు
మాటుగ మదివేఁగ నూరుమాటు మఱఁగఁగా
నీటుగ నర్తనశాలకు
వాటముగా సింహబలుఁడు వచ్చెఁగులుకుమున్ 283

క. తవదుర్లలితము ఫలితము
గనుమ నిశి యిప్పుడిప్పుడు గడలుకొమ్మకో
యని నేఁచి కీచకుండు న
ర్తనశాలకుఁ బోయి కదిసెఁదామసి శయ్యన్ 284

వ. అంత సింహబలుండు శయ్యపైనున్న మహాబలనామ, సైరంధ్రిగా దలంచి
నరంధ్రమగు నయ్యంధ కారంబునఁ గామాంధ కారంబున నొడలెఱుంగక
యామెతో ననురాగంబున పరాగం బులాదందలంచితనచేకుటా
కులవికటంబుగా ఘటించుచుగడు గోటున గాలి ముచ్చిలఁగొనగాలి నెళ్ళఁ
దవిలించికొని రంగస్థలి యొల్లగ్రక్క నలవోయయ్యారంబుగా నడచి
శయ్యాతలంబు తవకరతలంబున నిమిరి దరికి దరిపి నరస వాక్యంబుల
జోక్యమ్మునకు దిగి యిట్లనియె

285

మ. అలనాడేమ్ము పరోక్ష భీముగని యేలాజాగులీ లాగునన్
వలరా జోర్వడు రమ్ము లెమ్మలయన్నష్ఠి ముఁడే జాగు సే
య బలం బీయ బలేతి వాక్యనకు ముఖ్యార్థంబు నేనౌదు నో
లవి నీ పొదు యొకింత చూడుమని నేలాకోలముల్వల్కుచున్ 286

క. వడముడి యాసింహబలున్
వడి సింహము కరివిఁబట్టు వడువునఁగొని కాల్
క్మాడ పెడ తలముల కీల్కి
ల్బడి చప్పుడు సేయకుండ నడల న్నిటిచెన్ 287

క. అక్కృచు భీముడు కీచకు
గ్రక్కున బసిగటిక కోం గగ్గరవిడిన

బ్బక్కడఁబడఁద్రోచి విఱచె
దిక్కు, మొగముగుచుం బాలఁద్రొక్కి చంపెన్ 288

వ. అట్లు తమయన్న ద్రెళ్ళినవార్త నర్తనశాల కావరుల వలన సమనవగా విని యతని మృతికిఁ గారణమేమని వగచి యందొకచో డాగియున్న సైరంధ్రియే కారణమై యుండునని 289

మత్తకోకిల
వాని తమ్ములు వచ్చిద్రౌపదిఁబట్టి యున్న శవంబుపైఁ
బూని కట్టి చనంగఁగాటికి భోరుమన్పతి యేడ్వగా
పీనులంబడ నేగి నేగమె భీముఁడా మనసమ్మునన్
గానకుండగ విల్చి వారలఁగాటికంబలిదీసినన్ 290

వ. ద్రౌపది కడుసంతసిల్లి నిజభర్త కడిమికి మిగుల నుత్సాహ మందు చుండె నట్లు 291

క. ఉపకీచకులగు నూఱ్వురు
చపలాత్ములఁ బట్టి చంపి జాయకు బంధం
బపహృతమొనరిచి భీముడు
విపరీతము గాక పాక వేశ్మము పొచ్చెన్ 292

గీ. శౌర సింహబలుఁడు నొసింహబలుఁడూర
మాఱువుర వరజాల నూరుపేరు
లేకయుండఁ జంపె నేకాకిగా భీముఁ
డెంతవాఁడో వేఁగు నంతలోన 293

చ. బలుబలుతెల్లవాఱ నటఁబాసి వృధాన్నున తానమూడి యా
వల వలలున్నలిన్ నరప వాక్యములంగొనియాడి పేడితో
వలపులు వెల్లివెట్టఁ బెఱువారికిఁదోపఁగనీక వచిం
చి లలితమౌవటు ల్విరటు పేడియ పాలికిఁ జేరవామెయున్ 294

ఉత్సాహ

వెన్నబెట్ట మ్రింగలేవు వ్రేలువెట్టఁ గఱ్ఱతే
విన్నటికిని నేమికాని యేమి యెఱుఁగనట్లు నా
యన్న సింహబలుని మాఱ్ఱురతని తమ్ములన్నిశన్
మన్నిగొల్పి తీర యెంత నంగనాచివే చెలీ 295

శా. సైరంధ్రీ పని యెంతసేసితివి మేల్పాల్పాలు లోకైక స
ధ్వీరు ల్నీదగు పొట్టఁబెట్టుకొని భావింపంగ నాభ్రాతలన్
మారాకారుల మ్రింగివావు గద సామాన్యంబుగా మార్వురన్
నేరన్నిన్నట మంచఁ బొమ్మెటకు నేనీ కాళ్ళకున్మ్రొక్కెదన్ 296

న. అనిసుధేష్ణ క్రుద్ధోష్ణంబుగా నుడువిన నుడువును విని పృథానుషపృథారుష యింతవేల యింతవఱకు జరిగినంతకాల మిఁక జరుగవలసిన పనిలేదు.పనిలేదని యుఱకవని వినవిని యోగమేమి మేమిఁక నొకఘన యోగమున గొన్ని వాసరములు వాసిగ నిట నివాసముండి యెటకేనియుఁ దొలంగు వారము గాన ధీరవై యోరిమి సేసి నేరమేమేని మాయెడనున్న బాయ మన్నింపు మేమేని యేమే నుపకృతి నీవతి కొనరింపక పోయెదు వారము కాము వేకాముకుఁడైయాముకొలది కొలఁదిమీరిన చేదుకోరిక మీరు వలదన్నమ వదలక మీయన్న నన్నదగఁగనియనదగనివియని మనదగిన కాలంబు లేమి నాలంబున కాలంబుసేసె నాతనిభ్రాతలు నన్నును బోలువారై నన్నాదరంబుసేసి తమయన్న మృత కళేబరంబుతో నన్నుంగట్టి దాని తోడన గాల్పమనఁనంబునకు గొంచుపోవగొరిచనాదరంబు నీదబాద సేయనోర్వరాని తాపమున నాపతులు గంధర్వులు లో పలపలవల నాపదరముగాని కోపంబున నాపదనొందించిరి.నను నిందించకుము గాపిపడనేల చేసికొన్న పాపము చెడని పదార్థము గాదె.ఒరుల దూరిన ఫలమేమి? చలమేమియుఁ బూనక యెలమిం జూడుము పోడిమిగల చేడియవు గాన నోడక యింతగ నేనాడితి నాడితని కీవు తర్ల యెత్తి బుద్ధులు సెప్పిన దానవే కదా? తోడి చేడియలు నగ నొగల నేల. నేల బుట్టిన వారెల్ల గిట్టకపోరు.నేఁడొండె మఱి యింక మాతేండ్ల కొండె మానవులకు మృతి రాకపోదు అరవిము నమేని మిత్తి దప్పదూరక నను

దూరకు దూరినఁ బోయిన నీవారు మరల రాబోరు పోరున్నఁ బొందు
తుష్టియును మనుస్మృతి వాక్యము స్మృతి నుంచి పెక్కు వాక్యములకుఁ బ్రోక
సఖ్యంబున మనుట మన కనుకూలమ్మైన తెఱంగని యెఱుంగుమనిన. సుధేష్ణ
వెఱఁగుపడి యిఁక మీద మిక్కిలి యేమియనిన మీది మిక్కిలి యేమి
పొసఁగునో యని యేదియు నన నొల్లక వల్లవల్లన నరియేయని మిన్నుఱిగి
మీఁద బడినట్లు మిన్నుమిన్న మున్ను గన్గొనుచు మిన్న కుండె నంత 297

క. అజ్ఞాత వాసరంబునఁ
ప్రాజ్ఞతలోఁ గడుపుచుండఁ బాండవు లెలమిన్
విజ్ఞాన హోమలాకుమ
తి జ్ఞాతి నృపాలురొక్క దినమున సభలోన్ 298

వ. కష్ట చారిత్రమగు దుష్ట చతుష్టయ మొక్క చోఁగూడి మంతనమునకు దిగి
పాండవుల వనవాసకాల మనాయసముగ ముగిసె నింకఁ బదమూడవ యేడు
కూడ దరిసి మూగి యందఱియయ్యె. వారల యునికి పట్టట్టిది యని
మనకింత దఱకెఱుక పడదయ్యె దియ్యము వారి కెయ్యడను సహాయమయ్యెడి
సీవత్సరము ముగియు లోన గుట్టిది నిశ్శంకముగఁ బాండవుల శంకరగిరి
మాన్యముల బట్టించకున్న మచ్చరంబున విచ్చచ్చుఁ దకు నేఱువు వలికరువలి
చూయుమలి కరువలితో వెలువడి వచ్చి విచ్చల విడి తమ్మందఱ దఱికొని
మాడ్చి మంబరము సేయు నొండె గాండీవ కుఠారంబున నూచ ముట్టుగ
నూచకోత గోయు నొండెఁగాని చూచిచూడని వడువున వడిగ వచ్చి మనను
మనమొనలను గాచి విడువండు. వారలయెడ మనమొనరించిన కొరియ
ములెట్టివియో యెఱుంగమే కాన మౌనమౌనము నూని మీ నూనసద్ర ధిమ
కొలందిమోజించిసహేతుకంబుగా పాండవులవు క దేశస్థులనియు
వారలగనుఁగొమ తెఱంగిద మిత్త మనియుఁ బ్రాకటముగా వాకుఁ దెల్పుడీ
యని మయోధనుండడుగ భీష్మాది కురువృద్ధులు కొందరిట్లనిరి 299

ఉ. సింధురసత్త్వుఁడైన యలసింహబలుం బరమాద్భుతంబుగా
సంధులగిల్చి చంపె నడి చప్పుడు సేయకెవండా యాజరా

సంధ యుద్ధప్రవీణ హాలి తల్పులలో సరిదూగు వీఁడు దే
గంధ మహోత్కటాండు కడకం గడచేరిచి యుండు గీచకున్ 300

చ. విరటుని దేశమందిపుడు వింతగ నెంతయుఁబాడి పంటలున్
విరివిగ విస్తరిల్లునఁట వీనికి హేతువు పార్థులుంటయే
తరిమి తదీయ గోగణము తప్పక పట్టినఁ దప్పిపోయిరై
వరుసను బాండవుల్ వెడలి వత్తురు గుర్తిడవచ్చు వారలన్ 301

గీ. పూని భీష్ముదులిటు తలపోసి వాసి
తుటుము దక్షిణ దిశ పసిదోలికొంచు
రమ్మనుచుఁ బంపగసుశర్మరాణ నేగి
సరగఁ బసి బట్ట విరటుఁడు సవిమొనటకు 302

క. దీటుగ సుశర్మతోన వి
రాటుండని దాకి యెదిరి ప్రదరము చేసన్
వ్రేటుదిన సొమ్ము సిల్లిన
గోటుగ నతడి వని కట్టుకొని పోదొడగెన్ 303

గీ. విరటుతోఁ జనిరి ముందుగ కవలు యు
ధిష్ఠిరుండు పసులఁ దేరఁజూచి
భీమ బలము చూపి భీముండు విడిపించె
బశుగణమ్ము విరటు బంధనమ్ము 304

వ. భీముండుసుశర్మనుప్రాణావశిష్టంబుగావదిలియున్నదైవవిరటుబంధవిముక్తుని
చేసి తెచ్చిన వా మత్స్య నాథుండు పరమ సంతోషము నొంది సములతోఁగూడఁ
బురంబునకు గదలె

305

క. ఉత్తర గోగ్రహణమునకు
సత్తములగు యోధవర్యులొగి పదివేలున్
దత్తఱబడులో రాదం
డెత్తెచె సుయోధనుండ హితములఁ గ్రుతియై 306

చ. గురుకృప ముఖ్యులా విరటు గోగణ మెల్లను యెల్లఁ జూచు లా
గురుకృప ముఖ్యగోపకుల వొంటిరి పాటువఁబట్ట కాలపి
గురుకృపణ ప్రవృత్తి గిటికొంచుము గొంచుము బోవుందు వే
గురుకృపమమ్ము రాజునకు గోగతి జెప్పిన నంచుగోపకుల్ 307

ఆ. వేగఁబోయి వీట విరటుఁడు లేమిని
నుత్తరునకుఁదెల్పి రుత్తరంవు
రెనను మేయుచున్న దేవరమనులు
ముట్టి కురుబలంబు పట్టెననుచు 308

ఆ. మలయ విరటువీట మగపురుషొకఁడేనిఁ
దవర నుత్తరుండు దక్క లేమి
జీఱుత యతడు పోవ సిద్ధించెఁ బోరికిఁ
తగరు పోలెఁబులుల దళము పైకి 309

వ. ఆల కాపరుల మదు లాలించి యువలాలించి వారలఁ బశుపాలురగు బాలురతో
బాలుండగు నుత్తర కుమారుండు పోరాటమునకు ఁబోవ నుకట్టి యుల్లవ
దల్లి కడకేగి కడఁక విడక యామెతో గొడుకగు భూమింజయుండు దుడుకు
తనమ్మున నిట్లనియె

310

క. వింటివె యిపుడమ్మా మన
యింటి కథన్ మనుసులకు నెంతలు పుట్టెన్
దంట తనమ్మునఁ గురుపతి
వెంటనఁ బట్టెఁజుసి గిల్లికలహము తేవై 311

చ. సరిపడవాకు విష్ణురథసారథి చిక్కనఁ బాఱఁదోలవే
కురుబలమొక్కవ్రేటునను గుక్కలఁబోలిన యట్టు లంచు ను
త్తరు డతి వాక్ప్రగల్భములు దల్లికడన్ నుడువంగ నంత ను
త్తరకు బృహన్నలంగొన హితంబు పదేశము సేసె గృష్ణయున్ 312

ఉ. అన్నకుఁజెప్పి యుత్తర బృహన్నల సారథిగాఁగఁ గొమ్మనన్
మున్నవ గొన్న యుత్తరకుమారకుఁడేడవో పేడి యేడవో
పిన్నలు పెద్దలున్నగతి పేరుప్రతిష్ఠలణంగి పోవె నే
నెన్నికఁ బేడి రోడుగొని యేగుట కంటెను హైన్యమున్నదే 313

క. అని యతఁడు బేడినిం దన
కును సారథిగాఁగఁ జేసికొన నొల్లక ఏ
యని యెదురుగాక మరీ
కొనఁజాలమ బేడికెన్ని గుణములె యున్నన్ 314

గీ. ఉత్తరుని గని సైరంధ్రి యుత్తరంబు
సెప్పె నృపపుత్ర యివుడు నేఁజెప్పనేల
నీవ తెలిసెద వన్నియు విన్నుగావ
నల బలముఁద్రోలు నెడ బృహన్నల బలమ్ము 315

క. కొండ తలక్రింద నిడికొని
గండ శిలకుఁగాఁగ వెదుకగా నేమిటికిన్
దండి బృహన్నల మనకడ
నుండగ నీ తేరుఁగడవ నొరులేమిటికిన్ 316

క. యేటికి నేటికి సంధియ
యేటికి నేటుగను బేడియే తగు నీకా
మేటి గడవుఁబవి గొను ము
మ్మాటికి నేఁబూట వేయుమాట లిఁకేలా 317

క. అని యిట్లు జాయి గ్రుద్ది న
యనువున సైరంధ్రిసెప్ప నయ్యుత్తరుడున్
విని యెట్టకేలకొక విధ
మున విధిలేకొప్పినట్లు మొగమొగపెన్ 318

వ. అంత భూమింజయుండు విజయుం గనుంగొని 319

తరల

నరఁగ దేరిని రెమ్మనంగము పొగి పెండ్లికిఁ బిల్చిన
ల్లరదమొక్కటి దెచ్చి యాతడు నంటగట్టిన జావడా
లరసే యుత్తరుఁడెక్కెదాని బృహన్నలా గొనిరండు నా
కరిది పొమ్ములు బొమ్మపొత్తిక లంచు నుత్తర గోరఁగన్ 320

క. ఉఱ్ఱూఁతల నూటాడెడు
గుఱ్ఱాలట నూరుదాఁట గుఱుకొని చెవిలో
గఱ్ఱిజపించిన మంత్రము
జఱ్ఱున జాఱినటు నాజె నరఁగ దురగముల్ 321

క. కనుఱెప్ప పాటు లోనన
చని గొప్పగఁ గురుబలమ్ము నరనకుఁ జేరెన్
మనమును మీఱెడు సత్త్వజ
వనమున వనమునను బాఱి నారువములటన్ 322

ఉ. కౌరవసేన నుత్తరుఁడు గన్గొనెఁగన్గొన భీతుదొట్టి నా
కౌరవసంచె యీ బలము నాఁపఁగ నావగదైవమీ గలఁగా
కౌరవనందియంబు విడుమావల నూవులనున్మఱల్చినన్
గౌరవ సంపదం గనెదఁగావున గావు మునన్ బృహన్నలా 323

చ. అనవిని పార్థుఁడుత్తరున కంతట బల్కెనుఁ దల్లియొద్దనీ
వనినవి యెల్ల విస్మృతము లాయెనొ నాయన యింతలోననే
యని యొనరించు మంచును బృహన్నల తిన్నగఁ బ్రోది సేయ గా
దను విడుమింకఁ బోరుగతి దయ్యెమెఱుంగ నటంచు మాత్యుడున్ 324

క. అరదంబు డిగ్గనుఱికియుఁ
బరుగెత్తుడుఁ దోడనుఱికి పార్థుఁడు తాను
త్తరు నొడిసి పట్టుకొని శమి
తరువు కడకు ద్రోలి యాయుధములంగొనగన్ 325

క. అత్తఱిఁ దాఁ బార్థుఁడ నని
తత్తత్పదములను నన్నదమ్ములు నతియున్
హత్తుకొని యుంటఁ బురిలో
నుత్తరునకును ధనంజయుండెఱిఁగఁదెల్పెన్ 326

వ. అంత నావైరాటి కిరీటియానతిఁబడి బ్రూనతి త్వరిత మ్ముగ నెక్కి
యాయుధముల మూట విప్పి వాని సర్వాకృతులను గాంచి యచ్చెరువంది
వానివన్నిటిని వేర్వేఱుగ నివ్వెర గందుచు నెవ్వియెవ్వి యెవ్వరివని యని యడిగి
తెలిసికొని యర్జును గాండీవాక్షయ తూణీరంబులనుబైకిఁదీసి యాతని
కందిచ్చి తక్కుసాధనమ్ము లెప్పటియట్ల బంధించి యావృక్షంబును సంధించి
చెట్టు గుబాలున దిగి దుమికి పేడి పార్థుండని తెలిసినంత మాత్ర నింతింతని
చెప్పరాని సంతసమంది కొండంతటి సత్త్వవ చేకుఱి యా
యుత్తరకుమారుండు తనయొడలు గుప్ప గూఱ ముప్పతిల్ల పులకలతో
నతని పాదంబులపైఁ బడి భాష్పాశ్రుల నతని కాళ్ళు గడిగి నతి యొనర్పఁ
గ్రీడి యతనిచేత గ్రుచ్చియెత్తి నిండుకౌగిటం జేర్చిన నుత్తరుండు తత్తరపాటు
పేడి క్రీడికట్లనియె 327

క. పదినామమ్ములు నీకుం
గద యని నీకేలకల్గఁ గ్రవ్విడి లోకుల్
వదలుఱుము వేళ వేలాకా
బ్రిదులగ దలఁచెదరదేమి ప్రియము మహాత్మా 328

క. ఎన్నాళ్ళకుఁ గంటిమి మిము
మన్నగరము నందు మీరు మున్నన మున్నా
రన్న నుడివింటి నింతటి
కన్నను భాగ్యంబు వేఱకలదే మాకున్ 329

క. పాండవ జగదేక మహో
ద్దండ నృపుల్ వారలేడఁ దాకొనఁగ విరా

టుండెడు పాలి గాండివి
యందును మీరుండు బెట్టి యాశ్చర్యంబో 330

క ఎన్నాళ్ళ మండియో నా
కున్నది మీ తెరుగడుప వొదమెవరియు నా
కిన్నాళ్ళ కిపుడు నాచేఁ
దిన్నఁగఁ బనిఁ గొమ్మటంచుఁ దేరఁతఁ డెక్కెన్ 331

మ ఇటులా యిద్దరు తేటి నేగిగవి యేదీ యాగణంబెయ్యి వే
పటుశక్తి న్మలలించి కాపరులమం బార్థుండు కాఁపుంచియ
తట గౌరవ్యుల సేనకుంగవిసి భీష్మద్రోణ ముఖ్యార్యులన్
గటు తల్పాయఁగ నేసి వంపఱ నమస్కారంపు బాణా లొగిన్ 332

ఉ ద్రోణుని భీష్మునింగృపుని ద్రోణజుఁగర్ణుని దార్తరాష్ట్రులన్
బాణపరంపర ల్గురిసిపాఱఁగఁ ద్రోలియు మోహనాస్త్రమున్
ద్రాణ విగుద్యగ్రీడి కురురాజులు మూర్ఛ మునింగి వ్రాలఁగాన్
బ్రాణము లూడ్చినట్లు తలపాగల్గోసిన రాజ మాత్యుఁడు 333

ఉ ఎప్పుడు వచ్చినాఁడు పసియెప్పుడు బట్టి మలల్చినాఁడతం
డెప్పుడు తాఁకి వాడు పరి నెప్పుడు గాండివమెక్కు పెట్టినాఁ
డెప్పుడు గూల్చినాడు శరమేపరి యాపరి మూర్ఛమున గా
జప్పుడుగాక పార్థకృతి సైన్యము హైన్యము సెప్ప శక్యమే 334

క ఇంతటి శరలాఘవము మ
ఱింతటి శౌర్యమ్ముఁ గంటిమే యెందయినన్
వింతగ నిందఱు మూర్ఛా
క్రాంతుల నలవోకఁ జేసెగాన నరుండౌన్ 335

గీ అనుచు మూర్ఛమ దేఱి భీష్ముదు శౌర
కోరి మనతలపాగలు కోయు నప్పు
డంతవని కర్ణుడుదిగఁడాయె గాక
తలలు గోసినఁ దప్పింప దాతలెవరు 336

గీ. ఇంతయేటికి మనమితఁడేగు తెంచు
వేళ మంచిదిగావున వేడ్కమరల
బురికిఁజనుమంత భాగ్యము పొసఁగె మనకు
గాకయున్నను శిరములు పోకయున్నె 337

గీ. అనుచు వందలు వేలును నసుచు నాన
లేచి పార్థుని బ్రక్కను జూచి కొంచ
తండు కను మూపు మేరను దాఁటు దాఁక
బ్రతుకు జీవుఁడాయని దారి బట్టిరంత 338

చ. విజయుడు ధార్తరాష్ట్ర పరివేయులనోకగ గెల్చి గోవులన్
రజని ముఖంబు గాకయ విరాటుని పీటికి తోలిపెట్టి య
క్ష్యజముగఁ దొంటి రూపుగొని గాండివ ముఖ్యము లిప్పటట్ల య
క్ష్యజమున నుంచి యీ కథను గుప్తము సేయుమి యుత్తరా యనెన్ 339

క. వైరాటి వల్లెయని తన
తేరెక్కి బృహన్నలయును దేజాలఁ దోలెన్
వారిటులరిగెడి లోనన
వారణ గతి విరటుఁడలరి వచ్చెను బురికిన్ 340

క. వచ్చి కడగొట్టు తనయుం
డెచ్చటి కేతెంచెనాడొ యింటగనుపడం
డిప్పటికి మరలవెప్పుడు
వచ్చు నటంచిట్టులతని వార్తల వరయున్ 341

క. ఉత్తరగోగ్రహణమునకు
మత్తరుఁడు బృహన్నలమ్మహోద్ధతిగొని తా
నెత్తివని కురుబలంబును
హత్తి విఱుగ మొత్తి గెల్చి యాలమరల్చెన్ 342

వ. అని యిట్లు కొఱత లేని చిఱుతకు మరువిజయోత్స వంబు పరిజనులు

తెలుపఁగవిని జనపతి యత్యంత సంతుష్టాంత రంగుడై మన యుత్తరు
జయవార్తఁ బత్తనమునఁ బలురెసల సాటింపుడని పనిచి పనిచి గడలుకొను
సంతసమ్మున నాడలు మఱచి పఱచి నెత్తమ్ము దెమ్మని పరిచరుల ననిపిన
వారలటువె సేయఁగ శౌరి ఫలంబున గోరిక దీర గొండొక వినోదింపుచు
మనమున బుట్టిన తమకంబు వట్టఁజాలక నాడు తనతోనాడు కంకభట్టుతో
విరాటుండిట్లనియె

344

క. మన యుత్తరుద్రజ్జలు విన
విన నద్భుతమయ్యెఁ గౌరవేయులు నాయో
ధనమున గెల్చి వెనం బశు
ధనమును మఱలించెఁ బుటుక ధన్యముగాగన్ 345

క ఆమాటలు విని కంకుఁడు
భూమింజయుఁడేడ కౌరవుల బలమేడన్
స్వామీ గెలుపు బృహన్నల
భీమ భుజాబలము చేత వెలయఁగ నప్పున్ 345

క. ఇందులకు న్సందియమా
విందువుగా కిపుడ యచటి వృత్తాంతంబున్
తొందరపడకు బృహన్నల
పందగ నీకొడుకు వాఱఁ బగఱ జయించెన్ 346

క. తినఁబోవుచు రుచులడుగం
బనియేమిటికానమ్ము నవికింతగ గ
ట్టున వెక్కి చూడవలెనా
మనమిప్పుడు విందు మితని మించివిఁజెడుగున్ 345

క. అని కంకుడా బృహన్నల
గొనియాడగ నృపతి నాడు కొమరుని జయమున్
విన నోర్వనా మూయుము నో
రని యాడెడి సారె తోడ వడమెు గంకున్ 347

క. ఆసారె కంకుభట్టున
కాసారె లలాటమునఁదవి యటగాయముగా
కాసారమ్ముగ నెత్తురు
కాసారముగట్టి కారఁగా సభలోనన్ 348

చ. బిలబిలగారు నెత్తురును జీర చెఱుంగునఁ గ్రుప్ప యొత్తగా
వెలది యిటేల చేసెదవు విప్రుడునుం బర పూరుషుం డతం
డలికచ సాధ్వి నీకుఁ దగునమ్మ యనంగను విప్రురక్త బిం
దులు ధరకారఁ గీడనుచుఁ దుద్భుతి నంచెనె వామె రాజుతోన్ 349

వ. అదియట్ల జరుగుచున్నంతలోన 350

క. ఉత్తరుడు వచ్చి తండ్రికిఁ
దత్తరమున నెఱఁగి చూచి ధర్మజు నొసటన్
నెత్తురు గాయము వీరికి
నిత్తరిఁగానేమి కతము యెఱఁగింపుఁడనన్ 351

వ. ఉత్తరునకు విరాటుండిట్లని యుత్తరమిచ్చె నెట్లనిన 352

ఉ. నీవు జయించి కౌరవుల నీకని నీకొని యాలఁదెచ్చియు
న్నావని నేనవం ద్విజుఁడు నచ్చుక యిచ్చుక మెచ్చఁజేరి నే
నేనవడంగఁ గొంట పాడవత్తి నుతించెను గోమత్తి నే
లావుగసారె వేయ నిటలంబున నాయన కాయె గాయమున్ 353

వ. అనిన జనకునకుఁ దనయుండు వినసొంపుగావి యూనుడి విని వినయంబున్నఁ
బ్రసన్నంబుగా నిట్లనియె
354

క. జనకా మునకడ నున్నా
రవి వీరినిరాకరింప నాయువు శ్రీయున్
జనకామినిగా మునకడ
జనకాయునకున్నె నాదు జయము విమడీ 355

చ. కడిగ జగంబు 'మ్రింగఁగల కౌరవ వీరుల సైన్య మొప్పుటో
దొడుకులఁ దెమ్పుటిప్పుటవొ తోసుకఁదొంబది యోజనంబులన్
బడియెడు వాఁడ వేటవొ నందము విన్నను వివెఱంగవే
వెడలివి బద్దినంచుఁజని చీమ తరించునె క్షీరవారిధిన్ 356

చ. ఉఱకజగంబు నొక్కొకఁడ యుగ్రపదెంబుగ మ్రింగజాలు బల్
ములకరు లావగా సుతుఁడు సూర్యసుతుండు గురుండుద్రోణి యం
చెఱఁగి యెఱింగి వీరలెటులేని జయించితి నంచునమ్మ నం
దఱ నతిశూరులంగెలువ నాతరమే తమకేను క్రొత్తవే 357

చ. తొడరుచు భీష్మఁగర్ణఁగృపుద్రోణుని ద్రౌణిని లోనుగాను శ
క్తుఁడ నను గెల్వ వీరెఱిగి కూడను వారిజయించినట్లు న
న్నెడగును నెట్లు నమ్మతిరి వెళ్లఁగఁ బుత్రుని మీఁది ప్రేమచే
విడువక యింత మాత్రముఱపెంబునకై ద్విజనొంచు చేటికిన్ 358

క నేనావగలనె కౌరవ
సేనావగఁ గలన నచట జితకాశి యొకం
డేనాటి చుట్టమోనతె
పూనిక నరుదెంచి దివ్యపురుషుడు గాచెన్ 359

క ఆపాను నరసింహము
చూపట్టును రేపొమాపొ చోద్యముగ నిటన్
చా వగు నునకందఱకును
గోపము శమియింప వేడుకొనుడీ కంకున్ 360

చ. అవితరమెన్న రానివగ నత్తఱి యుత్తరుఁడొత్తివల్కఁగా
నని తరవారుబోని కరణంబున నేసితిఁగంక భట్ట మి
మ్మనితరు నస్క్షమింపుడిఁక వారట మీఁదట నేరెట్టైనమున్
మును తరియించు నాతని మహోమహుజాపుడునే గమే యనన్ 361

గీ వేటువడి కంకభట్టుఁ డింతేటికిపుడు
మించి పోయిన పనికి క్షమించ మంచు

వేడ నీవిట్లు వేలాటి వాడవయ్య
వేటు గీటును లేదని గీటు వృచ్ఛ 362

క. మఱువాడు పాండవేయులు
మఱిమఱిఁజెలఁకటిని లేచి ముదితయుఁడాముక్
దెలుఁ గొప్పఁగ పళదీరిచి
వెలువఱవక కూరుచున్న విరటుడు వచ్చెన్ 363

క. తమజాచి వారలూరక
కనుఁగొనుచు నొకరి మొగము లొకరు లేకయు
న్నను వెఱగందుచు విరటుం
డని విటు వాగ్దై కంకుఁడద్దుఁడె యెక్కెన్ 364

చ. అనుటయు ఫల్గునుండు నగి యక్కట లోకము లేలఁజాలు నీ
ఘనుడు యుధిష్ఠిరుండు చిఱు గద్దియ నెక్కఁదగండె మున్న ని
న్నను నరివట్ట గోగ్రహణ మందుఁ బసి న్విడిపించినట్టి యా
యన బకవైరి భీముడు మహామహుళీ కవలంచుఁజెప్పినన్ 365

ఉ. అంతట లేచి భీముఁడు బృహన్నల పాయము తోడ నాట్యపి
ద్ధాంతము నేర్పి యుత్తరకుఁ దత్తర పాటున నుత్తరాశకా
క్రాంతము సేయఁబూనుకొను కౌరవవార్ధిక ఖండ సేతువై
రంతులు మాన్పి యాతఁడు తిరుమ్మగ నద్దుఁమఁడీతఁడే కదా 366

వ. అనుటయు 367

చ. ఒనరఁగ నాలకించి యది యుత్తరుఁడంతన తండ్రిఁజాచి వ
న్నను నొకదివ్యపూరుషుడు వామిషవెట్టి వచించినాఁడ వ
ర్జునుఁడె నుమా మహోధమని తూరుల గెల్చి మఱల్చి గోవులన్
చినుమటుగాత నాతెలివి నేర్చునె తూర్పును గౌరవాంబుధిన్ 368

ఉ. దైవ వరప్రసాదులు సధర్ములు మాన్యులు పంచపాండవుల్
దైవ వశంబున న్విడలి దైన్యము నాకతి హైన్యవృత్తి నీ

తావున కేగుదెంచి తలదాఁచి కొన న్మన భాగ్యమంచు నీ
దీ విధులమ్మహామహుల దృష్టులఁజేయక లాఁతి నీతియే 369

క అదియంతవిని విరాటుఁడు
మదికెంతయుఁ జింతగదురఁ బ్రూవ్వడి పెదవుల్
గదలింప నేరకుండిన
సదయుఁడు ధర్మాత్మజుండు సరసతఁ బల్కెన్ 370

చ బెదరఁగ నేలనయ్య యొక పేద యెఱుంగక యొక్క యేఁడు నీ
యుదరము లోన దాఁగితిమి యుక్త సుఖంబులఁ గడ్పులోనిమున్
గదలక యుండునట్లు మునుగాచి తవిన్మఱపించి నీవు స
త్ప్రదయుఁడ వౌట నీఋణము దీర్పఁగ జాలము జన్మకోటికిన్ 371

వ అని ధర్మరాజా అడిలం బలికిన నంతకు మునువుల్ల బు డిల్లంబోయి వెల్ల
బోయియున్న మాత్స్యుండు ధర్మజు పలుకులకు గలకదీరి మెండుకొని
కొండంత సత్తువ చేకూరి యారాట మెడలి విరాటుండిట్లనియె
372

ఉ నాసుతనిత్తు నుత్తరఘనంబుగ గ్రీడికి ధర్మపత్నిగా
దాసుని తప్పులన్ని యొక దండము తో సరిజేయుక పోలికన్
వాసవి మూసికొంచుఁజెవి బాసముటుల్ గొన శిష్యురాలి బల్
మాపటి మాసమానుఁడభిమన్యున కిచ్చెదఁగొందు నుత్తరన్ 373

వ అని పల్కిన శతమన్యు పౌత్రుఁడగు నభిమన్యునకు నుత్తరనిచ్చి తన జన్మ
మంతటి నుత్తమముగ ధన్యమ్ము సేసికొని యెదనుకొని యెదను గుదుఱు
పఱచికొని
374

చ క్రియకును నిశ్చితార్థమొనరించి విరాటుడు కూతు బెండ్లికిన్
బ్రియమున రాజ బంధులకు వేగముగా శుభలేఖలంపి వే
సియు బురమెల్ల యెల్లగయు సేసియు బంపగ వాహనమ్ములన్
రయమున వచ్చిరంత యదువాయక ముఖ్య సమస్త బంధువుల్ 375

క. శుభదివసమ్మున విరటుం
డభిమన్యున కిచ్చె నుత్తరాంగన పేర్మిన్
విభవమున నావధూవరు
లుభయులు నన్యోన్య సౌఖ్యమొందిరి మిగులన్ 376

ఉ. ఆకసమంత పందిరి మహత్తర వేదియ వంతయంతగా
నాకసమాన పట్టణమున న్విరటుండిడి మానటేంద్రక
న్యాకసము ప్రభారవి ధనంజయ మాలికి గూతు నిమ్ముమన్
నాకసమబ్బెనంచలరె నాకులు లోకులు మూకలై కనన్ 377

ఉ. హెచ్చుగ దిద్ది తీర్చి జగమేలెడి కృష్ణుఁడు పెండ్లి పెద్దయై
మచ్చిక మేనయల్లుఁడభిమన్యున కన్నియనేర్చి కన్నియన్
దెచ్చి విరాటుడీయ జగతీశ్వరుఁడుత్తర జేయిబట్ట వి
న్వచ్చాఁడు వీయ మందెను సుభద్రను కూడి వేడుకన్ 378

వ. మఱియు సదస్యము నాడవశ్యప్రార్థితులై దస్యుగజకేసరియగు పాండవ పౌత్రుఁడభిమన్యునకు మాన్యులు సామాన్యులునగు సభార్యులు దార్యా శాపానుగ్రహ నిగ్రహసమర్థులైనమునివరులు పద్మారముల భాసిల్లు సేవలుగొని విశేష శేష భాషా కోవిదులై యపర బాషాపతారు లనిపించుకొని శ్రుతులవిశ్రుతులై తులలేని ధృతి శతధృతిని గూడ నేలుకోజాలిన యేలు కోటి బ్రాహ్మ్యమ్మొక కంఠ్యముగ శుభతర ఉదాత్తానుదాత్త స్వరిత ప్రచయ ప్రచుర స్వరము లెత్తి యావధూ వరుల పేరులెత్తి సిరలోరిమి కలిమి గలిమి మిగుల గులమునకు వన్నెవాసిదెచ్చి హెచ్చి మీసర మాసరికి మాసరము మానరికి బెరవారు రాలేరు సుమీ యనదగి యనదగని కరి మిదమి త్తమనదగని కవికరము తోఁజేయూత యిడి మనుచు నీ మను మనుమడను సీనినలె సంకల్పిత సర్వకార్య సిద్ధియు వాక్పతివలె వాక్సిద్ధియు బుద్ధియు కలిగి యుండు శ్రీకరమగు నీ కౌమరుని కొమురునకు ననంగత యువకత యనుగత ముగాకయున్న నతఁడు గొంతయెనవచ్చున నన్ను నీ సత్తముండు సమాన డయ్యు ననమానుండై సమానులలో నుత్తమ శ్లోకుండు గావుత సమానా ముత్తమ శ్లోకోస్తు అను నమవాకమును యదార్థపరచ గలవాఁడు గలవారిలో

ముంగలవాఁడై యరికి లోఁగని వాఁడై యవిచ్ఛిన్నపుత్ర పౌత్రాది సంతతి
నాచంద్రార్క స్థాయిగా నుండగలవాఁడు సకల సంపత్సమృద్ధి వర్ధిల్లు నని
వేదోక్త రీతి నాశీర్వాదము లొనర్చిరి. ఇట్టులమోఘ బ్రాహ్మణాశిష మనుగతి
మనుగత సర్వశుభాస్పదముగ నభిమన్యు వివాహమహోత్సవమ్ము నిటనేనాట
విని కని యెఱుంగని తెఱంగున జగన్మోహనముగా వర్థిల్లుడు

379

## ఉద్యోగ పర్వము

క అభిమన్యు వివాహమునకు
శుభముం గనవచ్చి నట్టి చుట్టాలు మహా
విభవముల నంపకము లయి
సభదీరిచి యుండ ననియె శౌరి సదయుడై 380

ఉ. విందు రోకో మదుక్తి మనవిందులు పాండవు లిందరుండగా
విందుల చేత గోలుపడి విత్తము రాజ్యము శౌర్యముండి లో
విందుల గానలంబడి రచెంచ గలంచదె వైరి చిత్తమే
విందుల కించి రాజ్యమును నేరిమి వెండియు జెందుటొప్పదే 381

ఉ పాపుఁడు ధార్తరాష్ట్రుఁడట బన్ని దురోదరమందు రాజ్యమున్
బాపుడు ధూర్తుఁడా శకుని పాల్పడి గీడ్పడ గ్రుష్ట శీలమున్
బాపురె ద్వాదశాబ్దములు పాండవు లబ్దము పడ్డ బాధలన్
బాపు నుపాయ మారయు బంధుఋణంబును దీర్పగాఁదగున్ 382

తే కావునను బాండవులు తముగావు మనుచుఁ
బోవువారలొ మిన్నకపోవు వారొ
బారి మున్నేలఁ దగు రాయబారి నంపి
మనుడు మైత్రిని భాగమిమ్మనుడు మొదల 383

వ. ఈ సంధి వాక్యము నాదుర్మదుఁడగు దుర్యోధనుడు వినడేని వడిగల వడముడి
కవ్వడుల బెడిదమ్ములగు వడిదమ్ములతని బుద్ధిమంతుని జేసి వినిపింపఁగల
వపుడు కూడ వినక కౌరంతలాడి గంతులు వేసిన నతనిరంతులు
నిరభ్యంతరముగ శాంతినంద నెంతయు శాంతి నవచాప గురువముఖ

మహాయోధాన యోధులు నడుమపడుదయ్యెదనకు దానయునికొనకెంతయుఁదప్పె
నని యాదుర్జనుండుని కొనడే యునికొనకేమి సేయు నప్పుడుంగూడ దప్పిన
దప్పిన ననేమి సేయుదునని చెప్పి నప్పుడుగాకుండ మాఱకుండి మోరకు
తనంబునకు దిగినేని భీమార్జున నకుల సహదేవులు వారి వారి ప్రతినలు
ప్రతిహతంబుగా ధుర్యోధన దుశ్శాసన కర్ణ సౌబలుల నార్చితేర్చి పేర్చి వారల
తండ్రి పెత్తండ్రుల యిరువుర రాజ్య భాగంబులు ప్రాజ్యంబుగఁబూజ్యశ్రీః
పూర్వకంబుగాగ లోగక చేకొని వీరులగువీరలె భాగించక బోగించకల వారని
రుషనిట శగ భగలు విడఁజెప్పి వారి ప్రాయంబు ప్రాయికంబుగాఁదెలిపికొని
పిమ్మట కాగలవని కాగలమేని వేచియుండక లేచి యాచక యప్పటి స్థితి
గతులను బట్టి యొక పట్టు పట్టి చూచికొంద మిందుమనకందరుకు వ్యవహార
తరుమూల కందమనదగిన ద్రుపదులు కార్యఖడ్గము లకు జాలి పారిన నాఁ
గాన వారు దయదైవార సంప్రతించి యిందునకు మందేమి యందురో
ముందరగ వినఁగోరెదనని మాన్యాతీత మహిమాను భావుండగు శ్రీకృష్ణ
దేవుండు తర్జనీ ప్రదర్శి తంబుగా నానావిధ వాఙ్మధురమ్ముగ నానతిచ్చిన
ద్రుపదరాజు వినతుండై వినసొంపగు వచనరచన విట్లనియె

384

ఉ. మన్నిక పెద్దసేసి యదునందను డందరి ముందరన్ నడిన్
బెన్నికతో దయంబలికె నిట్టులు నీయది నాయదృష్ట మౌ
నెన్నికసేయ నేడుగడ యేయన పార్థుల కెంతొగూర్పు వా
డెన్నిక పెట్టులైన హరి యీయన యేగుట సంధిక్షమౌన్ 385

శా. తీయంబెట్ట సమర్థుడచ్యుతుఁడు కౌంతేయార్థ సిద్ధ్యర్థమై
తీయం బుట్టినడంగ నేగినను సంధింగూర్పు నిందేమి లే
దీయం బెట్టను భాగమంచు ధృతరా ష్ట్రాత్మజుండడ్డు వా
దీయం బెట్టదముల్వచించి హరి ప్రాధేయంకరం జేయడే 386

క. ఆ మాటలు విని యందరు
మోమాటముగాదు నిజము మున్మాటికి ను
మ్మీ మాటలె మామాటలు
నీమాటలకేల శౌరి వేంచేయుఁదగున్ 387

ఉ. అప్పట మున్నవారు ద్రుపదాధిపు మాటకు మెచ్చి హెచ్చుగా
నవ్వుచు రాజ తంత్రమున నందెనువేసిన చేయి యీతఁడే
ముప్పట పాలుఁజూపి వినుముప్పటఁగాగ వచించెఁగావ నే
మిచ్చిన నీయువమ్మునా కడింధర కిట్లు ప్రియంబు పల్కునే 388

వ. అని యిట్లు దేవదేవుండయిన శ్రీకృష్ణదేవుండు వరానుగ నుడివిన మామఁదల్పులకు గడు వంతసిల్లి యందుండు నెల్లవారు నీమహామహుండు బావికార్యంబు నొప్పుగ నొడఁగూర్పఁదీర్పరి యని తూర్పుశ్రుతిధపురమునకు భారంబగు రాయబారంబు పొంటె వెంచేయుట కడువంచిదని తత్సభాస్థానమండలి సభాస్తరులందరు నైక కంఠ్యముగ బలుక జగదేక నాథుండ బాధకముగ వారి మనవిని విని యటుల సేయ ననుమతింప బాండవులేగురు శౌరి యండ కరిగి వేర్వేర నిట్లనిరి. యోదేవా దేవరదివ్య చిత్తంబున ననుమతి నుంచి కౌరవ నాథుతో నామాటగా మోమాట వీడి తడయక వెనుదీయ సామదానాది చతురుపాయంబుల నపాయంబుగ జెప్పియుఁ జెప్పించియు సంధికార్యము సఫలపరిచియు బలపరచియు తురీయోపాయము ప్రబల పరిచియు జతమ్ములు విఫల పఱచియు నెలవవలదని వెనుజరచియు వెరచి వెనుదీయక దాయకు దాయక యెత్తెరంగున నయిన యొక్కతెరగునకుఁదెచ్చి సంధినెరవేర్చి తత్తరమున బెందలకడ నిటరమ్మా యావలదేవర చిత్తము మాభాగ్యమని మఱల వేర్వేర నుడివి యేవురు గూడి యేకవాక్యతఁగఁదగ నిట్లనిరి.
389

క మనయొక్క బుద్ధిలో వి
త్తవముల నితరులు నగంగఁ దగవేటికి బె
త్తనముం దక్కఁ మనఁడు పె
త్తనమున నెమ్మదిగఁబ్రతుకదగదే మనకున్ 390

ఉ. పాలును నీరుబుంగలపి పాయక పాయకరంబుగాక భూ
పాలురు మాచినంతపిలఁబుంచి భుజింతము మీరు మేము మీ

పాలును మీరు మాజనకు పాలును మేమును కల్మికల్మి మా
పాలును బంచి యిమ్మనుము బల్కు సుయోధనుతోడ మాధవా 391

శా. ఈ రీతిన్ మృదు నీతి వాక్యములకు వారీకొన్న మేలేగదా
కారాకూరము లాడువాడు మనభాగం బీక దాకొన్న చో
క్షీరంబందు నవాజ్యమొల్కుటయగా చేటిట పోబోరవా
క్రూరున్ సామజ నాకసర్వపరివారుం గూల్తు మంచాడవే 392

కం. ఈ దృశ మార్దవ వచనము
నీ దృశకును వెలిచికాదు నీతి గనుక మే
మాదృతిఁజేసితి మీగతి
మాదృశులకు నిన్ను బ్రతిమలాడుటయేలా 393

వ. అని యిట్లు పాండునందనులు వసుదేవనందనుని తోడఁ దమతమ మనోగతంబులుక యెలుక పలిచి మఱచియు మరలి పాఱఁ జూచికొని వెలనలచి మే మొఱిగి యెఱుంగక మాట తెలుంగునకుఁ గడు వింతగా నుడివితిమి. నీకు నేర్పఁగాఁగల వారమా స్వామీ! హేమాహేములగు మీకు నెఱుంగరాని మఱుంగు లెందేనియుఁగలవే మాకుఁగార్యఖడ్గములకు ముమ్ముంగడవం బెట్ట మీర యేడుగడయు గాన మీరెయ్యది క్షేమం కరంబో యయ్యది తియ్యనగనొడగూర్చి యొనగూర్చి క్షేమానబోయి లాభానదమ్మా. స్వామీ జగన్నాటకసూత్రధారులగు మీకు మేము నేర్పగలవారమే హనుమంతుని ముందఱ కుప్పి గంతులాయెను నట్లుగావె. తాతకు దగ్గునేర్పవలెనా యని యనేక విధముల వినయ విధేయతలు నూపి సర్వాంగాలింగిత భూతలంబుగా దనకు నమస్కరించిన ఫల్గుణాదులను సగౌరవంబుగాఁ గౌగలించుకొని శ్రీ కృష్ణదేవుండు వారలనందఱ నుద్వేత్తుగా వీడ్కొని సాత్యకిసహితుండై సౌవర్ణధ్వజ యుక్తంబై సువర్ణ మయంబగు నిజ రథం బధిరోహించి వెడలి యుపప్లావ్యపు రంబు నిర్గమించి కతిపయప్రయాణముల హుటాహుటినడల గరినగరంబున కరిగిన హరిరాక విని సుయోధనాది కురుకుమారులును భీష్మ బాహ్లికాది కురువృద్ధులును ద్రోణవిదురాది గురు సద్వృద్ధులును నెదురు చనిన వారల నందఱ నందనందనుండు యథార్హంబుగా గారవించి గౌరవించి

జగన్మోహనంబుగా బురప్రవేశంబు గావించి యుందుగాఁ గురురాజ
మందిరమ్మున కేతెంచి యందు పరమమధుర సంభాషణ పురస్సరంబుగా
ధృతరాష్ట్రువిడ్కొని విదురుసదనంబున కరిగి యాతండు వినయమున జేయు
నాతిథ్యాతి సత్కారంబుఁ బ్రీతి పూర్వకంబుగా సంగీకరించి యంద విడిసిన
వినవచ్చి దుర్యోధనుండదరి పడి యదునందనా యర్చనీయుల మైన
దేహబంధువుల నమ్మందఱ విడనాడి గర్హణీయుఁడగు చతుర్థవింట
విందారగించుట యుక్తమే యని నిందించి పలికిన గోవిందుండన్నిటి కన్ని
సదుత్తరములు చెప్పి నొచ్చునీక వత్సా మాకత్యంతాంతరంగ భక్తుండగు
విదురుండేమిటఁ గొఅంత గోరంతయు విచారించక దూషించి భాషించితివి
మాకు సద్భక్తులగు పాండవుల యెడ ద్వేషివైన నీవు మాకును ద్వేషివై యుందువు
ద్వేషియింట భుజియించుట ద్వేషికన్నంబిడుట తగదని పెద్దలు వచింతురు
గాన మమ్ముభజింపనొల్లని నీయింట భుజింప నొల్ల మైతి మింతియ కాక
నీతోడ గొండొక రాచకారియము పొంటె నిచ్చటికి వచ్చితిమి గాన గతికిన
నతుకదని యెడి లోకోక్తి మదివిడి నీయింటికి రానొల్లనైతిమి ఇందు విందులా
వని మాత్రమునవే మనము విందులము గాక యుందమే యని గోవిందుండ
చదురులాడి యప్పటి కా తప్పులెత్తి తప్పించుకొని విదురు సత్కృతి నాదరించి
ప్రకృత మనుసరించు వాఁడై శ్రీగోపాలదేవుండు కౌరవ సభకు మనోభావ
నిశ్శంకుఁడై విచ్చేసి తనకై తెచ్చియిడిన కనకరత్న సింహాసనంబున సుఖాసీనుండై
దృతరాష్ట్ర భీష్మ బాహ్లీక ప్రముఖ నిఖిల కురు వృద్ధులు ద్రోణాది గురు
వృద్ధులు పరివేష్టింప రాధేయ ద్వితీయుండై యిరుగెలంకుల శకుని దుశ్శాసనుల
హస్తముల యందుఁ దనహస్త ద్వయము ప్రశస్త ముగ నుంచి యుచ్చ
సింహాసనంబున వచ్చి కూర్చున్న గాంధారేయ జ్యేష్ఠునిన్ శ్రీహరి తన శ్రేష్ఠంబగు
మేఘగంభీర నిస్వనంబున మంచిని బోధించ దలంచి యోయీ సుయోధనా
యని యామేటి వోటి యారబిల్చి సంబోధించి సురముని లోకంబు
లాకసంబున నొవర లోకంబుల ప్రోక సభాంగణంబునను జెవులు వోరఁ
బెట్టుగొని నెట్టన వినుచుండ మురహారుండిట్లనియె

394

చ. వినివడి దార్తరాష్ట్రులును బాండవు లొక్కటె తెలుంగు మాకునున్
బనివడి సంధి గూర్ప నిటవచ్చితినేఁ బనివేళగానను

వ్వని వడి వారిభాగ్యము సమంబున వారికిమ్ము చొప్పు నా
వ్వనివడి యేలలగాడుఁడిక వారును మీరును బాలు పీరటుల్ 395

క. అదివిని సుయోధనుఁడు కడు
నదరి పడుచుఁ బడుచుఁ దనవు టదిరిపడుట కూ
డ దదితగదంచు నందఱ
బదరఁగ నేఁబాండవులకుఁబాలిడ ననియెన్ 396

ఉ. అంతటఁ దల్లిదండ్రు లవుఁడాత్మ తనూభవు తోడ బాలకా
యింత యఖర్వ మిప్పుడన నేటికి మాధవుఁడావతిచ్చిన
ట్లంత యొనర్చి సంధిపడు మందున కొప్పక తప్పులేవి పీ
చెంత వహింపఁబోదు మన శ్రీయును నాయువు నిన్ను వీడ్కొనున్ 397

ఉ. మమ్మలరంగఁజేసి పెడమాటల నింకను గట్టిపెట్టి నీ
మమ్మలరంగఁ బార్థులకు మంచిగ భాగము పంచిపెట్టు మ
మ్మమ్మలభించు నష్టికలహమ్మనఁబొందు నఁదుష్టి నీదు గో
మమ్ముల పాలు సేయకు మహాత్ములు పాండవు లేల వైరమున్ 398

వ అందుల కంధనృపాగ్ర నందనుండు మొగమ్ము మురకటించు కొనుచుఁ
దరకటింపులు మాని దురభిమాని తన తల్లి దండ్రుల మాట గీటునఁ బుచ్చి
యెల్లరు విన నందనందనుఁజూచి యిట్లనియె
399

ఉ ఏది యెట్లైనను వ్వరియ యొందఱు నెన్నియుఁ బన్నివచ్చి న
న్నేది యొనర్పనవ్వేఱన వీఁతకు మిక్కిలి లోఁతు గల్గనే
నా దురదృష్ట మెట్టు లయినం జనవీ విధివ్రాత తప్పునే
మూదిని మోపినంతయును జోటిడ వారికి వేయునేటికిన్ 400

చ అదియునుగాక పాండవులి యక్రమవాదులు కాదటంచు వే
దదివిన నేమి పార్థకము పారెకు వారికి రాజ్యమెట్లు రాఁ
గుదురును గుద్రికూర్చికొని క్రొవ్విన జూదము లాడి యోడిమా
కరి విడరప్పుడట్లు విడనాటు లిప్పుడు దేరఁగా హరీ 401

వ. ఇంకొకటి కూడ వంకర బుద్ధులు మాని మానిత మార్గంబు శంక దిగ్ద్రావి
కింకిరిపడక కడచక విడక వినుమని నవబోధమండిల్లనియె

402

చ. రయమున రాజసూయమును రాణము జూడఁగఁబోయి నేనటన్
మయుపభఁజూచుచండగను మానము వాయగఁగ్రిష్ణభీముడున్
భయము దొలంగి నాకుఁదలవంపుగ నిప్పని యొప్పనే హరి
ప్రియముగ నన్నుఁజూచి వెలపింపకఁబక్కున నవ్వి రొక్కటన్ 403

గీ. ఇట్లు బహు వైరకారణమెల్ల వారి
వల్ల నిడుకొని నిర్ఘృష్టు లట్ల మమ్ము
పాడిదెలఁగితి మని తూలఁబల్కు లొకటి
కనగ గురిగింజ తనవల్ప గనునె చెప్పుమ 404

క. అదివిని యాదవ నాథుడు
కనకననగి యట్టి చెడుగు ఘటియించుటలో
లవలేశము నందేహం
బవునే ప్రథముడవు నీవటంటకు వల్పా! 405

చ తనరఁగ నెవ్వడీ తనదు తప్పును దామనెఱుంగఁడంచు నీ
వనినది నీకె తాఁకె నివుడన్యునిపై వడిమోపనేటికిన్
గొనకొని కోరుదేవి వినుఁగొన్ని వచించెద ప్రేల్మడంచుమీ
మునుకొని దోషమువ్యపయి మోపినఁబోనె నిజాఘ మంతయున్ 406

ఉ. పుట్టిన నాటఁగోలెఁ జెడు బుద్ధులు నీకవి యుగ్రపాల తోఁ
బెట్టినవే కదా తలఁపఁబెక్కు వెతారము నీవు వారికిన్
బెట్టవె లక్కయింట శుచి పెట్టి రగిల్చియు మాయజూజ మం
దట్టులు రాజ్య మూర్చికొని యారడి సేయవొకో ప్రజాపతిన్ 407

గీ. ఘోషయాత్ర మిషన్వారి ఘోష పెట్ట
బోయి వ్యతిఁదప్పి కములొట్టఁ బోయి తుదకు

వారు కరుణించి విడువంవ వచ్చి బ్రతుకఁ
గంటి వీవు మఱచితివో శౌరవేంద్ర! 408

క. మఱచితివే వారలనే
మఱచి శపింపంగఁ జండమౌని ననిపి యే
మఱచితి వెంచక వెతవే
మఱచిరముగ దైవకరుణ బ్రమందరు వారల్ 409

ఉ. శ్రాంతి నిశాంతమందున విహారిగ భీముఁడు గూర్క వానవి
శ్రాంతిని శాంతమందున విహారుకురాంఘ్రుల నంటగట్టి నీ
వంతట గంగఁద్రోసి వవిషాన్నమిడ న్వణఁ గీలు కొల్పితి
ట్లెంతకు లేవు నీ వహహ! యెంచిన మంచమునింద గన్నులే 410

ఉ. ఉప్పన పట్టె నూఱువుర కొక్కఁడె పావని యుద్ధిమై మిముస్
ముప్పడఁగ న్నఖాగ్రముల మోయగ మీరలు మాఱు మోయగా
యప్పుడు కాలు దంష్ట్రలకు నన్నలుదమ్ములు నైన యల్లడున్
గుప్పున నెత్తి వాని నొకగుండము వంబడఁ ద్రోయలేదొకో 411

మ. అని యన్నింటి నటుండనిమ్ము సభలో న్యాయివై వీవు పాం
డవ పర్వస్వముమాడ్చి జూజమున దానంబోక వవ్వంగ న
న్నువు లాశించితివారి పుట్టముల నీనొట్టులాడెం బరా
భవమే పో ఘనకార్య మంచనితివో పాపాత్మ విన్నేమనన్ 412

క నీచేతనైన వఱకును
నీ వత చేసితివి వారినిజమే వారిన్
గాచెను గాకవి యేటికి
నీ చేతలు వేఱయింక నేనువలెవా 413

క. అవి యెల్ల పాట్లు వారఘు
భవమందియు మఱచి మఱల పరాభవ మందిటుల్
సవినయమునఁ బాలడిగెద
రవివయ మేమిటికి వారి యంశము విడుమా 414

ఉ. ఇంతియకాదు మీరుభయు లెంతయు మైత్రిని గూడి యున్న మే
లింతయు నంతయంచనవి హెచ్చరికం గనువారమయ్య మే
మెంతయుఁగారె వేఱుగతి హీనము నెత్తురుకూడు మేలొకో
శాంతనవాది బుద్ధియనుసారము సారము సాఱఁజాడుమీ 415

ఉ నీవు సుయోధనుండ వొకనింబని లేదడు గంగ నెద్దియున్
శీవిని బాండు భాగము విడిన్విడి పుత్రులకింత నీవునా
రీవిధి మైత్రి నుండుఁడిక నేటికి మాటలు సంధిగాని చో
భావివిగాఁగలట్టిరి యభాగ్యమో భాగ్యమొ యెంచి చూడుమా 416

చ వెడముడి కవ్వడుల్కలహమబ్బి వినుంబడుముంచి యోధులన్
గొడవక మాచుముట్టుగను గొంతులు గోయఁగ పీవు వొంటమై
గడపఁగ దిక్కులేక యదికామొగమై నునుచోఁదలంచవో
కడుదయఁగ్రుష్ణుఁడాడినటుగా వినవైతి నటంచు దుర్మతీ 417

వ ఇట్లు దానపోషకుఁడగు వాసుదేవుండూని యావతిచ్చిన యపామాన్య
సామార్థ్యపాయంబుల ననుబంధించిన సంధిననుసంధింపక జననీ జనకుల
మాట పాటింపకప్పాట నిరాకరించి నరాకృతినున్న దురాగతకలి పురుషుండగు
సుయోధనునకు మహాయోధులగు భీష్మద్రోణ కృప విదురాదులయుఁ
బారాశర్య నారద భృగు భరద్వాజాత్రి మైత్రేయ ప్రముఖ మహర్షులయు
సంధికృత వాక్కులను వినక నిరాకరించినను బరాకు దెల్పు నట్లింక మఱియొక
సారి చెప్పమాతమని యానిరాచారులు నిరాఘాటంబుగా నరాకృతియగు
నాదురాచారునకు వైక్యకంర్యముగా విల్లనిరి

418

చ. రజనికరాన్వయాన ధృతరాష్ట్రుఁడు కాఞుఁడవర్ష్ణడేల్భడిన్
సుజనుఁడు గానఁబాండుపతి చూచెను రాజ్యమున్నదిం బలెన్
విజమువకొంచి చూడధరణీతల మెల్లను బాండురాజా దీ
గజపురివేలఁ బాండవులె కర్తలుగా కెటునీకు వచ్చురా 419

చ. అయినను బాండవేయులు మహాత్ములు గావున రాజ్యమంతయు
నయమునఁ గోదలంచి తమవారయిన లిద్దఱకైన యట్లు గా
దయను దలంచి పైబడక తండ్రి సగంబునె కోరి రిట్టి చో
నయముగ సంధికొప్ప కనయంబును జూపుట నీకుఁబాడియే 420

వ. అనిపెద్దలు సెప్పిన బుద్ధిని విననొల్లక పెడచెవిని బెట్టి కూర్చుండిన సుయోధనునితో మహానుభావుండగు శ్రీకృష్ణ దేవుండు పాండవులు కోరిన సంధి పర్యవసానాంశంబుం గూడ వినుమని మఱియుఁ జెప్పందలంచి యకలంకంబుగ నిట్లనియె 421

చ. కడకొక మాట సెప్పెదను గౌరవముప్పగఁ గౌరవేశ్వరా
యెడపక పాండవేయులకు నేవురి కేనుపురమ్ము లేలగా
వడివిడు వారణావత మవంతియు నింద్రి యామాదిప్రస్థముల్
గడుకొని హస్తినాపురము గాదన కాదన కారణంబుగాన్ 422

వ. అదివిని గాంధారీ నందనుండ దరిపడి చెదరక మళ్ళుజూపిన కెరలు మత్త కరీంద్రము కరణి దురాగ్రహమ్ము సూపుచు వసుదేవనందనా వారొండె వీరొండె పోరఁబగఱఁ బొగరడంచి మగపోడిమి జూపి రాజ్యంబు చేకొనుట యవశ్య కార్యమ్మనియు నది యవశ్య కార్యమ్మని యెంచు వారవశ్యులకు వశ్యులై వారుసెప్పినట్లాడిగము సేసి మను వారుగాఁదీఱుమానము సేసితిని గాన నత్తిరుమానము గలవారు గానకుఁ జని మౌని వృత్తి మనువార విదియును హృదయమూ ఆకనుఁ దూరక యదేవనిగ బోరక యింకనొకటి వినుము 423

ఉ. ఇచ్చెదు వాడటంచు నను నెందఱు నన్నను నోమి భూమినే
నిచ్చెడు వాఁడఁగాను గలహింపక మింపక గోపనందనా
వచ్చిన దారి బట్టు మిక వారికి యూరక పెక్కు లార్చినన్
అచ్చవడంగ నిన్నుఁబెడతొక్కులు గట్టి చెఱందవిల్చెదన్ 424

వ. ఇట్లు క్రిందు మీదు గానక కౌరవ నాథుండాడిన యగౌరవ దురాగ్రహ ఖర్వ గర్వహ ధూర్వహ వచనరచనకు నీయ గోవిందుండును సర్వమంగళా

ప్రదుండునగు శాంత శమార్యనంత కల్యాణగుణుఁడును శ్రీహరి దరహాసగ్ర
పిష్మగండ యుగళుండై కౌస్తుభాలంకృత గళుండై కలకలనగి యిట్లనియె 425

ఉ. ఏలర త్రుళ్ళు నీకిటుల నేలను నేలగ మీరు మీరు పో
రేలర యంచుఁ బంచి తినుఁడీ కొనుఁడీ కొనక్షమయ్యె నీ
కాలము సామజాప్తతను ఖాళిగ నీనవిఁబెట్టనిద్ర పోఁ
గాలము చేరువౌట సుమీ గాలము మ్రింగెడు మీల పోలికన్ 426

చ. ననుఁజెనకంగ నీకుఁగురువందున యిందనకాదు ముందుఁగా
నను దలక్రిందుగాఁ దవమొనర్చును జన్మము లెన్నికోట్లు నె
త్తిన వశమౌన బ్రహ్మకును దీరని కారియ మీవువేర్తువె
త్తినఁబడద్రోసి కొంచు వలతిన్ జని మూరెడుకుంగఁ బారెడున్ 427

ఉ. చిట్టలుగాగ నిందలికి చిల్కకుఁజెప్పిన యట్లు నీకిటుల్
బిట్టుగ బుద్ధి సెప్పఁ జెవిఁబెట్టవు భూప్రజ నీవె కాకపోఁ
గొట్టుదు దీనఁదాఁ జెడిన కోతి వనంబును జెర్చె నన్నయ
ట్లుట్టిని గట్టికొంచు నికనూగెదవో జగముండువంతకున్ 428

ఉ వన్నెయు వాసి గోల్పడిన వాని జడున్ వెనరాజ్యలక్ష్మి తా
విన్నను వీడి ధర్మసుతునిన్ వరియించుఁ దిరంబుగా నిదే
తన్నును నీతలన్ బక నిదారిగ దాహతిఁగూల్చి నీతొడల్
నన్నును నన్న యప్పుడయినన్ మదినెన్నవొ నొచ్చి కౌరవా 429

వ. అనియిట్లు దేవదేవుండైన శ్రీకృష్ణదేవుండు దుర్యోధన దుర్వ్యవసాయంబ సమాధాన ప్రాయంబుగాఁ దెలిసికొని నీకుఁబాండవుల తోఁబొందెడఁగూడఁ గూడని కార్యంబుగాఁ దోచి కూడని కార్యంబగు యుద్ధమె సిద్ధమని బుద్ధి మంచితివేని మంచిది నన్ను నమనస నాఁడు నాడ నంగ లనీసేనలతో నీవు కట్టాయి తమ్మిమ్ర త్తుల కౌస్త్రజల సమృద్ధమైన కురుక్షేత్రమునకు వేరమ్మన వేరమ్మని యావతిచ్చి తన్నుఁబట్ట దలంచిన గాంధారేయు ధురభిప్రాయంబతని కపాయకరంబుగాను భానుని మ్రింగను బిడుగును బిడికిలించను జడధి బుక్కిలించను జదల నక్కిలించనుదమకించు వెంగలిగ రారాజు తన్నుఁదారూ

రుకొని యూరకొను నట్లుగ సభమున్న వారలెల్ల వెల్లడిగ వెఱగుపడి యొఱగి
నోళ్ల దెరిచికొని వెఱచి యఱ్ఱులెత్తి తత్తరపడునంగొను మండ నీతి
మానుషరూపంబగు విశ్వరూపంబు జూపి యాదివ్య రూపంబు చూడగోరిన
ధృతరాష్ట్రునికి దివ్య దృష్టి యనుగ్రహించి భక్తులకు సంతుష్టి యొనరించి
యపారకృపారసంబు నించి యంధనృపుప్రార్థనదివ్య రూపంబునుపసంహరించి
దుర్యోధనాది దుష్టచతుష్టయికి శృంగ భంగంబు కావించి వారల లజ్జాబ్ధిముంచి
పెర వారల సంతోషాబ్ధిడించి నోలలాడించి మరల యోగ మాయగొని
యద్భుతమెల్ల వెల్లడించి యుద్ధసన్నద్ధులై కురుక్షేత్రమునకు రమ్మని భీష్మాది
కురువృద్ధ యోధులకు సమర్మకంబుగాఁ దెల్పి తన తమ్ముడు సాత్యకి
తోడరా విదురుని మదిరింజిల్లఁజేసి కుంతికి జింతవాయనుడివి మరల
పాండవుల వద్దకు విచ్చే యువాడై యానరదుండ రథంబెక్కి రాధేయు మది
దెలియ తన యరదంబుపై లేచి బిలిచికొని రాధేయా నీవు కౌంతేయుండవుగాని
సూతపుత్రుడవు గావని చతురుహాసంబుగార కార్యంబు ప్రకాశముగాఁతెల్పి
నీవుపాండవులఁ గలియ వచ్చిన రా లచ్చికి విన్ను రాజు జేయుదునని నక్కర్ణుని
దాక్షిణించి యోయదు నందనా నాపై కృపారసంబున నీవు పలికి తింతియ
చాలు నిప్పట్టున బాండవులనేఁ గలియ వచ్చుట సర్వధాయ నాదరణీయం
బుసువహా పాండవులకు దివ్య వారింగలసితివని నాకును నాకువెఱచి
మధ్యమపాండుండు నన్ను నీ మూలంబున లోఁగొనెనని ఫల్గుణునికిని
నవినడిన్న మాయిరువురకిల్ల లోకోప వాదంబు శాశ్వతముగా జగంబున
విలుమనది యట్లుండనిమ్ము చిరకాల సర్వజన కాంక్షణీయమగు యుధిష్ఠిరు
సింహాసనా రోహణమునకుఁ గొంత కాకున్నఁగొంత యేవంత రాయంబు
వాటిల్లునతండు రాజ్యంబు సేయుటనేమజేయుట కంటెనా కతిప్రియంబుగావ
నాతని రాజుంజేయు మింకొకటి కూడ మనంబున ఘనంబుగ మంచఁదగినది
యాబాల్యంబుగ నన్ను నమ్మి తనయొత్తు మానిసింజేసి వాసిగఁ జూచు
సుయోధను నే నిప్పుడు మోసము సేసి నేఁడు విడనాడి పాండవులం గలిసినఁ
బదుగురు వఱియుఁ గుప్పగూర దూరుదురు నాకనిమిత్తముగా
మిత్రద్రోహంబు గూడ వాటిల్లుఁ గావున నీమాట నిరాకరించితి నని యెంచక
య్యది మదిమంచక నన్ను మన్నించి సుయోధుని వల్ల నన్నుండనీ నీదయ
జయంబు పాండ వులదని నీవు నేమ గాక యాబాల గోపాల మీ జగ

జ్ఞాలమ్మెఱింగిన పనియె గాన యో గోపాల దేవా నన్నుక్షమించి యీప్రశంస
ప్రసన్నముగా నీమదిమెండ నిచ్చి నన్ను నెమ్మది నీడ్కొల్పవే శ్రీకృష్ణయని
సవినయంబుగా బ్రార్థించి యుత్తరమిచ్చిన యుత్తరణి సుతుని స్థిరాంత
త్యమునకు మెచ్చి యాకర్ణని దనయరదంబు డించి సాత్యకిం గూర్చికొని
వసుదేవ నందనుండు పప్లావ్యంబునకు విచ్చేయుడు నంత నిక్కడ
ధార్తరాష్ట్రుధూర్తతకు నసహ్యపడి భీష్మాది కురువృద్ధు లిట్లనిరి

430

సీ శ్రీకృష్ణునకు మీరు సిరిగల్గమన్నింప
    కల్గుమ శుభమని కవలి రోకలు
ఏది యెట్లైన నీమీఁద గాగల యది
    బాధకే యనిరి భీష్మాది కురులు
కాను వీనము సేయదీ సువాసిగ సభా
    వాసోక్తి వినుమని వ్యాసముఖులు
విదురుని మాటకే యెదురు చెప్పఁగఁబోక
    యదరకు మంచును విదురమతులు

గీ వేయునేటికిఁ గాను పాండవేయుల విల
వెందరేగిరి వారితో నేగకయ్య
భూమి కలకాల మీవుండఁబోదు వాక్కొ
వసుధ నీవెగ నీతోడ వచ్చునొక్కొ 431

వ. అని వల్కిన సుయోధనుడు బెల్లముకొట్టిన ఱాయి చెందముండెన్ 432

వ అంత నక్కడ దేవకీ నందనుండనుజ సహితుండై యుపప్లావ్యంబునకు
నవ్యంబుగా భవ్యగతి సమీపించ వచ్చె నని క్షత్ర సుఖవాణి నాకర్ణించి

433

క ధర్మజాఁడనుజ సహితుఁడై
శర్మదుఁడగు హరికి నెదురునని యుర్ణగతిన్
నిర్మల భక్తి గుమంగొని
ధర్మాంబరు తోడ నిట్లు పలికెంబ్రీతిన్ 434

గీ. అనఘ దుర్యోధనుఁడు సంధికనుమతించె
నేయునఁగడగి శౌరి పేనెఱఁగి యాలు
నెలలు వాయించి విడిన మద్దెలదిగట్టి
యదియొ యోటిదియో యని యడుగ నేలా? 435

క. కనగా ముంజేతి కడెం
బున కద్దంబేల చిత్తమున నుండు తలం
పనువుగ మొగ్గమున వ్రేలఁగ
ననమునఁ చెయియద్దనెట్టి మదికన వలెనో 436

క. చెప్పఁదగినంత చెప్పితిఁ
జెప్పందగు వారిచేతఁ జెప్పించితివాఁ
డొప్పుడు సంధికి నాచే
నప్పటి కయినంత పొర్లు కాడితి నుమ్మీ! 437

ఉ. ఊపిరి భీష్మముఖ్యలోకయూవు సుయోధనుఁడు గొంతులో
నూపిరి యుండగా మనకు నొప్పడు చొవ్వడ భాగమీగ గా
నోపితి రేవి ఊనినవి నోర్చికొనుండిఁక నేల బేలవై
యోపిక బట్టనేల గలియుంచిన పిమ్మట నుట్టఁగవ్వటుల్ 438

వ. ఇట్లు కరిపురమున జరిగిన సంధికథలెల్లఁ జల్లగ శ్రీకృష్ణుండు పాండవుల
కేమియు దాచక పూసగ్రుచ్చినట్లొప్పుగ జెప్పి యనువుగ మీకనుగులగు వారలఁ
జారుల నంపి మీ చుట్టముల పార్తి నాయా పార్తి నాయా పట్టుల కిప్పట్టున ఁబ
ట్టుదలతో సందేశము లంపి జంపు పేయక యాయాదే శాధి పతులఁ బదాతి
సంహతులతో విటకు రప్పించి కావి యవికి నన్నిట సన్నద్ధులై వన్నిటకు
రప్పించికొనుండిడి నెచ్చులారా యచ్చెరువుగఁ బోయి వచ్చెదనని పుండరీ
కాక్షుండు పాండవుల వీడ్కొని వారక ద్వారకకు విజయంబుసేయు
విజయుండరే ప్రకారంబున నాహ్వాన పత్రికలందరికిఁ దొందరగ వాసిగ
వ్రాసిపంపెనంత

439

అరిగెలు తోడరా హరినహోయము గోర సుయోధనుండు ము
న్నరిగిన ద్వారకాపురికి నర్జునుడున్ జని నాఁడ కౌరవుం
డరగిలిఁ గూరుచుండెఁ దలయంపికడన్ హరిపాదముత్తుమున్
నరుడును నిల్వ శ్రీహరి ధనుంజయు మున్గని కాంచెనన్యునిన్ 440

అప్పుడు గొప్ప గద్దియపై గూర్చుండి కౌరవనాథుండు గొంటంబుతో
యదునాథుని కిట్లనియె

441

మున్న వచ్చి తివిరితి నమున్నతి నిర
తిని నొనర్పక తోడరుదెమ్ము నాకు
ననఁగ విని శౌరియనియె నన్నన్నవిజయు
ముందుగంటిమి గానయే ముందు యెందు 442

అయిన నింకొక్కటి గల దిందుగల యోధుల నందఱ నరమర విడఁచెప్పి నారివారి తరముతోగూడ మాముందఱ మఱసేయక యెఱింగించెద చెదరని మదిఁజోసి వానినేమినొఱుగులున్న నవఱఁగ నవరించుకొంచుఁ గించుతనము సేయక మంచి చెడుగు లెంచి పాఱఁ జూచికొని తోచిన తెఱంగున యోచించుకొని కొనుండని వారలిరువురకు నెఱుకపఱచి శ్రీకృష్ణుండు మఱియు నిట్లనియె

443

నిజము విరాయుధుండనగు నే నొకయెత్తు మదీయ సేన వూ
ని జముని రాయశక్తిగల నేర్పరి సాయుధ యొక్క యెత్తె పీ
నిజము ఘలందుఁగొండికయు నేరిమి నేరికొనంగ నన్నవో
నిజముగ నీడి చక్రధరుని న్వరియించెఁగిరీటి కృష్ణునిన్ 444

గోపాలుఁడు నారాయణ
గోపాలురతోడి సాటి గొనఁదగఁడని యా
గోపాలుఁడు విడి కృష్ణుని
గోపాలువరించి చనియె గొబ్బునఁ బురికిన్ 445

అంత గుంటినందమునితో నందనందనుడు కూరిమి మీఱ మేలము లాడుచు

నాలమునకు జాలిన నారాయణ గోపాలురగాలు బలంబుబోవి బాలుర
గాలు బలంబుల విడనాడి తోడువడ జాలని నన్నేల కోరితివి వన్నిటు
లేరికొంటివ న్నిట నెట్టి నైతివి గదా యని గదాయుధ ధరుండు కోడిగంబు
సేయ గ్రీడియుఁగ్రీడగ దగు నుత్తరంబిచ్చె నెట్లనిన

446

క. కనుగొంటివి పొరపాటున
ననుఁగొంటిగ శౌరి పార్థుఁడని నన్నూఁదే
వనికొంటేఁ జాలుదును వి
న్ననికొంటివి గొంటెఁబరముఁడని కొంటినెన్ 447

గీ. ఇట్టువెలలేని నల్లావ మెంతవింత
వంతనమ్మువ జేసి రోరంత ప్రొద్దు
నరుడు నారాయణుండును నరుఁడు మున్ను
విరటువగరికిఁజని హరివెళ్ళ వెనుక 448

వ. సుయోధనుండు కరినగరు కేగుచో బలభద్రు సౌధంబునకుఁబోయి హలింగాంచి
యిట్లనియె

449

మ. అనఘా కృష్ణుఁడు పాండు సూనులకు ముఖ్యాప్తుండుగా నుంటకున్
తవరన్ మీరలె నన్నుబెంచి కడుబెద్దంగ జేసి యుండాక నా
యునికిన్ వీడకనుగ్రహంబుమ గదాయుద్ధాదులన్ నేర్పుటల్
నను మీశిష్యుని నాప్తుగాఁ గొనుఁడు దానన్ గెల్పువాకావనిన్ 450

చ. అనవిని రౌహిణేయుడవి నావ్వుడబోదువు నాకునో సుయో
దన విను కృష్ణువీడి కలతున్ నిమునంబు వశింపజాలనే
గొవ వినురాధి కృష్ణునకు గూడని పార్శ్యమునందు మందు నే
జనియెద దీర్ఘ యాత్రకిటు సాయముపోవని యొట్టు పెట్టితిన్ 451

చ. అనుటయు నాసుయోధనుఁడు నవ్యతునగ్రజు చూచి వెండియున్
మనుగొను వీడు మెట్టులయిన న్సరియే విను మొక్క మాట నీ

యనుజా పురోధ్భలంబునను నైనను గూడకు మయ్య పార్థులన్
గొవకొని యట్టె నీవు నముగూడుట కంటెను జాల హెచ్చగున్ 452

వ. వీరలేగాక యింక దుశ్శాసన దౌశ్శాసనులును జిత్రసేన వృషసేనులును నింకశకునులును లక్ష్మణకుమారుండు నలంబు నుద్వయమ్ముగను లోమగా గరకరులగు గట్టు పకాసులా యోధనమ్మున సుయోధనునకై తమతమ ప్రాణమ్ములు తృణప్రాయంబుగఁ జూచి దాచక విడువనైన విడికిలందు మనుచునున్న వారికీ బాండవ బలంబునగల దండిమగల వినుము 453

సీ శ్రీరాము వంతటి శూరాగ్ర గణ్యుండు
హరికి బహిఃప్రాణమర్జునుండు
హనుమత్సమాన మానాతీత నాగాయు
తత్రాణుడల వృకోదరుడ దరుడు
మహి బుష్పవంతుల మాద్రి మాద్రేయులు
ద్రౌపదేయులు బలస్వాపతేయు
లనిదారి ద్రోణ భీష్మసుమనుల్ద్యావి
గాన దృష్టద్యుమ్నుడును శిఖండి
గీ అనెడు ఘనమార్గహోరులు నపరపార్థు
లగుదురభిమన్యుసాత్యకులాఘటోత్క
చుండురెండవ పంక్తి కంరుండునమ్మ
మనుచు బల్కెను బలరాముడపుడువినగ 454

క. సాత్యకి బార్హద్ర ధుడును
కృత్యజ్ఞుండైన దృష్టకేతుడు విరటు
డత్యంతాదృతి ద్రుపదుడు
బ్రత్యేకాక్షౌహిణులవ్ బద్రంగొని రాగన్ 455

క. కెల్లగ గేకయు లట్టులె
మెల్లగ నక్షౌహిణీ సమేతుండయి రాఁ

జిల్లర మల్లర పనులుం
జల్లగ దాదాపు సప్తసంఖ్యకు నిండెన్ 456

శా. ఏడక్షౌహిణులయ్యె బార్థులకు నాల్గెప్పుడయ్యె లాతుల్ బరుల్
మోదంజేయుచు మేము మేముచు బల్మార్థించి యేరెట్లురై
నీడం బోవక చంపుటొండె రిపుగారేఁ జత్తు మొండె న్మతిం
కేడన్ మూడవ బాట లేదనుచు జేసేప్పువ్విడన్ సైన్యముల్ 457

క. క్రొత్తగ శల్యయవన భగ
దత్తులు భూరిశ్రవుడు సుదక్షిణ నీలుల్
కృత్తరిపుడు కృతవర్మయు
సత్తుగ విందానువింద సైంధవు లంతన్ 458

క. పేరొక్కక యక్షౌహిణి
నూరెల నేలేర దోడు నూపిరి పెరవా
రీ రెండక్షౌహిణులన్
ఘోరుసదుర్యోధనునికి బోడనూపుట యున్ 459

క. అదియిదియు బెరసి వెరసికి
నదముగ బదునెనిమిదయ్యె నక్షౌహిణు లా
యదను బదనగుచు సరిపడ
బదునెనిమిది దినములకును భారతశలికిన్ 460

క. అరిదిగని రువాగులు నిటు
లరిగె గురుక్షేత్రమునకు నాలముసేయన్
హరిహరి కరికరి గిరిగిరి
శరధి శరధి దాకునట్టి చందముగాగన్ 461

వ. సర్వసేనాధిపత్యమున కెవ్వరు సరులని యజాత శాత్రుండడిగిన విరాట ద్రుపదు
లర్హులని మాద్రేయులును దృష్టద్యుమ్నుండు యోగ్యుడని ఫల్గునుండును జెప్ప
462

క. జిష్ణుని మతిముంగవి శ్రీ
కృష్ణుండ భిషిక్తు జేసె దృష్టద్యుమ్నుం
జిష్ణుని సేనకు గుహువశి
జిష్ణునయోనిజుని సర్వసేనాపతిగాన్ 463

వ. మరియు వక్లె విరాటద్రుపద బారాసంధి దృష్టకేతు చేకితానయుయుధాన
శిఖండుల ప్రత్యేకాక్షౌహిణీ నాయకులు జేయుదు నెదిరి బలంబున

464

క దుర్యోధనుడును నతిగాం
భీర్యాంబుధి తనదు తాత భీష్మా చార్యున్
గార్యా కార్యజ్ఞుని ఘన
శౌర్యుని నభిషిక్తు జేసె సైన్యాధిపుగాన్ 465

వ. మరియు కృపద్రోణ ద్రౌణి కర్ణశల్య బాహ్లీక భూరి శ్రవ శ్రుతవర్మ శకుని
కాంభోజ సైంధవుల బదునొకండ్ర యోధాను యోధుల నేకాదశాక్షౌహిణీ
నాయకులుగ బ్రత్యేకంబభిషేకించెనందు.

466

చ. హరికృతికి న్మనువ్యకృతి కంతర వయ్యచలాణులంతగా
హరివియమింప నొక్కి ద్రుపదాత్మజుడేలెను బార్థసేన సు
స్థిరుఁడయి యాజి సొంతమున ధీజథ నూర్మరు కర్ణ శల్యులున్
గరుపతి సైన్యనాథులయి కూలిరలంబి దినాల కొక్కరై 467

వ. అనవిని జనమేజయుండు తదనంతర భారత కథనానతిమ్మనుటయు 468

కమల విలసిత వృత్తము :

కమలనయన ధృత కనక సుచేలా
దమిత దనుజరిత దనక కచేలా
విమల హృదయ ముని విదిత సుశీలా
నమదవర వరదనత శుకలోలా 469

వ. కురుక్షేత్రంబునవతి మాత్ర జయకాంక్షఁ బోరునక బోరున కాయితమై
తారసిల్లియున్న యవసరంబున నిరువారలకు మధ్యస్థుండె కురువృద్ధుండగు
భీష్ముండు గురుబుద్ధిగ నాముద్దిగెకొనుండు కొనుండ పారా వర్గళ జయభాగం
బొండె వీరస్వర్గ భోగం బొండె నని శూరులెల్ల వినవెలుంగెత్తి యిట్లనియె

క. వైకుంఠైకాదశికిని
బ్రాకట ఘనముక్తి యుత్తరద్వారముటుల్
చేకొన స్వర్గద్వారము
నీకినికిని దెరవఁబడియె నేడని కనియెన్ 471

చ. అదియదనుంచు నమ్మతమి నందఱ ముందర ధర్మరాజనెన్
మదిమది డిళ్ళపైఁ భరుతమల్లిన వారలు మట్లఁ డిళ్ళకున్
బెదరక ధార్త రాష్ట్ర పరివీడినుముంగలియంగ నెవ్వరే
నెదఁదమిసేయుచున్నఁ బఱయెంచక రండిటఁ గాతువారలన్ 472

చ ఇటుల యుధిష్ఠిరుండనిన నెంతయు వింతగ స్వాంతనమ్మ
దటుకునఁదాయు యుత్సుఁడొగిఁదత్సరి వారము వెంటరాగ నె
క్కటి విడనాఁడె యున్ననిఁగానలుఁ డంచెనె యెంచి చేరె న
క్కట రిపుఁడైన ధర్మజునిఁ గారణమీతని ధర్మశీలమే 473

మ. అగుణుండైనజనున్సహోదరుఁడు హేయంబంచుఁబాయుంజామి
సుగుణుండైన నమిత్రుపాలికి జనున్ శోధింప నీరెంటికిన్
దమదృష్టాంతములౌ విభీషణుఁడు భ్రాతన్ వీడి రామున్‌గనెన్
బగతున్మెచ్చి యయుత్సుఁడిప్డు విడియున్నం బార్థునింగూడుటల్ 474

న. అట్టియెడ నిరువాగు దొరలత్తుకొని కత్తుకొని కత్తులార వెడలించి నత్తుగ
నొడలు వెంచి చిందమ్ము లలర నొత్తి తోరంబుగ బోరఁదారసిల్లు తఱి
ధర్మరాజు తేరు దిగున డిగ్గనులికి నిరాయుధకవచుండై వినీత వేషంబుతోఁ
బాదచారియై పరసేన కభిముఖంబుగ నెగ నడచి పోవునెడ నివ్వత్సుఁడు
లోనగు వారిది యేమి యచ్చెరు విట్టు లీరాజు వెఱ్ఱి యెత్తి విచ్చుకత్తులపై

కేగనవియుఁజ్ఞులెత్తి మూమమఁవిఱుండవఁ బోవు వారై వాసుదేవునలన తమనముతగమన కారణంబు పూర్ణంబుగాఁ దెలిసికొని మన్నన మన్నకోటు విడువక తిన్నగ నతని నొకకంటఁగనిపెట్టి యుండి కమగొను చుండ యుధిష్ఠిరుండరిసేనఁజొచ్చి భీష్మాచార్యునడుగు దమ్ములపైఁదమ్ములతోఁగూడ వ్రాలి తాతా యీ తరుణంబునఁ ద్యాత వినీతిని సమరంబునకు (నం) నమర నీతిదమగు నను జన్నవదయం దలంచి సన్నిధి కి బనివిన్న వాఁడతిగా ననిందార నామనోరథం బార గూర బండునట్లు ఘనభావన మీదీవన బెట్టి యనికి సెలవిండు అని సవినయంబుగాఁ బ్రార్థించిన నాతని వినీతికి బ్రీతుండై గాంగేయుండు నీవిప్పుడు నాపాలికి తోతెంచి మేలు సేసితి వట్లు రానినాఁడు నీకు నావలన మనస్తాప కరంబగు శాపంబు ప్రాపింపనై యుండె నీయట్టి బుద్ధిమంతున కోరులచే జెప్పింపకొన వలసిన కొలంత గోరంతయైన నే నీకు నావునఃపూర్వకంబుగా న నికి సెలవిచ్చితిఁగాన మువ్వాటికిం జయముగొని ప్రాజ్యంబగు రాజ్యంబు సత్సామ్రాజ్యంబుగా పరిపాలింపుము వత్సానావాక్కు మోయమ్ము కాఁబోదు నాయనా పోయి రమ్మని నోటియార మాటాడి వీడ్కొల్పిన నతండట్ల నవ్వేళ కృపద్రోణ శల్యులగని వారి దీవనలకైవడినే గైకొని తిరిగి యేగి యెప్పటియట్ల తన తన రథంబధిష్ఠించి యుద్ధ సన్నద్ధుండగుటయు

475

శా. గాంగేయుండు సుయోధను ధ్వజిని కేక చ్ఛత్రసేనాని యై
సింగం బాకొని వేటి కూటనకు వాసిన్ దూకు చందంబుగాఁ
బొంగారన్ దినమొక్క రూపుగొనుచున్ బోకార్చి వీరావలిన్
భ్రుంగించెన్ బదివాసరంబులు దమన్ భూషింపఁగా జావఱుల్ 476

క. భరముగ నిరుమొనలును ని
బ్బరముగ బవరమున కదర వసుదేవ సుతుల్
నరుఁ డిరుమొనలను గనుఁగొన
వరదము నడుమ నిడుమన్న హరియటు సేసెన్ 477

# భగవద్గీతా ప్రారంభము

కం ఘనుడర్జును డిరువరులన్
గనులారగ రెప్పవేయక యరిది యరథం
బున నిల్పి పెఱవ నందర
గనుగొని తన మనము నందు గరుణ గదురదున్ 478

ఉ తాతల భ్రాతలన్ సుతులధన్యుల మాన్యుల నెల్ల బంధులన్
నీతి విఘాతినై గెడపి నెత్తుర్థి కూడు భుజింపజాల నా
కీతరి చేత విల్లమరకొంతయు భ్రాంతిని యే వణంకెడిన్
జేతము భీతమయ్యెనని సేయగ లేనని జారె దేరిపై 479

చం అదిగని సర్వలోకగురు డచ్యుతు డర్జును జూచి ఫల్గుణా
యిది తగునయ్య నీకు వతిహేయము ప్రాణము కంటె మానమే
మది ఘనమంచెఱుంగవె సమానులు మాన్యులు నవ్వ నెవ్వగన్
వదులుదురే కర్షమకభి వాంఛిత లాభము వెళ్లవై యిటుల్ 480

చం వినుమొకమాట సెప్పెదను వేయునికేటికి జావు వేరు జీ
వునికిని లేదు పుట్టువభవుండవినాశి నెవండు సంపు దే
వునికిని బాయనట్టి వరవున్ ఘను శాశ్వతు శేషభూతు నీ
యునికికి కారణంబు తనుయోగ వియోగము కర్మ చేసగున్ 481

చం. కనుమిహలోకమందు దనకర్మగతిన్ దనువున్గొను న్విడున్
మనుజుడు ప్రాతవల్వవిడి మారుపటంబు ధరించుకైవడిన్
తనువును వీడిగైకొనుట తప్పదు జీవునికెన్న ముక్తిదా
కనుగొనకన్ జగంబున నొకండతవిన్ గెడువ న్సమర్థుడే 482

ఉ. ముక్తికి మార్గము న్వినుము ముఖ్యము రెండు విధంబు లంద్రు మ
ద్భక్తి యునుంబ్రపత్తియును భక్తికి జ్ఞానము సాధనమ్మగున్
శక్తికి సాంఖ్య కర్మములు సాధనమందురు జ్ఞానసిద్ధికా
సక్తిని గాన శ్రీహరికి సాగిలి కాళ్ళబడు బ్రపత్తియా 483

ఉ. భక్తి భజింత్రు మౌనులు నభంగుర శీఘ్ర తమః ప్రభావులై
శక్తులు గాన మానవుల శక్తులుగాన బ్రవర్తిఁజేసి త
ద్వ్యక్తిని సర్వధర్మములు దూరముగాఁగఁ బరిత్యజించి న
ద్వ్యక్తిని ముక్తినిమ్మనుచు నొక్కని నన్ శరణన్న గావెదన్ 484

చ. విరివిగ భీష్మముఖ్య కురువీరులు వీరలు మున్నె సచ్చిరీ
వరయ నిమిత్తమాత్రమగు మందున బొందెదు కీర్తి పూర్తిగా
నరి యిటుమాడు మంచు హరినర్వము గర్వము వాయజెప్పి యా
నరునకు విశ్వరూపముగమన్ ఘనదృష్టి ననుగ్రహించియున్ 485

చ. సకల జగంబు జంతులకు సత్త్వ రజస్తమములుగ్గుణంబు లా
ప్రకృతినిల్పి గల్గి తంతువుల రంగు పటంబున కెట్లు లెక్కనో
ప్రకటము లాగుణంబులు ప్రపంచములోనికి వ్యాప్తమైనటుల్
కకవికగాక సాత్త్వికుడు కంచును మోక్షము నాదు సఖ్యమున్ 486

చ తనర విరాకు లేక విని తత్త్వములా చిద చిత్తులీశ్వరుం
డన జని మూడు మూటికి లయంబును పుట్టువు కేడ చిత్తునం
దునగున సత్త్వమున్ రజమునందము ముందును చిత్తుతఁలోన
త్తును జీవిపించి కర్మగతితో సృజియింతు భరింతు ద్రుంచెదన్ 487

వ. మఱియు నింక దత్త్వంబుల వివరంబు వినిచెద వినుమని హరి నరున కిట్లనియె
488.

సీ చిత్తన జీవుండచిత్తన ప్రకృతి యా
ప్రకృతి మహత్తుగా బరిణమించును
నది యహంకార మా నద్దాన మనసును
జ్ఞాన కర్మేంద్రియ పంక్తి చేత
బది యింద్రియమ్ములు పంచమహాభూత
పంచ తన్మాత్రలు పరిఢవిల్లు
నిట్టులు ప్రకృతియా నిరువది నాల్గు త
త్త్వము లిర్వదేమన తత్త్వమాత్మ

గీ. యిట్టి ప్రకృతి విశిష్టుడైనట్టి జీవు
డీశు శరణనివేడి రమేశుకృపను
ముక్తుడయ్యెడు నందాక పుట్టుగిట్టు
మందు బద్ధుడనం జెల్లియుండు నట్లు 489

వ. కావున జనన మరణమ్ములు లేని జీవుని జంపు వాడెవండు జీవుండు తనకు శరీరంబుగ నున్న బ్రకృతిని దానుగ భావించి తాను గ్రిశించితి దాఁబలిసితినని తనముగా భావించి తన శరీరంబు తానగునా యదియు విపరీత జ్ఞానం బట్టి వనించి విపరీత జ్ఞానంబు నొందనేల ప్రకృతి సంశ్లేషంబు విడుమట కించిత్కాల విశ్లేషంబుగాని జీవునకది మృతిగాదు అట్టి విశ్లేషం బొండొక శరీర ధారణాపాదకంబు గాని బద్ధుడగు జీవునికి ముక్తావస్థ పర్యంతము వేరొండుగాదు. అజ్ఞులు దాని మృతియందురుగాని వాస్తవముగా మృతిగాదట్లు మృతియను కొనుటచే జనుల ప్రార్థకు లనబరగుదురు గాన నీయవస్థయొండు శరీరముజ్జగించి వేరొండు శరీరంబుగాకొనుట ప్రతిపూరుషు నియతంబని తలంచుము మఱియు దేహాత్మ జ్ఞానమ్ము చేతనేగదా. భీష్మ ద్రోణాదుల యాతత దీర్ఘ దేహమ్ములు సూచి తాతలు జ్ఞాతులనుచు వెఱ్ఱిగ దలంచితివి ప్రకృతిలో నుండు జీవునికి నట్టి పెఱ జీవునితో నెట్టి బాంధవ్య మెచ్చటినుండి మొలుచుకొని వచ్చె నీ భారతాజి నిపుడు సమకూడిన నీ వైరి వీరుల కెల్ల మృతియను శరీరాత్మ వియోగమ్ము దైవ యోగమ్మున గవ్వడి వడి నిత్తరనువ్వెత్తుంగా గామన్న పనియైయున్నది. గావ నది యింతకు మున్న యైయున్న పనిగా నెఱుంగు మర్జునా నీకిహపర సౌఖ్యమ్ములు ప్రార్థితములయ్యె నిన్నుంగడ తేర్చి ధన్యుంజేయు సంకల్పం బుగ నీకిప్టి యుపదేశించి యీ ప్రదేశంబున నీకలతయంతయు దీర్చి తేర్చితినని శ్రీహరివ్యాజవత్సలత నానతిచ్చిన విన్నవ్చుండు ధన్యుడైతినని తనుదా మెచ్చుకొనుచు దేవేంద్రాదులకు భానింపరాని దేవదేవ స్వస్వరూపంబు మనస్థాపంబు దీరగని కర్ప్వరీర గనుగొని పెన్నిధి గనిన నిరుపేదవలె విడువజాలకప్పుడు

490

చ. విజయుడు నంస్తుతించిహరి వేయివిధంబుల వేదవాక్కులన్
నిజముగ దేరెనాకలతనిర్మలమయ్యె భవంబునీకృపన్

భజనయొనర్తు న్నెప్పుడు పాలనసేయుము దేవదేవ నీ
నిజతననీగి తొంటి మెయినింగుమమయ్య యటంచు మ్రొక్కినన్ 491

ఉ. శ్రీహరి యట్లసేయఁగ గిరీటిధరించి కరంబు నందులో
బాహర పోవగాండివము బాణము పోలిమ నస్త్రశస్త్రముల్
సాహసమూని నర్జునుడు చయ్యన నేవురు వుట్టి నట్లుగా
నాహవభూమి తేరిపయి నాయితమాయను సంతసంబునన్ 492

ఉ పార్థుని జన్మమెట్టిదో సుభాగ్యము యోగ్యము చెప్ప శక్యమే
సార్థకమే మహర్నిశము చచ్చుచు బుట్టుచు నుందు రెందరో
వ్యర్థముగాగ నెవ్వరికి నబ్బును శ్రీహరి దివ్యరూపమున్
బార్థున కట్లు శౌరిక్రియ భాగవతోత్తమ నామ మీమహిన్ 493

# యుద్ధ ప్రారంభము

సీ తొలినాటికల నిల్వఁదొలితాకు బలితమ్మై
కలితమ్మై యిరువాగు చరితమగుడు
నరుడు భీష్మని వృకోదరుఁడు దుర్యోధను
సహదేవుడు సలూక శకునులగొని
నకులుండు చిత్రసేన కురురాట్సూతుల
దృష్టద్యుమ్నుఁడు ద్రోణుసాత్యకియును
జొచ్చి భూరిశ్రవ స్సోమదత్తుల నభి
మన్యుండు నన్యు లక్ష్మణ కుమారు.

గీ అద్రౌణి యుపపాండవుల శల్యుధర్మరాజు
సురవరు వలబను ఘటోత్కచుఁడు విరాటు
దుస్సేనుఁడు కర్ణుఁడును ద్రుపద నృపతిఁ
గెరవి కృతవర్మయును దృష్టకేతుదాక 494

వ ఇట్లు లింకంగల వెంకలు యమకింకరులవలె బలువీరులై మహాగభీరులై నగధీరు
గొంతక పొంకము దరుగక విరగబడి యొండొరులపై కరిగి వీరు వారక

మొనలవారని కనక కనుఁగొనల దనుకదొనక చేతికి దొరికిన వారినెల్ల దలపటికి వెనుక కుటికి వేరొకనిఁ జేటి కనవి వీఁకఁదాకి వితాకు పఱుచుచు నేఁటిని జేరికి దొనక పోరికి దుమ్మని పిలచి విలిచివెూని నిలువనీక నూకుచు బైకి బ్రాకుచు మైమఱుపుల్లఱువుల్పొనర్చుచు దొనర్చుచు.

వైరిపై కురుకుచు లేత మాటలకు దిగి తరుమగ చేతు దెబ్బలవరకు దెగనఱకుచు గొంతులు గోఱుకుచు బ్రేవులు ప్రోవులు వఁడఁబెఱుకు చుఱుగు నగు నగునుకు పరువు విడువ గురువులు వారుచు దూరుచు జేరుచు తీరు సంపుచు గర్దరి తునుమున గర్జించి మర్తించుచు నర్తించుకుమని గర్జించుచు నిన్నిదె పెద్ద ?స్వర వెందించకున్న నున్ను నీపేర బిల్వక మారుపేరుదుమని గట్టి పట్టుబట్టి యెట్టిడిక్కొనుచు దున్ను నెవరో పట్టుకొన్నట్లు విడువిడుమని బదరి యెదిరిఁ బెదరించుచుఁ బదాతుల ఁబదాహతుల నొందొగ దాహతుల నొందెహతులుఁగావించు[illegible] రోసము దావించుచు స్వజితుని హతునిగా నెంచి మృతునిగ భావించి యాపలికి బోవ నింతలోన నరితెప్పిరి నాయరి నీకురియ[illegible]వని వెనుకొని చని మెయిది కలిసికొని సికవట్టికొని యింతకు మున్ను నస్పేమంటివిరా రారా మఱలక మఱల గూయుచు నీగాయము నీకాయము దప్పించునా? నబప్పు దప్పికొంటివేని యాయువు దప్పిన గాయమంతసుగమేదియు లేదనట్లు లేరుకోవచ్చున నిన్నిదె గెడపెదనని పెదవి నుండి నుడి వెడలకయముస్న వెదదయురమ్మున భరమ్ముగు నిరసమున నారసిమ్ము జొనిపి జముపురి కనిపి తన్నుఁ దాఁరనిపి చనుమంద నందని మృతుని సుతుడెండె హితుడొండె నడపడి యేడబోయెద నీదుంబోక యూనాడ నిలుపని యడిదమ్మున బెడిదమ్ముగ వానిండొడిచి గడని పోనీక గెడపియు నిట్లు బాధించి తనవాని పగసాధించియు నింతట మరియొకండు వచ్చి హెమ్ముగ బంతమ్ములకు జొచ్చి కుంతమ్మున గ్రుచ్చిన బ్రతిక్రుతి వీడువట్లె యొనర్చిన విరువురు సొమ్మని మునింగి యనంగి యొండె వెలకండు తెప్పిరిల్లి చన మరి యొక్కండు కొనయూవరితో బడియుండ యొండె నిప్పటికి నాచే దప్పి పోదివిపో యింకొకసారి నాబారి కగ్గుమయ్యెదవేని కయ్యంబున నీకయ్యెడి పాటు నీకు తలముచ-నీకుఁదలముచు కలుగ గాగ దీయ [illegible] కల నిపుఁడేమయ్యె నీవె కనియెదవు-గాక యింతట నిచిక [illegible] వాలయు

లాడి దెప్పుచుఁ దల ద్రిప్పుచు నొప్పి నొప్పుచు రొప్పుచు వేరొండుబో నొండొరుల మొదల్ల నోళ్ల గిచ్చియు రాళ్ల గ్రచ్చియుఁ గురంగటు తురంగముల గముల గోలల గ్రోల్పుల తెనవలీల ఖండించుచు సాధుల నసాధులవలె నవలీల దుంద్రుడించియుం ద్రుంచుకోపము నాపలేక తాపమ్మునఁ దాపము దలంచక నింగినొరయు యేనుంగుల యేనుంగుల చీనుంగుఁ జేయుచు సూప్రుతుల లావుతొలగించుచు స్యందనంబు లందంద బాణాగ్నికి నింధనమ్ములవలె దంధనమ్మొనరించుచు మొనక సురుగి నడిచి మొనక సురుసుడెనరించుచు జోదుల నాదమ్మునకుదించి పాపమ్ముల కంచ నటికిన మలుగాళ్ళు విఱిగిన నేలఁగూలు కీలువొమ్మలవలె గగ్గోలుగ గూలఁగూలిఁకూలి నసుమఁడిను తగునసుచునెగుమడఁబరవాసి ఎచ్చుకొని నేలబెట్టి కాలఁజమురుచు బమువుని కనువువః గిరవాలపుమనఁ గిసుటుపోసివిరుచు నిట్టులా వరుసలా నరులూపకోతకోయ జేతులు మూతులు శిరంబులు కిరంబులు వెక్కిళ్ల పొక్కిళ్లు కన్నులు మెన్నులు కాళ్ల వ్రేళ్ల వోళ్ళ గోళ్ల పిఱుదులు విరుదులు తునిసి తుంచునకలై వింతరపంతరగ జిమ్ముపలై యుపవవలై యువుకు సప్పలై కోవంబులు రేవరంబుగ దురుంచునిడి ధీరంపగు ధీరంబుగ యథాయువలైపడి ఘూతప్రేత పిశాచ శాకినీఢాకినీ కరాపోత్తాలాధిల భేతాలాదులకు సామిరగపగు మేతయ్యె యుండ వ్యోమ తలంబున వ్యోమయానంబుల దేవాధి దేవత లిట్టి దారుణ ప్రవిదారణము వావగ మరణమ్మునకు బిమ్మట నెన్నడు గనివిని యెఱుంగము బెగ్గలంబగు నగ్గవిహానగ్గిము మండి రట్టి కన్ని కయ్యంబునందు 495

విరటుని కొమరుడు యుత్తరుఁ
దురువడి పడినురవడించి యొగిశల్యునిపై
ఖరతర తచ్ఛరహతిఁబడి
దురమున ధూతాలికయ్యెఁ దొలి కబళముగన్ 496

పగటుంగ యాంచఁదక్కొటను బార్థుఁడు భీష్ముడు మొగ్గ తగ్గలే
దాగి సరితూగి పోరి రాకరొక్కని మీఁద మహాస్త్ర జాలముల్

నిగుడుగ జేసి నిర్జరులు నింగిదముంగని సన్నుతింపగాఁ
దాఁగెదె భీష్ముఁడర్జునుడు త్రెంచెను త్రెంచెను లేదులేదు నాన్ 497

ఉ. కప్పి సహించి భీముఁడును గౌరవరాజును జేరి పోరఁగా
హెచ్చును జచ్చు దానఁబడ కించిక సేపటుండ భీముడున్
నొచ్చి యొకింత తెప్పిరిలి నొంప భరంపు శరంబున వివున్
జప్పి సుయోధముండును సారథితేరు దొలంచె నాజికిన్ 498

కం. నకులుఁడు విరథుం జేయగ
సికముడి జీరాడ జిత్రసేనుడు వాతెన్
శకుని యులూకుండటువటెఁ
గకవిక సహదేవుఁడడుపగాఁ దొలగి రనిన్ 499

క. యుయుధానుఁడు భూరిశ్రవ
సుయుధార్భటి నొంచె నానినుతుతోడను_ని
ర్భయముగ జంపె నలంబుసు
మెయివెంచి ఘటోత్కచుండు మేదినియద్రువన్ 500

క అభిమన్యుడు లక్ష్మణుని దు
రభిమానుని బట్టి పదుగురౌనా ననగా
నభయుఁడయి జనకుమెమకకు
నభయార్థము నరగ సురుగు నచ్చులు మోదెన్ 501

గీ. ఎంతవాడు యుధిష్ఠిరుఁడెంత వాఁడ
నగజగంబని శల్యుసు నగవిరోధి
బలునివలె ధర్మజాఁడు వట్టి బలుశరముల
నొంప మూర్ఛిలి మృతునట్లులొరగె నతడు 502

క. అంతట సారథి తెలివిని
వింతగ రథముం దొలంచ వేరణమునకున్
సంతసమున మద్రేశుఁడు
చింతనువిడు మనియె బ్రతుకు జీవుడ యనుచున్ 503

క ద్రోణుడు ధృష్టద్యుమ్నుడు
తూణంబులఁబట్టి యొకరితో నొకరడరన్
ద్రోణుఁ డంతకుఁడనగా ఁదగి
శోణిత దిగ్ధాంగు జేసె సోమకుడు గురున్ 504

వ విరటుడు దుస్ససేనుఁడును వేకొని తాకి పోరుచోఁ
గరటుల యట్లు బెబ్బులులకైవడి గారెను పోతులట్టులన్
మొరటుతనంబు జూపెడమూర్ఛ్యఁడుగాగ విరాటుకేయు దు
ర్భరమయి దుస్ససేనునికి ఁబారెను గాలికొలంది నాతఁడున్ 505

ప అంతంబోక దుర్యోధనానుజుండు తనయును జమ్ములు కుందఁబెద్దురై తన్నుంగని
యోయన్నా బెదరవేల నిట్టిమలక దనంబేల బేలగఁ జాలుగ నిటు వాటినఁ
బాఱఁబోఁతవని యన రోటుపోటరి మానిపి వగు పీపోటుగొని చేటు
పాటెఱుంగక సురింగెదవేల యెదిరి బెగడుగదుర బోదివి యదురంట బెదరగొట్టి
చెదరనీక నీఁకదాటి విదురింపఁజేయుమని బదరివఁ గుదురుకొని యెదిరి
నదురంట బెదరించి చెదరగొట్టికాని మఱలనని మఱలదుస్ససేనుఁడు కెరలి
యరలివని మత్స్యనాథునిఁ దాకి పెద్దయుంబ్రొద్దు తద్దయు బెనంగి

506

వ విరటుడు దుస్ససేనుడును వెన్కను తిన్నను బోరిపోరివవి
బ్బురముగ వృద్ధుంజంపఁడెగఁ పాపిఁ దూపును దుస్ససేనుఁడు
వ్విరటుడు వాని దప్పికొని వీరిడి నేలొలియింతు నంచు నే
శరమున నొంప వాడెపుడొ వచ్చిన యట్ల రథంబుపైఁబడెన్ 507

క కృపుడున్ ద్రుపదుఁడుఁదల పడి
కృపదొరగి పరస్పరంబు కెరలిశరములన్
నిపుణత నొప్పించుచు గడ
కపాదులఁ బడక యుభయు లరిగి రథయుతులై 508

క ఉపపాండవులును ద్రౌణియు
నుపమింపఁ గ రానియట్టి యుద్ధతిఁగొని మా

నున శక్యముగాని పగన్
గుపితిలు బ్రాణములు విడుకఁ గొట్టికొని రవిన్ 509

క. కృతవర్మ రిపుని దలపడి
శతవిధముల బోరి నిలువఁజాలక తుదకున్
మతిచెడి ధృతివిడి మృతికిం
గ్రితి తప్పంబాతె ధృష్టకేతుని చేతన్ 510

క. ప్రథమ దినంబున జరిగిన
ప్రధనంబున గెలుపుగలిగె పాండుసుతులకున్
బ్రథమా వస ధీయన్య
ప్రథిత సుఖంతస్య సర్వ వర్త్మని తన్వాన్ 511

ఉ. శాంతనవుడార్యుఁడస్త్ర దివమ్ముల పోరొనరించె లీలగా
స్వాంతము పాండవేయుల దెసం బవికౌరవు పట్లఁగాఁగ నా
వెంతను దేహధారకము సేయుచునుంటమ బట్టి ధర్మమే
వెంతనొ యయ్యెడన్ జయము సిద్ధమటంచు నెఱుంగు గావునన్ 512

చ. అదిగని కౌరవేశ్వరుఁడు యామిని పోమిక భీష్మ పాలికిన్
బదిలముగాగ వేగి కడు వర్త్నవసేయుచు బల్కెఁద్రాత నీ
మది యిపుడంతయుం దెలిసె మాకడఁ బాండవపక్షపాతివై
యొదుగుచుఁ గజ్జ గంటు పడకుండఁగ గాచెదు వారిసేనలన్ 513

ఉ. ఆర్భిగఁదీర్భిగర్తవని విన్నిట నన్నిటనమ్మి తాత నేఁ
చేర్చి దురంబు విట్లు తలపెట్టితిఁగాకరి మూకఁబట్టు పా
లార్చెడు వాఁడ వీడువని యక్కట నిక్కమొకింత తెల్పికో
నేర్చిన నేర్పు కర్ణువిడి నీకిట బట్టముఁ గట్టు వాఁడనే 514

ఉ. ఇంతకు నేమిచ్చిన నరియేయని వింతట మామయ్య యో
శాంతన వార్య పెద్దలకుఁ జాలఁగ వాలము దుస్తరమ్మగున్
జింత దొఱంగి యింటికడ జిహ్వకు రుచ్యముగా భుజించుమున్
దాంతి వహింపు మాసయిని దయ్యమొఱంగెడు వాయువస్థలన్ 515

గీ. ఇట్లనంగ భీష్మునకు గోమిత్రి పెలుచ
వెడలుఁ దావక నీకయి యోపినంత
పట్టెటుల్బాట్లు పడు పెద్దవాని నన్ను
బిట్టుకొని, తూలనాట పాడి యొక్కొ 516

వ ఇదియునుగాక పార్థునయి నెత్తంగఁ బూనెడునాడ యా..
దనములోన నర్జునని కట్టెదురుటంబడి ముజ్జగంబులన్
బతికెడువాఁడు వీఁడనుమఁ భార్థునితోననిసేయ నేన కా
దొదపఁగ రుద్రుఁడుందొడర నోపడటంచు సజాటు చెప్పనే 517

వ పెడచెవిఁబెట్టు వానుడులు పేరిమి వేరమి లావుసేసి య
ప్పుడు కడుగ్రవ్వి నీదు తలపుండ్లను గర్జుండు పూర్ణశక్తితోఁ
గడగు నంచు నమ్మియిటు కార్యము భ్రష్టమొనర్చి రేయిన
న్నుడుకుచు వచ్చి దూఱఁగనునోటివుదేనియుఁ బూనుసంధికిన్ 518

మ కనియంటువా వినుము కర్ణుని నీవల దుస్ససేను నా
దనున నీదు మామ నెలమింగొని ఫల్గునుఁదాంతి నాఁటు యా
గాంద నదేమి లెక్కయని జూదమునన్ గెలు పిప్పుడున్యలన్
నాదగు మున్ము నందిడు జనంబులఁగూర్చెదఁ జూప మట్టగన్ 519

క. అయినమ్మను బయినమ్మను
నయ విదుడగు కృష్ణుమాట నమ్మి నడచినన్
బ్రియమగుఁ గాదె విన కది
జయమగునని కర్ణునమ్మి సాగితివనికిన్ 520

ఉ మంచిదిరేవు చూతమని మంచిగ నాతని బంపి వేఁగుడున్
బెంచి యొడల్ల దీనుతుఁడు పేర్చి పదాతులపైకి నర్జును
మ్మంచిన బాణవృష్టి హరి మోఱకుఁ జంపెద భీష్మునంచుఁగు
ప్పించి రథంబు దూకినన భీష్ముడు రమ్మని పెల్చె నమ్రుడై 521

ఉ. కూడని దూఱ క్రీడి హరి కూడని నన్నిటుచిన్న పుచ్చఁగా
వోడఁగ ముఖ్యగంబువకు మూకువ నీకితఁడేమిలెక్క, నా
తోడ నెవండు పోరు నని దోర్యుగ వృత్తిఁ గ్రమ్మఁబట్టి నా
తోడితఁ డోకుమీ యని యదుప్రభు నొట్టిడి చిక్కఁబట్టినన్ 522

ఉ. ఈరస మాటలేరి నొగ లెక్కుడుఁ గ్రమ్మఁడున్నతల్
దీరత చేరి శాంతనవుఁ డీవ్రశరంబుల నొంచె నాతఁడున్
బేరిచిపోరి కౌంటియుల భీష్ముడుగాఁడవిపించెఁ బాండవుల్
గోరినఁ దమ్ము జంపుటకు గొండొక మందుము జెప్పవారికిన్ 523

క. పదియవదివసమ్మున రవి
యుదయమ్మున లేచి భీష్ముఁడు రుడిపేపెన్
బదివేల భీష్మలోక పరి
మదయించి రటంచుఁ జూప ఊహింపంగన్ 524

వ. అట్టులురువడించి భీష్ముండు వెడలుతఱివాలవికి నవశకునమ్ములమ దెల్పు నవశకునమ్ములగతులు నశినశి వారు తమ్ములును వికృతకరి బృంహితమ్ములు నహితవమ్ములగు హయ బాష్ప ధ్వజపాతమ్ములు లోపంగాగల వనేక దుశ్శకునంబులు గావిపించిన నవి శాంతవ వాగ్నికి శాంతికాల సూచకములుగ నుభయ బలంబుల యందెల్ల వారుల్లేకించి రట్టు గాంగేయుండ జేయుండగు పాండవేయ మధ్యములో వ్యజీమన పంద్గి మానముండయ్యు నయ్యెది తలంపక నరులోఁ దలంపడి దుర్భరమ్మగు దురమ్మునఁ బోరి యారుతఱి గుప్పున నుండి పైకెగసి ముగిసి రూపుమాయు దీపంబుఁ బోలెఁ గోపంబొసంగి బాపం బొకవిమునం బోడు కయాపగా నందముండు కుంతీ నందనుతో పోరు తీరుఁగని చూపఱులు వేఁడు దేవవ్రతుండొండె దేవరాజ సూనుండొండె నుండుఁగాని యిరువురు నుండ నమ్ము పడువాయని యనికొని నని కొన శిఖండిని ముచ్చిడుకొని కిరీటి లాటిసిడెపుటన్నవి పెన్నరాని శిఖిశిఖాసఖ విశిఖంబు లడరించి మహాస్త్రంబు లన్నిఁటి జిత్త వితుగఁ బలిపి తెలిపఁ గని యుత్తఱి నతని కుత్తుక నుత్తరింప నుత్తమాస్త్రం బరివోపి యేసి గాపి పటిచిన

నాఁటి సాయహ్నంబున 525

ఉ వేఁడయు భీష్మమయ్యె నవనీతల మల్ల యపార్థమొండె నా
వేఁడవిఁకిందటస్తపడు నిర్భర ముల్లకటంచుఁ గ్రీడితాఁ
బోఁడిమి వాఁడి తూణ మరివోసి పడింగెగలాగి పిడినన్
వాడి శరమ్మురమ్ము చొరఁబారిన యట్టులు గూలె భీష్ముడున్ 526

క అది దక్షిణాయనమ్మని
యదితి సుతప్రతుడు ముక్తి కనను గుణమునె
మ్మది మత్తరాయణము దా
క దినంబున కేగ నన్ను గాండీవి తోడన్ 527

క సదయుఁడు మధ్యమ పాండవుఁ
డెద సెలపెల లాడఁదాత యెడఁగుశలుండై
ప్రదరములఁ గట్టె శయ్యను
బదిలముగా భీష్ముఁడందుఁ బవళింపంగాన్ 528

ఉ తాత తగన్ జలంబులను ద్రావగఁగోరినఁదక్కు పుత్రకుల్
మాతుల కంతగోతులకు నుంజన నీరముతే నతండి పి
ష్మాతలగాంబు ద్రావననఁగాఁ బెలయీాలక యుండి రస్త్రుని
ష్ణాతుడు క్రీడితెచ్చెను రసాతలగంగ నిజాస్త్రశక్తిచేన్ 529

ఉ శాంతనవుండు వద్దనని శాంతిని గౌరవ పాండవేయు లా
వంతయు వైర ముంచికొన కాయనఁ బాయని భక్తిఁ జేరగాఁ
జెంతకుఁబిల్చి రాజా పయిఁజేయుడి భీష్ముఁడు వత్స నీవు పా
లింతటనైనఁ బాండవుల కిచ్చి దురంబు రొఱంగు టొప్పదే 530

క అవి చెప్పనఁ గౌరవపతి
విని విన నొల్లరకుండె వృద్ధుని మాటల్
విన మనసురాక పోకడ
కును దను విధిలాగ మంచిగానవే యొవడున్ 531

ఉ. అంతకు మున్ను శాంతనవుఁడాడిన వేడి మదుల్గలంచఁగా
జింతిలి కర్ణుఁడాతఁజని చేయు దినమ్ములు పోరనంచుఁదా
నెంతప్రతిజ్ఞ సేసియు నదింమక యెంచక భీష్మ పాలికిన్
వంతను బోయి మ్రొక్కి యభివాదనముం దగఁజేసి యిట్లనెన్ 532

ఉ. సూతసుతుండఁ గర్ణుఁడను జూడుఁడు నన్నను విచ్చియున్న మున్
జేత నదీ తనూజుఁడతని స్పృశియించి మొగంబుఁదప్పుతిన్
బ్రీతిని దార్చి వత్సవిను నీయెడఁ గోపము లేదు నాకుఁ గుం
తీ తనయుండ వీవు గణితింపగఁ బ్రహ్మరహస్యమింతయున్ 533

ఉ. నీవును బాండవేయుఁడవ నిక్కమెఱింగితి వ్యాసమౌనిచే
హోవడి నేఁడవ న్వలసి యుంటి నిటొంటిని నీకు వారటుల్
ద్రోవకు వచ్చి సంధిపడలోఁబడ నీవడఁద్రోయకందు దన్
దోఁపరి నేమి నీయొడిఁబడు స్విదుమీ చెడుగంచుఁ దేల్చెదన్

క అది నీకు బుద్ధి సెప్పుట
యది నమ్మను రద్దిసేయు చావంతయుఁ గా
దది నమ్మ నాదు పట్లను
మది నున్నను గలుష మెల్ల మఱవుము కర్ణా 535

వ అని మఱియు గాంగేయుండు రాధేయుతో నిట్లనియె కర్ణకద కింకొకమాట
సెప్పెదఁ గింకవిడి కింకిరి వడక యున్నట్లు నీకొప్పెనఁ బరికింపుముతప్పిన
నొప్పరికింపుమని కర్ణుని చెవినుండి తనమొగంబు తివియ కపాయోపాయములు
పరిశీలించి వరిపాలింపు మని మెల్లగ సమీప చరులవెల్లఁ గనుసన్నల నెడగలుగఁ
బొండని యొక్కొక నెపంబున బలికి వెలుపలికి బోబుచ్చి పొచ్చములేని
మచ్చికను ధర్మసారథేయుండు రాధేయుని కిట్లనియె

536

క. నీదేమి పోయెఁ జెవుమా
వాదింపక కలియ నీరువారును జెలిమిన్
గాదన నేటికి నేఁటికిఁ
బోదుగఁ బాండవులకడకుఁ బొమ్మినమదున్ 537

క. కానీనుఁడిట్టులని పరి
గా నీ నుడి నాడు మీఁదఁ గరుణను గాదే
కాన నుడివెద శ్రావ్యము
గా నీనుడికారమంత కాకయు పోనీ 538

గీ. ఇంతకాలము విడనాడి యిప్పుడేను
ఇంతకాలము విడనాడి యేగనున్న
గానని కదర్యుఁడంచును ఘనులు నగరె
కాన నీకుఁ బంపు దయనన్ను గలహమునకు 539

గీ. నన్ను దుర్యోధనుడు కడు నమ్మి నెమ్మి
వాసి తనయొత్తు మానిసిఁ జేసెఁ గాన
దానికి బ్రతిగా నాచేతనైన పలుకుఁ
బోరి సఖు ఋణమును దీర్చి పోవువాడ 540

వ. అదియునుంగాక మొదలనుండియు గురుపాండవులకు నడుమ మెదలకుండ నేనుండి యపారమగు వైరమ్ము లావు సేసితి సంతతనైన మిన్నకుండక మనమెఱియు మాటల వారల మనముల నప్పనమునొప్పించి కంటకమూట గట్టికొంటి నంతియగాక కర్ణుని తల భారతమని పడిసన్న నాకేఁక బాండవులఁ గూడఁ బోయినను నను నీజన్మమ్మునందు నమ్మరు మఱియు నమ్మరు నయ్య పాండవులకు దండగ నుండుట విజయున విజయమున కగునని స్వతసిద్ధమగు మాటయే గద యేగదమందులకుఁ బూఁట అదిమీ యెఱింగిన యదియకాన నెఱిఁగి యెఱింగి నన్నేల నలంచెదరు. తాతా వెదరని మనమ్మున విన్నఁక నన్ను కలసి పరువట్లుగఁ జెదలఁ గొట్టక బదరక నీపావనమగు దీవన విడి యాజికిఁబో నాకిఁక దయవాట మువమ్మాటికి సెలవిడుఁడని యంగాధిపుడు యేపంగారఁ దాఁ బట్టిన పట్టు విడక తనకడక యంతయు ఁగడకు విడజెప్పిన గంగానందనుండు విని పరమానంద భరితుండయి యోయినవందనా నీమవంబట్టిది యైన నట్లేకానిమ్ము కుమారా మాఱాడక మిత్ర కార్యమ్మునందు నిండు లక్ష్యముంచి సంతోషాబ్ధిముంచి వెనుదీయక కుమూయక పెనఁగుము గట్టియాసక్తితోఁ బగులని పట్టుదల వదలకుండ

మిత్రతేజ సంజాతుఁడవగు నీకది తేజంబకాదెయని శాంతనవుండు సాంత్వన వచనంబుల నీడ్కొల్పి సూతునికి రాధేయుండు మఱల వెడలెఁగి గాంధారేయుని కడకరిగెదనని యరిగె తదనంతరంబు 541

## ద్రోణ పర్వము

శా. గంగాసూనుఁడు పడ్డద్రోణుఁడవలం గౌరవ్య సేనానియై
యంగాధీశుఁడు తోనికిం గుడిభుజంబై విల్వెన్ద్రొక్కులల్
సింగం బాఁకొని మేకలం బొదువు పోల్కిం బాండవానీకముల్
బెంగం బంచదినంబు లాజి మొనరించెం దున్మి తూటాడుచున్ 542

ఉ. ఏర్పున పాండవేయుల జయించున ద్రోణుఁడు నేడొ రేపొ యం
చోర్చి యహర్నిశంబును సుయోధనుడుండగ వారిఁబట్టి పా
లార్చుచునున్న ద్రోణుఁగని యాయని నాయన ధార్తరాష్ట్రుడున్
మార్చి మనంబునం గడుపుమంటను బట్టగ జాలకిట్లనెన్ 543

శా. భారద్వాజునితో సుయోధనుఁడు మీభారమ్ముగా నమ్మితిన్
పైరంబార నజాత శత్రు నవిలోఁబట్టింతు నాద్రోణుఁడే
యూరక్షేనిది పేరఁ బిల్చిరగునే నోర్వంగ లే నర్జునున్
నీరాగ్రేసరుఁడాతఁ డడ్డపడఁడే నేఁబట్టుదు న్ధర్మజున్ 544

వ. అట్లై వట్లనంటినా చెప్పెదవిను. 545

చ. మొదలనె వీరసింహమైలు పుట్టెను బార్థుడు దాన్కిఁ దోడుగాఁ
బదిలముగాఁగ వర్తితన పాశుపతంబును గట్టిపెట్టె బైఁ
జదలమునందు సారధిగ శౌరియుఁ గంటికి తెప్ప చందమై
పొదులుచు రేఁబవల్గతనిఁ బ్రోచు నితెవ్వడు పోరు వానితో 546

క. అమాట విని సుయోధనుఁ
డామాటకు కర్ణుఁడుండ నర్జునుబలమే
యామాట యదేమాటగ
నేమాటను బట్టువోరె వినిచెదరేలా? 547

వ. అని మఱియును దుర్యోధనుండా చార్యుతో నిట్లనియె 548

ఉ. ఈవును భీష్ముడిందు నహియింపఁ డెయుఁ బాండవ పక్షపాతులై
కావలి కూనమంచెను పగండయి మెండయి కూటికుండకున్
దావునఁ జేరెదన్న మడి తథ్యముసేసితి రారడింబడన్
వావుడుఁ గుంభ సంభవుఁడు నవ్వుచు నిట్లనె ధార్తరాష్ట్రుతోన్ 549

ఉ. వింతగఁ జెప్పనేల మనవీటికిఁ బెట్టనికోట మేటియా
శాంతనవుండు యుద్ధ నవిశారదుఁడోడెను బార్థు చేత న
న్వింతట లేని వానిఁగని యొంచుము భీష్మునితోడి పాటునన్
జింతల వంతలం బెలుచఁ జీకగఁజేటికి సంధికొప్పుమీ 550

ఉ ఏటికి నీదుపాల నహియించితి పక్కట దిక్కు మాలిమున్
నోటికి వచ్చినట్లు మము నొవ్వఁగ దూఱకు దూఱుచేగడున్
మూటను గట్టుకొందు వఘమున్ మఱి యేమియు గల్గ బోదుము
మ్మాటికి వింతలైనఁ గడుమంచిగ సంధి నొనర్పు బాలకా 551

చ తరణి తనూజనమ్మకొని దాయలకాయువు శ్రీయుయానమున్
వరునగ గోలుపోక వినువాసిగ సంధికిఁ బూను మింతటన్
ధరఁ బరుగెత్తి క్షీరములఁద్రావుట కంటెను నీరమున్ దగన్
మఱలక త్రావుటెంతయును మంచి దటంచును నీ వెఱుంగదే 552

ఉ. ఇప్పుడు చాల యుద్ధమయి యేలయుధిష్ఠిరుఁడొప్పె సంధికిన్
దెప్పరమిప్పవిందలఁ పఁదేలదు పోలదనంగఁ బోకు నేఁ
జెప్పిన ధర్మరాజును వివి సేయును భీముఁడు నన్నమాటకున్
దప్పడు సవ్యసాచి జవదాటఁడు నాదగుమాటకుంగవల్
సెప్పరు మారుమాట విరసింపక నీవు తథాస్తు నాఁదగున్ 553

శా. సంధింగైకొనుమంచు నీకు విటువేసారు ల్విచారించి వి
ర్బంధంబైనను నొత్తిసెప్పు చెప్పుడుం బాల్మాలికా దాజికిన్
బందీభూతు లరాతులంగొని మెయింబ్రాణమ్ము లున్నంత దా
కంధీభూతులఁజేసి వైరుల నపాయంబందఁ జెండదాడుదున్ 554

ఉ. మానక సంధిసేయు మనుమాట వచింపక దేమి పాపమో
న్యూనముగాఁగ నీకుఁదలఁపొప్పియెసంగుఁ బరాన్న భుక్తిబల్
హీనము నీమపాల వసియించిన తప్పునకై విడంబరా
ధీనతఁ బోరి నీఋణము దీర్చెదఁ దాపక ప్రాణమానముల్ 555

వ. అని ద్రోణాచార్యుఁడు దుర్యోధనునదిక్షేపంబునకుఁ దగు తెలంగున సమాధానము సెప్పి పాల్గకూటక్కై యతని పాల వసించుటం బట్టిగదా యిప్పగిది నీతని చెప్పుపడవలసివచ్చె నైనఁ దద్ఋణంబు నేత్రఘణంబువఁ దీర్చెదనని కదంగి యొరులకు దురవగాహంబుగా చక్ర బాహుళ్యంబుగఁ బద్మవ్యూహంబు పన్నిఁ దన యనుకుండు సంశప్తకులతోఁ బోరు చుండుటం బట్టి ధర్మరాజు లోనగు పెదతండ్రి పినతండ్రులచే ప్రేరితుండై యభిమన్యుండు యుద్ధాభిమానుండై యుచెనే సే వ్యూహంబు ప్రాంతభోమ తెలవేతఁ జీలిసిచ్చు చించి చీరికాలించెద నే తప్పి రాపకుఁడగు చాపగురు నీప్రొత్త్రుంచి ధార్తరాష్ట్రసంపదఁ బడుమిడి తొంచి సంపూర్ణ గర్వుసెల్ల సఫల్వ గర్వంబు ఖర్వపటచి నాతండ్రు లేవురికి భావుకంబు ఘటింపక్రమించి సమంబున నివారణ సేసెద నవారణగతి రణగతిఁ దప్పక నాతోడఁ గూడరండని ధర్మరాజాదులకుఁ జెప్పి ప్రణతిపూర్వకంబుగా వారి వేర్వేల వీడ్కొని సరథుండై సంపూర్ణ మనోరథంబున మొగ్గరంబునకు డిగ్గిడిగ్గ పద్గతి తలుక్కుమెఱుము మేలుసి నల్లె గసి యొలుసికొని పోవుచుఁ గసిమసంగి కవిసిబాహా బాహాతి పైనఁ గుజోదులు బాహిరపడి మోహాటింప వ్యూహం బర్ధనిమేషంబున నవగాహించి నిప్పురేకయు వహించుచున్నవాఁడు వీఁడెవ్వండొకో యని యంత్లసం మటపించెదు నాతనికొమరుండు గావలయు నని కాపలుఁ బోధాను యోధులుండయుఁ గను లొప్పవేయక దన్నుంగనుంగొను మంద నెవ్వానిని డగ్గలుకుఁ జేరనీక వీఁకనుదగ్గలించిన వానినెల్ల డిగ్గువఁ దలఁపడి పెదతలదీసి రణస్థలికి బలిదీసి విడుచుచుండు వీఁడిఁక నిమేషమాత్రంబు మనమోర్చిన మోహరమున మనవారినెల్ల మనతో మననీక యమునప్రోలికి నతిథులుగఁ బంపకమానండు గావున న్యాయయుద్ధంబుచే సాధ్యుండుగాఁడని యెంచి ద్రోణకర్ణ దుర్యోధన దుశ్శాసన సౌబలాద్యనేక యోధుల న్యాయంబున జయింపం దలంచి రథహయధ్వజ సారథి జ్యాధనుర్మర్మ చర్మాది విచ్ఛిత్తికై వారు చెలి యొకని

చ. ప్రమదము పేర్చి యొండువిశి ఖండన మంచు మయోధముండురా
గ్రచరుల మూలుకొల్పి హరిదీటుగ నాటుడు నాఁటరే ఘటో
త్కచునాతఁ డొంచి రక్కసులఁ గర్ణునిఁ దల్పడి పుష్టిముంచఁగాఁ
బ్రచలితుఁడై కొనె న్విజయు ప్రాణముకై యిడికొన్న శక్తినిన్ 560

ఉ. అవ్వన భైమియంతఁ జెలరేఁగి చివాలునఁ గర్ణుమీదికిన్
నవ్వుచుఁదాకి సారథిని నాలుగుమావులఁ జంపి తెంపునన్
గెవ్వున నార్చి కర్ణనిముగీ టడగించెదఁ జూడు మిపుడే
దవ్వుల గొంచుపోయి యొకతావున మింగెదఁ దేరితో నసన్ 561

క. అని వినువీధికి నాతఁడు
పనివడి వడివెగసి పగఱపైఁ బడి వారిన్
మునుమిడి మూఁడక్షౌహిణు
లను జంపెను సురల సురలు లావుగఁ బొగడన్ 562

వ. అంత ఘటోత్కచుఁడు కర్ణునిపైఁ గన్నికి తేరితోఁ గూడ నీసారి యీ
సూర్యసూను నెగవెత్తికొనిపోయెదనని వినువీధికెగసి భూమికి దిగివచ్చుచుండ
సమీపవర్తులు నిర్వ్యాజగంది కుంది కర్ణున కిట్లనిరి

563

చ. విడువిడుశక్తి గర్ణ వినువీధి ఘటోత్కచు డేగురెంచెడిన్
దడయక విన్నుజంపు నటదాఁచిన నేమి ఫలంబు గల్గు ము
న్నడి విటఁజావుదప్పినను నాఁటికి దైవమొకండు గల్గదే
గడువగఁ బెట్టు క్షత్రియన కర్ణుఁడు భైమిని ద్రుంచె శక్తిచేన్ 564

వ. ఇట్లింద్ర దత్తాస్త్ర ఘంటాశక్తి భైమిపయి న్విడువంబడి వానితోన నమ్మగుట
నర్జును బ్రతికింపఁ గంటి నని మురారి నరాదుల ఘటోత్కచ మృతిక్షత
చింతనుడిపి స్వాంతమ్మున నెంతయు సంతసించె నని సంజయుఁడు
ధృతరాష్ట్రునకుం జెప్పిన నయ్యంధ నృపతి సంజయున కిట్లనియె.

565

చ. కొనుమని ఇంద్రుని న్సహజ కుండలవర్మము లిచ్చినప్పుడో
దనయుని రక్షసేయుమని తానటు గొన్న యమోఘశక్తినిన్

బనివడి కృష్ణులందొకనిపై విడకేటికి వీడె భైమిపై
వెనుకొను బెబ్బులివ్వదలి వీడె శతఘ్నుని గొబ్జెపిల్లపై 566

అనుడు సూతుండు ధృతరాష్ట్రున కిట్లనియె 567

అనుదినము న్నివేశనమునందు నవేయనుకొందు మింక రే
పనువుగ శక్తిఁబార్థునయి నాదిని వీడక తప్పు మంచునన్
వెనుకను విద్రబోదు యుట వేఁగిన కోట వదేమి చోద్యమో
చనుతఅఁ బోరి కెవ్వరికి శక్తినిఁ గూఱిచి యాదిరాదనిన్ 568

గొనకొని శక్తి మాటనిశి గొంగునమ్మడివేసి గట్టిగాఁ
బెనకువ కీము పోదుముట విస్మృతి గళ్గి దినాంతవేళఁదాఁ
కనుస్మృతిరాద యేరికిని గవ్వడి చెక్కు చెమర్పకుండఁ బో
నునుదిన మిట్ల యేగె నరునాయువు కల్మినొ దైవమాయనో 569

సంజయుమాటవిని యంధనృపునకేమియు నన నోరాడక యురకుండెఁ
దదనంతరంబ దశనంతర యుద్ధం బిట్లు జరిగె నెట్లనిన
570

విరటుని వారు సోమకులు వీకను ద్రోణునిఁ దాకి పోర గ్రొ
వ్విరటుని వృత్తి సేసెదను వీరల నంచు గురుండు నుగ్రుడై
వీరటుని వానితో ద్రుపదు వేటున కొక్కనిగాగ జంప న
వ్విరటుని టుంగలట్టి ఘన వీరులు ద్రోణునిచేత కాతరిన్ 571

విశ్వాసంబున ద్రోణుదాత్మ వధకున్ వీలొప్పితాఁ జెప్పగా
విశ్వాత్ముండగు శౌరి బొంకుమనగా భీముండు గోజాడఁగా
నశ్వత్థామ యదంగె నంచెలుగు రాయన్ జెప్ప యాచార్యుతో
చశ్వత్ప్రఖ్యుడు నెమ్మ గుంజరమనెన్ చెల్వారిలో గొణ్గుమన్ 572

ధర్మరాజు మాట తథ్యంబు బట్టి కొం
చస్త్రములను ద్రోణుఁడ మల తోడఁ
దొఅగెఁ దేరిపైకిఁ దూకి ధృష్టద్యుమ్ను
డతని శిరముఁ గోడి యువనిఁ ద్రోచె 573

క. ఆపని కోపక తోడా
యాపని కోపంబు తోడనోఁ బార్థుఁడు బల్
పాపము పొందుగుమ గురుకుల
నాశకు మొగము నుగ్గనంద గవియున్ 574

ఉ. ఆపని వల్ల వల్లనము వానం నార్పుచు ధర్మరాజున్
బాప గురుండు ఫాల్గుని బంపె నధర్మపుటాజి బాలునిన్
బాపండు గాఁడు వీఁడు కృతపాపుఁడు పాపము దల్పనప్పనే
కోపము నాఁపలేక యటుగోపితి ద్రోణుని శీర్ష మీర్ష్యతోన్ 575

చ. అని మఱి సోమకుండరిగి యర్జునుతోఁ దన తప్పుఁదాన వం
దునుగఁడంబోని నిన్ను నెవండు వ్రదిపెంచమిఁ గాదె యిట్లునొ
వ్వను మన సాత్యకిం గలితవంబునఁ బంపను దమ్ము నెక్కి యె
త్తిన యలపేమ దత్తి వెయిఁ ద్రెంచితి నీవది విస్మరించితే 576

వ. అనుటయుఁ గ్రవ్వడికి శిష్యుండు యుయుధానుండు దాని కోర్వం జాలక
మండిపడి

577

చ. అకుటిలుఁడైన సాత్యకి మహోగ్రహుఁడై యఱకాలి మంట వె
త్తికి నెగఁదట్టి సోమకుఁడ! దెప్పెదు వాఁడవె నీవునమ్ము నో
పిక విను గ్రుడ్డు వచ్చి యొక పిల్లను వెల్లున వెక్కిరించి వ
ట్టకట దురాగ్రహంబునను నాడిన గోయుదు నీదునాలుకన్ 578

వ. అనుటయు 579

క. ధృష్టద్యుమ్నుండును నో
ద్రష్టుండని యేల యిటు లడిపి పాటులు నీకుం
గష్టము కాలము పేకుఁటే
దుష్టుండ యిఁకఁ జిక్కనగుము ద్రుంచెదనిన్నున్ 580

వ. అని యిట్లు సాత్యకి ధృష్టద్యుమ్నులుభయు లభయులై యకాలవుఁ గా లాపము

శత్రి మదించెదరు గదుర మీగన్నుల విప్పు కలుదుల నొండొరుల చెదిరి యకారణ మారణమ్మొనరించకొన బెడిదమ్ముగా నడిదమ్ములఁ చిలకద లెదలించి తలలు తెగనఱికి కొన మఱికి తాఁక మాఁడించుమతఱి వారల విరువుర శ్రీకృష్ణ వృకోదరులు చెఱియొకరిని గౌఁగిటఁ గుదియు చెట్టిగుదియబట్టి పట్టుదలతోఁ దలతోక లేని యావని యేమిటియని యదురంటఁ గదరికొని బదరులఁ బదరుచుఁ జెదరనీక కుదురుకొన విలువరించివట్టి యదరు పాటు ముదురువక నీకిది తగదు నీకిది తగదని వారిని వారించిన వారు తద్భుజాంత రాళంబున వల్మీకంబు నుండి వెడలు నలీక బుసకొట్టుచు దిరుగుండ్లఁ బడి తిరుగు కోడె సెలస్రాముల నడుమన వడిసుడినడుచుఁ గొంత వడికి వారి సాంత్వ వచనమ్ములఁ దెప్పటిల్లి యుల్లోలకల్లోల న గమున్న తిల్లి నంతఃకల్లోలములఁ దొఱంగి యా దొరలుదాదర తరంగి తాంతరంగులై కెలఁకులఁ దమ్ముఁ గని యిది యెట్టి మగపాఁడి యని నగువారలఁ దగు కార్య భారనిర్వాహకులఁ గని యావనీల దిగితి మని లక్షించి యది వర్జించి నరగ సురఁగ నెఱుంగ నట్టు లెవరిదారిన వారరిగిరి వారరిగిరి భీరులుగాన బలుగాకుల వలెఁ బలుపోకలకుఁ బోక యేకతమ యేకతమంబునఁ బడి మడియక తమ తమ పనుల మీదికి దామెఱుగ నల్లరిగిరి దామోదర వృకోదరులును మేదురమోద రసంబులు పరసంబులందిరి, తదనంతరంబ 581

లయగ్రాహి:

దీప్త బలుఁడై దెసలనావ్తులు సెలంగఁగన
వావ్తులను భీముఁడనలుప్త గతిహస్త
ప్రాప్త ధృతరాష్ట్ర జాలదృప్తులను మాఱ్వురను
నప్త దశకోటి రథ నప్తి గజపత్తి
వ్యాప్తమగు సేనఁగని గుప్తగతిఁ జంపెఁగద
కాప్తతము పర్వముగ శప్తులటుగా నం
శప్తకుల శూరుల సమాప్తి నొనరించెను బ్ర
క్లుప్త శతకోటి సితనప్తి యుత చేతన్ 582

కర్ణపర్వకథ

ఉ. చాపగురుండు చెల్లుడును సైన్యపతిత్వము కర్ణునందిడన్
జాపగురూరుద్యమాహుండు రవిజాతుండు గైకొని మూడుప్రొద్దులున్
జాపగుణంబు లొక్కి ని మునంబెడలేక నటింపజేత ప
ర్వాప గురు ప్రమాహారి వృషకేతి శల్యుల పాల్పడం దొగన్ 583

వ. అందులఁ బూర్వోత్తరంబు వివరించెద వినుమని యిట్లని చెప్పఁదొడంగె 584

దశపాది

చ. కదిసి యహర్ముఖంబునను గర్ణుఁడు సాధనసేయఁ దూపులన్
మొదవొకటడ్డమై తెగిన భూసురుఁడుం బడఁదిట్టెఁ గర్ణుభూ
మి దిగఁబడ న్నధారి యనిమిత్తముగా నని మిత్తిగాఁడటం
చదర శపించె భార్గవుఁడు వస్త్రము వేళకుఁ దోపకుండగా
నొదిగి కులంబు దాచి తన యొద్ద వ జాస్త్రము సంగ్రహించుటన్ 585

చ కదియగఁ గ్రీడి కంఠమునకై గుఱిపెట్టిన పాదతూపునో
నదిమె రథంబు శౌరి దివి జాధ్యులుదు కంకతకుండలాలొనెన్
మదినిఁగలంచె మద్రపతి మాటలు నాటఁగ నాడి కుంతికిన్
మొదల విడె న్వరం బతఁడు మూఁడె[illegible]యుఁగర్ణుపోనికై 586

వ. శల్య సారథ్యంబు కర్ణున కొప్పగిదిఁ [illegible] తన్మూలంబు వినుమేయని యిట్లని వినిపించె 587

క. వరు సారథ్యంబునకు ను
హరి కుదిరెను గనుకఁ దనకు నట్టిఁడె లేమిన్
తరణి తనూజుఁ డెదురు గ
గురు ధరణీపతికిఁ దనదు కోరిక దెల్పెన్ 588

చ. మనరథంబు దోలు యదునందను వంటను మాతుఁడున్నవే
నరు నరుదంద గొల్వనౌకా నాలిని రాజున శల్యుతోడనో

నరు వరునేరునుంగొను మునంగొని శల్యుని ( గర్ణుఁడొప్పి కో
నరు నరులోగుబాగు విధి వాచికొనం బెడదారిఁ ద్రొక్కినన్ 589

వ. యాదవేంద్రుతోఁ దా సముఁడని మత్సరించు వాఁడుగానుమద్ర వాధుండు శ్రీకృష్ణుకంటె హెచ్చువాడుగాని లొచ్చువాఁడుగాఁడు తనకు సారథ్యంబునకు నేఁడొక్కఁడు తగఁడని కర్ణుండా మద్రేశు దనకు నన. గాల సారథిగా నముకొనిచేకొన నమ్మేలించె నంత దుర్యోధనుండు శల్యుకడకుం బాదచారియై చని వినీతగతి నిట్లనియె

590

మ. నముఁడీ కర్ణుని సూతకృత్యమునకున్ వేతెవ్వరుం జాలర
ర్జున సారథ్యము ( గృష్ణునట్లు తగమీరు న్వారితో పాటు జే
కొనుఁడంచు న్నుతి యింపఁ గర్ణుడలరంగొంకేగి శల్యుండు క
ర్ణుని తేరెక్కియనంతరంబ తొడఁగె న్నోనాడఁగాఁ గర్ణునిన్ 591

మ తనకు న్సారథిగాఁగ శల్యుఁగొని రాధాసూతి తేరెక్కినం
తన కొండాడుచు వేయినోళ్ళ నరు మద్రక్ష్మాధిపుండొక్కటొ
వనిగా నోటికి వచ్చి నట్లినజా లోపాలన్నియుం జూపి య
ర్జునుతో నీవటెతాఁకు వాఁడ ననిలో రుద్రుండు సాలండు నాన్ 592

వ అంత నిలువక యింక మఱి శల్యుండు శల్యకృత కర్ణ పంచనము 593

మ. కని ఖద్యోతను జ్యోతిరింగణము దాఁకం జాలునే కాకి హం
సను దాఁబోలునె యంచు ( గర్ణుమది పెల్బందాఁగలంచంగ నె
ట్టును దారింజను బ్రహ్మహత్యఁగొని బొట్టుంగాటుకం బెట్టి యిం
దునుక న్నమ్మని పిల్చినట్లతని సూత త్వార్థముం బిల్చితిన్ 594

మ. క్రమలభ్యుండగు సారథిం బడసి పోరంబోక నేవేల గొం
తెను కోర్కుల్గొని శల్యుమద్రపతినేఁడెమ్మంటి నాతండు దె
ప్ప మదింజింత స్వయంకృతాపకృతికిం బాటిల్లె నెట్లుగ్ర కో
పి మఱల్తుం బెడదారి ద్రొక్కు విధిఁ దప్పింపంగ నెవ్వాఁడిలన్ 595

వ. అని రాధేయుండు మదిలోనింక నిట్లని చింతించె చనునున్నం

జనఁడీతఁడిప్పుడవు దానం బిల్చి సిలివుడొప్పనగం బోయెడు వాఁడవే
చెప్పులుతప్పంగుల్లరే నా కటంమమా ముమ్మాటికిఁ జాలుఁడాలు నని పింమ
న్మాటలన్మాటికంయుము మద్రేశుఁడు బ్రింగరావి కడియంచుం గర్ణుఁడుత్సాదు
మున్

596

వ. అంతగొంతవడి చింతించి కొంతవడి తలఁగియు నెఱుంగవి యట్లు
మఱుఁకున మఱుఁగు పఱిచి తఱచు సైనికుల కేకలు బొబ్బలతోఁ జాపఱు
వెఱగు పడ పెడలి

597

శా. రాధేయుండును గ్రీడితోఁ దొడరి పోరం బోరు ప్రాణాంతమై
బాధంజెందిన రేయులన్నిలువ నెప్పాటం గరం బాడమిన్
సాధింతు న్నరు నంచు సర్పశరముప్పంధించి చాపంబునన్
బ్రాధన్యంబుగఁ గ్రీడి కంఠమునకుం బట్టించి దట్టింపుచోన్ 598

ఉ. శల్యుఁడు సూచి కర్ణగుఱి జాణెను గ్రిందికిఁ దేమి యర్తికిన్
దుల్యముగా నమర్పు మనఁదూపును లేమ బేకలండు చాం
చల్యమతి వ్యయూద్వహుఁడు స్యందనముం దనకాల నొత్తినన్
స్థౌల్యదశ న్నడంగుళము ధారుణిఁగ్రుంగెను దేరుభోరునన్ 599

గీ. పాము తూపుదుల్పి పార్థు కిరీటమ్ము
ఖాండవమ్ము నాఁటి కసిని వెనను
దిరిగి క్రీడిపైకిఁ దెరిలిన శ్రీహరి
కలవ నరుఁడు దానిఁ గత్తి నఱికె 600

ఉ. పించఁగ దుస్ససేనుని భీముఁడు దాఁబడవైచి భూమిపై
మించఁగఁ గూరుచుండి మెడమీఁద దురాత్ముఁడ నాదు ద్రోవదిన్
వంచన నీవువల్వ లొలువంజవి కూసిన కూతలిల్లఁ గ్ర
క్కించెద నిపుడంచు నఱికెన్ ఛురికం వాని కంఠమ్మునన్ 601

వ. హతమున దుస్ససేను దెగటార్చి యమ్మాను బ్రక్కలించి నె
త్తుట నటఁ దోగి గ్రాగి యొక దోసెడు రక్తము జల్లికొంచుఁబై

వట దలయూని లేని గదాని భుజాగ్రలి నాప్రతిష్ఠలం
దిటు లోకదాని దీర్చిరి వీఁ కేగిద రెండవదాని దీర్చగన్ 602

క ఆమాటవిని సుయోధనుఁ
డామాటకు భీముఁడింక నాగఁడనుము నం
దేమున నోరాడక తనమేలు
నేమఁఅకుఁడనుము వేఁడె బలియురన్ 603

క మూఁడవ దినమున వాయువు
మూఁడవగం గర్ణుఁడడరె మొగి రథ చక్ర
మ్మూఁడవడి నతని ప్రాణ
మ్మూఁడువ నరుఁడా తుగమ్ము వ్రాగి నరిపోసెన్ 604

ఉ ఆశర మాశరారు ఫణియై రసఁ గౌరవరాజ్యలక్ష్మిఁ గీ
నాశరసజ్జనా వెడలి నాళ్ళలు గోడుముఁ నాటునంది త
న్నా శరలి వ్వడిం తరణి నందమ నందుముఁ బ్రాణవాయుల
న్నా శరయానఁ గ్రోలునతఁడట్టిన హర్షలి యుల్లసిం బడెన్ 605

వ. అంత బార్థుపై మరులు, సుమవర్షంబు గురిసె రిరు నాగుల నారతని కడిమి
కచ్చెరువందుచు వందులవలెఁ గొనియాడుచు శిబిరమ్ములకుఁ జనిరి
తదనంతరంబ

606

శా. అంగాధీశుఁడు వడ్డవాఁడు కురుదేశాధీశుఁడత్యంతమున్
భంగంబందితివంచుఁ బద్దనెత చెప్పందీఱ దావంతయున్
గంగానూనుఁడు సైంధవుండు సుతుఁడు న్వ్వభ్రాత దుశ్శాసనుం
డుం గోదండ గురుండునుం బడిన నాఁడుంజెందఁడాదుఃఖమున్ 607

శల్యవర కథ

ఉ. కర్ణుడు వడ్డనాటికిని గౌరవసేనయు పల్వపల్లపై
తూర్ణనదీ ప్రవాహజల పూరము నేపవి దీపి పోయిని

ర్మార్గతిఁ జిల్పవిల్పగుచు గుంటల నిల్చిన నీరుతీరునన్
శీఘ్రముగాఁగ శల్యుఁగురు సేనకుఁ బట్టము గట్టె రాజొగిన్ 608

ఉ. బట్టముఁ గట్టఁబోవుతఱిఁ బట్టెక్కువుండుమ ద్రోణి రాజతో
బెట్టవి కోటలీమొనకు భీష్ముఁడు ద్రోణుఁడు వర్కి నూనుఁడున్
బట్టుగలట్టి పోటరులు బల్వురు పెల్లిరి యింక ఁబోరుదే
యుట్టికి నాల్గు తేర్లుదెగియుం గలహించిన నవ్వరే జనుల్ 609

ఉ. నాటముగాఁగ మమ్ముల నవధ్యులుగాఁగొని పోరఁబోకు మీ
వేటికి మేటి పోటరులు భీష్ముఁడు ద్రోణుడు స్వైరసంచతుల్
ద్రేటున కొక్కరై తెగిరి వీరుడు పార్థునకేము లెక్కయే
వేటను మీటఁడే మములఁగూడను గూడిమిత్రైనఁబార్థులన్ 610

ఉ. తేటగఁ జెప్పినారమని తీరవి పోరఁగ బద్ధకించి కా
దోటమి గాదు నీవయిన నుండిన మేలని యంటిమన్న రా
జేటికి లేయి యింతవఱ కిట్లయి యిప్పుడు లొంగఁబోదునే
రోట శిరంబు దూర్చి వయి రోకటి పోటున కేల భీతిలన్ 611

చ. అని యట్లు శల్యవింగొని కృపాదులఁ దోడ్కొని రాజరాజు తా
నవి కరిగెన్ జయంబుఁగొను నాసను దుర్దశ నయ్యె నస్తలో
నొనరఁగ రావణుండును సుయోధనుఁడిర్వురు కట్టు మూర్ఖులం
దును బెడమూర్ఖుఁడందురు కనుంగొన వేరమి నంధరాట్సుతున్ 612

చ. రణమున కట్లువచ్చు ధృతరాష్ట్రతనూభవ వర్యుఁబాండవుల్
గనుఁగొని విస్మయంబొదవగాఁ బొదువంగను దాముదాయపై
కనువుగఁ దాఁకి రత్తఱిని యాదవనాథుని పంపు పెంపునన్
బెనఁకువకు న్యుధిష్ఠిరుఁడు పిల్చెను శల్యుని దన్ను దాఁకఁగన్ 613

వ. నిరుపద్రవంబుగా నావలికిం బోవు మద్ర నాథుండుమేనల్లుని పిల్పునకున్నిద్ర
నేత్రుండై కన్నుదెఱచి కనుంగొని రెండవ దండధరుండును బోలె దండధర
నందనుపైకిఁ దరలి చెలియలి కట్టఁ బొరలివచ్చు సముద్రుండునందగినమద్రేశు

సముద్రముంగాంచి ధర్మరాజు మర్మంబులుగాఁడనాడుచు నిట్లనియె 614

చ. మునమొక చెయ్యి చూచికొన మాతుల నేడు ఘటించెఁగాన నా
మనమునఁగొంకు లేదె నను మార్కొని నీవు వధింప లెస్స వే
మన మురియంగ వచ్చునని మామను గెల్చితి నన్ను కీర్తి వ
ష్మనమున నేఁదలంతు నిటులంచును శల్యుడు దాఁకె దర్మజున్ 615

క. ఇతఁడాతని నతఁడీతని
నితరేతర మారణాశ వేయుచు శరముల్
మఱి మఱచిరి బాంధవ్యము
తలఁగొని వధియించు వేళ దయయుండునొకో 616

ఉ. పోరున శల్యునింగెడపు బుద్ధినిఁ దానరి వోసి బాణమున్
వీరుడు ధర్మరాజు దయవీడక తూణము మేనమామపై
నారసి యేయ కింక నొక యాశుగయుండెగలాగి వీడుఁద
చ్ఛూరుని ప్రాణహాని కది చుట్టరికంబులు మాచువేళయే 617

ఉ. తోడును నీడవేఱయుని దూఱుదురేసిన నంచు శల్యుడున్
గూడదు మేనయల్లుఁ బొరిగొంట యటంచును మాని కాలుసే
యాడఁగ నీక ధర్మజుడు నావలఁదూపులగుప్పఁబోరఁగా
క్రీడను కొందురంచు విధి లేకయ నొంచును శల్యుఁడాతనిన్ 618

క. ఈరీతిని వారిరువురు
వారణగతి వాజినోజ వారణగతులై
పోరుచు నసమానులుగ వి
చారము విడి ధర్మరాజు శల్యునిఁద్రుంచెన్ 619

చ. శకుని సులూకునుంగదిసి సాదియుతు న్సహదేవుఁడల్కతో
శకుని కులాధిపుండు విషసర్పయుగంబును జీల్చుపోలికన్
సకలాభమత్త సామజముఁ జండు మృగేంద్రము త్రుంచుమాదిరిన్
శకలము లౌనటు ల్దునిమి చంపె నిజాగ్రజులెల్ల మెచ్చగన్ 620

